# మార్కండేయ

# పురాణము

## ( వచనకావ్యము )

ఇయ్యది

శ్రీ వోలేటి వెంకటులక్ష్మీనృసింహశర్మ

ప్రణీతము




ప్రకాశకులు :

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,**

సంపూర్ణాంధ్ర గ్రంథాలయం. (స్థాపితం 1882)

రాజమహేంద్రవరం.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము

పుట

## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



శ్రీ ర స్తు

శ్రీ రాజరాజేశ్వరాయనమః

# మార్కండేయ పురాణము

## వచనం - ప్రథమాశ్వాసము

శ్లో॥ బాలార్కకోటి ద్యుతిమప్రమేయం
బాలేందు రేఖాకవితోత్తమాంగ
భ్రమద్విరేఫా వృషగండ భాగం
భజే భవానీ తనయం గణేశం॥

శ్లో॥ బాలార్కాయుత సుప్రభాం ।
కరతలే కాదంబ మాలాంకులాం ।
మాలాంసుందధతీం మనోహరతనుం ।
మందస్మితో ద్యన్ముఖీం ।
మంద మంద ముపేయుషీం ।
వరయితుం శంభుం జగన్మోహినీం ।
వందే దేవమునీంద్ర వందితపదా ।
మిష్టార్థదాం పార్వతీ॥

శ్లో॥ రక్తవస్త్ర సమాయుక్తాం। పక్వబింబ ఫలాధరాం।
దివ్యనారీ సమాయుక్తాం। దివ్యాలంకార సంయుతా।
అప్సరోగణ సంకీర్ణాం। కిన్నరీభిస్సమావృతాం।
స్ఫురత్సుకంఠ సంయుక్తాం। పద్మాయతలోచనాం।
మందస్మిత సమాయుక్తాం। ముఖాంభుజ విరాజితం।
ముక్తాహారసమాయుక్తాం।గ్రీవాంగంధర్వసంస్తుతాం।
ఆజానత భుజాం భోజ। మునికన్యాభి సంస్తుతాం।
రక్తపద్మ ప్రతీకాశ పాదాంబుజ విరాజితం।
నమామి శ్రీమహాదేవీం పార్వతీ లోకమాతరం॥

శ్లో॥ యాకుందేందు తుషారహారధవళా।యాశుభ్రవస్త్రావృతా।
యావీణావరదండమండితకరా। యా శ్వేతపద్మాసనా।
యాబ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవైస్సదాపూజితా।
సామాంపాతుసరస్వతీభగవతీ।నిశ్శేషజాడ్యాపహా॥

అని ఇష్టదేవతా ప్రార్థనంబును, గురుజన బుధ జనంబులకు నమస్కారంబులును, దేవ బ్రాహ్మణ వేద నిందాపరులగు దుష్టజనంబులకు తిరస్కారంబులును జేసి, శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరుల హృదయ కమలంబున నిలిపి నేను వ్రాయంబూనిన ఇతిహాస గ్రంథంబగు "మార్కండేయ పురాణంబు" అను వచన కావ్యమునకు కథాక్రమంబు యెట్టులనిన :

# కథా ప్రారంభం

భారత యుద్ధానంతరమున అభిమన్యు పుత్రుండైన పరీక్షితు మహారాజుచే చతుస్సముద్ర ఆవృతమైన భరత ఖండంబు ధర్మయుక్తంబుగా అరువది నాలుగు సంవత్సరంబులు పరిపాలనంబు జేసి ఒకానొక కారణంబున ప్రాయోపవేశుండై తన కుమారుడు జనమేజయునకు భరతవంశానుగతంబగు ఆచారక్రమంబున రాజ్యభారంబు నిచ్చిన, జనమేజయుండు వంశానుక్రమంబుగా ధర్మపాలనంబున రాజ్యంబును పరిపాలనంబు జేయుచు సర్పయాగాది యజ్ఞంబులను జేసి దేవతా పితృఋణంబులను దీర్చుచు ఒకానొక కారణంబున మహా ఫలంబును కోరి వ్యాస మహాముని శిష్యుండైన వైశంపాయన మహామునివలన శ్రీ మహాభారతంబను పంచమవేద మనంబడు భరతవంశ రాజుల చరిత్రను సమగ్రముగా విని మహాసంతోషమును బొంది మనస్సున కొన్ని సంశయంబులు గలుగగా వైశంపాయన మహామునిం గాంచి-“ ఓ మునిపుంగవా! నీవలన మహాభారతంబును పదునెనిమిది పర్వంబులును శ్రోత్రానందముగ విని సంతోషించితిని. గాని మనస్సున కొన్ని సంశయంబులు గలుగుచున్నవి, వాటినిగూడా నివర్తింప జేయవలె ” ననిన.

వైశంపాయన మహామునివిని-" ఓ జనమేజయా! ఆ సంశయంబులు చెప్పుమ" ని కోరెను.

జనమేజయుడు జెప్పుచున్నాడు-"ఓ మునిపుంగవా! శ్రీమహావిష్ణువు ఏ కారణంబున మానవుడై పుట్టి శ్రీకృష్ణ నామమున ప్రవర్తిల్లెను? ద్రుపద మహారాజు పుత్రికయైన ద్రౌపదికి అయిదుగురు భర్తలగుటకు కారణమేమి? బలరాముడు కౌరవులందుగాని, పాండవులందుగాని యుద్ధ కాలమునందు జేరక తీర్థయాత్రలుజేయు మిషచే వెడలి పోవుటకు కారణమేమి? ఉపపాండవులైన ద్రౌపతీపుత్రులు అయిదుగురును మహారాజు పుత్రులయ్యును వివాహాది సంస్కారంబులులేక దిక్కులేనివారయి మృతి పొందుటకు కారణమేమి? యీ విషయంబులు నాకు జెప్పి నా సంశ యములను పోగొట్టవలసిన ద" ని కోరెను.

ఆ మాటలను విని వైశంపాయన మహాముని—" ఓ జనమేజయా! ఒక కాలమునందు మార్కండేయ మహామునిని జైమిని మహాముని నీవడిగిన విషయం బులనే ప్రశ్నించగా, మార్కండేయుడు జైమినికి జెప్పిన విషయంబులను నీకు జెప్పుచున్నాను శ్రద్ధగా" వినుము.

మహాతపశ్శాలియైన మార్కండేయునిజూచి జైమిని మహాముని యిటులని ప్రశ్నించెను—" ఓ మునిశ్రేష్ఠా!

శ్రీ వ్యాసమహాముని వలన సకల పురాణంబులను వింటిని. యిప్పుడు నీవలన కొన్ని సంశయంబులను వినవలయు నను కోరికచే వచ్చితిని. వాటిని జెప్పవలయును" అని కోరెను.

ఆ మాటలు మార్కండేయుడు విని—"ఓ జైమిని మునీ! నీ సంశయములు యేవో వాటిని జెప్పుము" అనెను.

జైమిని జెప్పుచున్నాడు—"శ్రీమహావిష్ణువు యేమి కారణంబున మానవుడై పుట్టి శ్రీకృష్ణుడను పేరుతో ప్రవర్తిల్లెను? ద్రౌపదికి అయిదుగురు భర్తలగుటకు కారణము యేమి వున్నది? బలరాముడు కౌరవ పాండవుల యందు యుద్ధకాలమున యే పక్షమునకు జేరక తీర్థయాత్రలు జేయుటకు వెళ్లుటకు కారణమేమి? మహారాజు పుత్రులయ్యు ద్రౌపది పుత్రులు వివాహాది సంస్కారములు లేక మృతి పొందుటకు కారణమేమి?" అని అడిగెను.

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"ఓ జైమిని మునిపుంగవా! నాకు యిప్పుడు తపోకాలము అయి వున్నది. నీకు వినవలయునని కోరిక యున్నయెడల వింధ్యపర్వతమునకు వెళ్లుము. ఆ పర్వత గుహాయందు పింగాక్షము, నిబోధము, సుపత్రము, సుముఖము లను నాలుగు పక్షులు గలవు. అవి మందపాలసుతులైన ద్రోణుని

పుత్రులు. వారికి వేదశాస్త్రార్థంబులు బాగుగ దెలియును. వాని సమీపమునకు వెళ్ళి అడుగుము అవి నీకు బాగుగ దెలియునటుల జెప్పును ''అని మార్కండేయుడు జెప్పెను.

ఆ మాటలకు జైమిని ఆశ్చర్యముపొంది-' అయ్యా! మార్కండేయా ! అవి ద్రోణునకు ఎటుల బుట్టెను ? వాటికి మనుష్య వాక్యములు యెటుల వచ్చెను ? మనుష్య వాక్యములు వచ్చినను జ్ఞాపకము వుండుటకు కారణమేమి జెప్పుము ?' అని కోరెను.

మార్కండేయుడు జెప్పుచున్నాడు-" ఓ జైమినీ ! ఒకనాడు నారదమహాముని భూలోకము అంతయు తిరిగి ఇంద్రుని జూచుటకు స్వర్గమునకు వెళ్లెను. ఆ సమయము నందు రంభ, ఊర్వశి, మిశ్రకేశి, తిలోత్తమ, ఘృతాచి, మేనక మొదలగు దేవవేశ్యలు నృత్యమును జేయుచుండిరి. అటువంటి సమయమునందు వచ్చిన నారద మహామునిని దేవేంద్రుడు పూజించి గూర్చుండబెట్టి-" ఓ మునిపుంగవా! ఈ నృత్యము చేయుచున్న వేశ్యలలో నీకు ఇష్టమైనదానిని జెప్పు " మని అడిగెను.

దేవేంద్రుడు జెప్పిన మాటలు నారదుడు విని— " ఓ నారీమణులారా ! మీలో రూప, యవ్వన, నృత్య, అభినవ సౌందర్యాది నేర్పుగలవారు నృత్యమును జేయు " డని జెప్పెను.

ఆ మాటలు రంభాదులు విని సిగ్గుపడి భయముచే యేమియు జెప్పక యూరకుండిరి.

అంతట దేవేంద్రుడు నారదుని జూచి— "మీరే ఆనతియ్యవలె న"నెను.

ఆ మాటలు నారదుడు విని— "ఓ శృంగార వతులారా! మీలో ఎవ్వరు దూర్వాస మహామునిని మోహింప జేయగలరో ఆ స్త్రీయే శ్రేష్టత్వము గలదగును" అనెను.

నారద మహాముని జెప్పిన వాక్యములు రంభాదులు విని గజగజ వణకుచు భయముజెంది మాట్లాడలేక యూరకుండిరి. అందులో వపువు అను మదవతి— "నేను దూర్వాసుని మోహింప జేయగల దానన"ని జెప్పెను.

ఆ మాటలను దేవేంద్రుడు విని- "ఓ పంకజాక్షి! నీవు దూర్వాసుని తపంబునకు విఘ్నంబును గలుగజేసి వచ్చిన నీకు కావలసిన ధనరాసుల నొసంగెదన"ని జెప్పి తాంబూలాదులనిచ్చి పంపించెను.

అప్సరసయగు వుపువు దేవేంద్రాదులవద్ద అనుజ్ఞ తీసుకుని వసంతాది శృంగారములను, మలయాది మంద మారుతంబులను, హాస్యాది నవరసంబులును, సహాయంబుగా తీసుకుని దూర్వాస మహాముని తపంబు జేయు

చున్న హిమాలయ పర్వతంబునకు వెళ్ళి ముని ఆశ్రమంబునకు క్రోశమాత్ర దూరంబున శృంగారంబగు వనంబున గూర్చుండి సప్త స్వరంబులు మేళనంబుజేసి గానంబు జేయుచుండెను. ఆ గాన మాధుర్యమునకు పక్షులు గాని, మృగంబులుగాని, సర్పరాజంబులుగాని, వృక్షంబులు గాని చలనంబులేక చెక్షు శ్రోత్రంబగు గానామృతంబును పానంబు జేయుచు నిర్జీవ ప్రతిమవలె నుండెను.

ఆ గానామృతము దూర్వాసుని జెవులు బడగానే ఆశ్చర్యపడి మైమరచి గానమార్గంబున బయలుదేరి వచ్చి ఆ యప్సరసను జూచి తత్వజ్ఞానము గలిగి-" ఓ నారీమణీ! ఈ నిర్జన వనమునందు అమృత మయమగు సంగీతమును పాడుటకు కారణమేమి ?" అని ప్రశ్నించి-" ఓ మీనాక్షీ! నీవు నన్ను మోసపుచ్చుటకు వచ్చినదానవని తోచుచున్నది. నీవు నా తపోభంగము జేయుటకు వచ్చినదానవని తోచు చున్నది, గావున నీవు పక్షికులమునందు పుట్టుము" అని శాపము యిచ్చెను.

అంతట నా వపువు-" మునిపుంగవా! నా అజ్ఞానమును మన్నింపుము" అని ప్రార్థించెను.

అంతట మహాముని కరుణించి—" నీవు పక్షి రూపంబున పదియారు వత్సరంబులుండి నలువురు పుత్రులం

బడసి పిదప అర్జుని బాణాగ్నిచే మృతినొంది నీ నిజ రూపమును బొంది స్వర్గసుఖంబులను పొందెదవ"ని జెప్పి తపంబునకు జనెను.

అంత నా వపువు గరుడుని వంశమందలి కంక పక్షి రూపమును దాల్చి మందపాల సుతుండగు ద్రోణుని పెండ్లియాడి పది ఆరు సంవత్సరములు సుఖంబు లనుభవించి, పది ఆరవ సంవత్సరమున గర్భంబుదాల్చి స్వేచ్ఛగా దిరుగుచు ఆ సమయమందు జరుగుచున్న కురు పాండవ యుద్ధంబును జూచుటకు కోరిక గలిగి అంతరిక్షంబున దిరుగుచుండగా అర్జునుండు విడచెడు శరపరంపరలగు బాణంబులలో నొక్క బాణము కంకపక్షికి తగిలెను. ఆ పక్షి బాణము తగులగానే తన గర్భమునందుగల నాల్గు పిండములను క్రిందవిడిచి వీటిని భగవంతుడు 'రక్షించుగాక' యనిజెప్పి ప్రాణమును వదలి యప్సరస స్త్రీ రూపమును బొంది స్వర్గమునకు బోయెను. అటుల విడువబడిన అండములు నేలపైబడెను. ఆ గ్రుడ్లు నేలయందు బడగానే దైవబలమువలన మదగజముయొక్క మెడయందు వ్రేలాడుచుండు ఘంట అర్జుని బాణంబున దెగి అండములపై బడి గర్భకుహరంబువలె కప్పబడి రక్షింపబడుచుండెను. పిమ్మట కొంతకాలమునకు అవి పిల్లలై గర్భగోళమువలె

రక్షింపబడుచున్న ఘంటావరణమునందే కిచకిచలాడుచు తిరుగుచుండెను. యుద్ధవీరుల ప్రతాప వాక్యములును భటుల కోలాహలములును, చెవులు బ్రద్దలగునటుల మ్రోగుచుండెడి రణభేరీ ధ్వనులను వినుచు బయటకు వచ్చుటకు అవకాశములేక అందే తిరుగుచుండెను.

ఈ విధముగా చాలాకాలము అందే వుండగా ఒక నాడు శమీకమహాముని ఆ మార్గమునందు బోవుచుండగా ఆ పక్షిపిల్లల కిచకిచధ్వని విని ఆశ్చర్యముపొంది నెమ్మదిగా ఆ ఘంటను పైకి ఎత్తి వాటిక్రిందనున్న ఆ నాలుగు పక్షి పిల్లలను తన ఆశ్రమమునకు తీసుకునివెళ్లి పెంచుచుండెను.

అంతట ఆ పక్షిపిల్లలు తమను తండ్రివలె కాపాడుచున్న మునింజూచి నమస్కరించి—"అయ్యా! మునిపుంగవా! మమ్ము తండ్రివలె కాపాడుచుంటివి. మేము చేయవలసిన కార్యము నీకు వున్నయెడల ఆనతిమ్ము"ని కోరెను.

ఆ మాటలు శమీకమహాముని విని-"ఓ పక్షులారా! మీరు మనుష్యవాక్యములతో మాట్లాడుచున్నారు. మీరు ఎవ్వరు? మీకు మనుష్య వాక్యములు వచ్చుటకుగల కారణమేమి? చెప్పవలసినద"ని కోరెను.

ఆ ముని మాటలు విని పక్షులు జెప్పుచున్నవి—" ఓ మునిపుంగవా ! మా వృత్తాంతము జెప్పుచున్నాము " వినుము. పూర్వము విపులుడు అను మునికి సుకృశ, తుంబురులను యిద్దరు పుత్రులు గలరు. అందు పెద్దవానికి మేము నలుగురు పుత్రులము పుట్టితిమి. మేము తల్లి దండ్రులయందు భయభక్తులు గలిగి వేదాధ్యయనాదులను జేయుచుంటిమి.

ఒకనాడు దేవేంద్రుడు మాయావియై మా తండ్రియైన సుకృశుని ధర్మమార్గమును పరీక్షించుటకు ముసలి డేగ రూపమునవచ్చి మా తండ్రితో-" అయ్యా, సుకృశ మునీ ! నేను వింధ్యపర్వతంబున తిరుగుచుండగా వేరొక బలిష్టమైన డేగ రాగా ఆ పక్షికిని నాకును ఘోరయుద్ధము జరిగినది. ఆ విధముగా ఏడు అహోరాత్రములు యుద్ధము జేసితిమి. నేను వార్ధక్యముచే యుద్ధమును జేయలేక తుదకు తప్పించుకుని నీ ఆశ్రమమునకు వచ్చితిని. నేను మిక్కిలి ఆకలిచేతను, యుద్ధముచే బడలిక చేతను మిక్కిలి కృషించి యుంటిని. నీవు ధర్మబుద్ధిగల మునివని వింటిని. నాకు శరీరధారణమునకు నరమాంసము గావలెను, యివ్వవలసిద "ని కోరెను.

ఆపక్షి వాక్యములను మా తండ్రివిని నరమాంసము యిచ్చుటకు అంగీకరించి మమ్ముల నలువురను జూచి— "ఓ పుత్రులారా! మీరు పితృఋణమును దీర్చుటకుగాను మీలో ఒక్కరు ఈ పక్షికి ఆహారముగా వెళ్ళుమ"ని చెప్పెను.

మేము తండ్రి జెప్పిన వాక్యములనువిని- "తండ్రీ! నీవు మేము పుట్టుటకు కారణభూతుడవై యుంటివిగాని, పోషణాది సంరక్షణ తల్లియందు గలదు. పితృ మాతృ ఋణంబులు తీర్చుటకు పక్షికి ఆహారముగా వెళ్ళుమని జెప్పి యున్నావు. సూ॥ ఆత్మానం సర్వదా రక్షతే, శరీర మాద్యం ఖలు ధర్మసాధనం॥ అనిన్ని పెద్దలచే చెప్పబడియున్నది. అనగా మొదట తన శరీరమును రక్షించుకొనుచు ధర్మ మార్గమున నడచుచు ఇతరుల క్షేమముకొరకు పాటు పడ వలసినదని జెప్పబడియున్నది. గాన తన శరీరమును యితరుల కొరకు యిచ్చుట ధర్మముకాదు. అందువలన మా శరీరములను యివ్వజాలము "ని చెప్పితిమి.

అంతట మా తండ్రి కోపించి మమ్ములను పక్షి వంశంబున బుట్టుండని శపించెను. అటు తరువాత మా తండ్రి పక్షిరూపముననున్న దేవేంద్రునకు తన శరీరమును యిచ్చెదనని చెప్పెను. ఆ మాటలు విని దేవేంద్రుడు

పక్షిరూపమును వదలి ప్రత్యక్షమై నీ సత్యమునకు మెచ్చి సంతోషించితిని అనిజెప్పి వెడలిపోయెను. అంతట మేము మా తండ్రి యిచ్చిన శాపంబునకు భయపడి-" ఓ తండ్రీ! మేము శరీరమునందుగల ఆశచే శరీరనాశనమునకుగాను దేవేంద్రునకు యివ్వజాలక పోయితిమి " అని వేడుకొనగా మా తండ్రి కరుణించి-" మీరు వింధ్య పర్వతముయొక్క గుహలయందు జ్ఞానముగల పక్షులయి యుండుడు. పిమ్మట కొంతకాలమునకు జైమినిముని మీవద్దకు వచ్చును. ఆ మునికిగల సందేహములను మీరు దీర్చగలరు. సందేహములను దీర్చినపిమ్మట ఆ మునివలన శాపవిముక్తులరై సుఖించెదరు "అని ఆనతిచ్చెను.

అని జెప్పగానే శమీక మహాముని విని-" ఓ పక్షి కులోత్తములారా! మీరు వెంటనే వింధ్యపర్వతమునకు వెళ్ళుడ "ని జెప్పి పంపించి వేసెను.

కాబట్టి ఆ పక్షులు అచ్చట నివసించియున్నవి. నీవు అచ్చటకువెళ్ళి నీ సంశయములను దీర్చుకొమ్మని జెప్పి మార్కండేయుడు జైమిని మునిని వింధ్య పర్వతము వద్దకు పంపించివేసెను.

## జైమిని ధర్మపక్షుల సంవాదము

జైమిని ముని మార్కండేయుడు జెప్పిన విధముగా వింధ్య పర్వతమునకు వెళ్ళి స్పష్టముగా వేదాధ్యయనము జేయుచున్న పక్షుల అధ్యయనమువిని సంతోషించి-" ఓ పక్షికుల శ్రేష్ఠులారా ! మార్కండేయుని వచనము ప్రకారము నా సంశయములను మీవలన విని పోగొట్టుకొనుటకుగాను మీవద్దకు వచ్చితిని. కాబట్టి నా సంశయములను తీర్చవలసినద "ని కోరెను.

జైమిని ముని జెప్పిన ప్రశ్నములను ధర్మపక్షులు విని ఈ విధముగా జెప్పుచున్నవి :

అయ్యా ! జైమిని మహాముని ! భగవంతుడు—

శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః ।
జ్ఞాన వైరాగ్య యోశ్చాపి షణ్ణాంవర్గో భగస్మృతః॥

అను షడ్గుణైశ్వర్య సంపన్నుడు, శ్రీమహావిష్ణువు పాపము అధికమై భూపరిపాలనము దుష్టుల ఆధీనమైనప్పుడు దుష్టశిక్షణ, శిష్టజన పరిపాలన కొరకు భగవంతుడు అనేకములగు మనుష్యాది జన్మములను యెత్తుచుండును.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

అని జెప్పఁబడియున్నది. ఆ విధముగానే—

శ్లో॥ మత్స్య కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః।
రామో రామో రామశ్చ బౌద్ధః కలికి మేవచ॥

అని జెప్పబడి యున్నది. ఆ విధముగానే ద్వాపర యుగాంతమునందు భూభారము అధికముకాగా మహా విష్ణువు యాదవకులమునందు శ్రీకృష్ణరూపమున బుట్టెను. దేవతలు యాదవులై పుట్టిరి, భూభారము తగ్గించుటకు.

౨వ ప్రశ్న : ద్రౌపదికి అయిదుగురు భర్తలు అగుటకు కారణమును జెప్పుచున్నాము వినుము :

“ఓ జైమిని మునీ! పూర్వము త్వష్ట ప్రజాపతి పుత్రుడు త్రిశిరుడు మాయావియై తపంబు జేయుచుండగా దేవేంద్రుడు తెలిసుకుని త్రిశిరుని శిరంబు వజ్రాయుధంబున ఖండించివేసెను. అందువలన యింద్రునకు బ్రహ్మహత్యాపాతకంబు సిద్ధించెను. ఆ బ్రహ్మహత్యవలన యింద్రుని తేజంబు నాలుగు భాగంబులుగా విడిపోయి ఒక భాగము ధర్మునందు, రెండవభాగము వాయువునందును మూడు నాల్గు భాగములు అశ్వినీ దేవతలయందును

ప్రవేశించెను. పిమ్మట నాల్గువిధములైన తేజంబులు సలన భూలోకమునందు కుంతీగర్భంబున ధర్మజ, భీమ, నకుల సహదేవులుగా జన్మించి తాను అర్జునుడై పుట్టెను. శచీదేవి ద్రుపద మహారాజుచే చేయబడిన యాగమునందు అగ్ని కుండమున ద్రౌపది అయి పుట్టెను. ఆ కారణమున ద్రౌపదికి అయిదుగురు భర్తలు అయిరి.

౩ వ ప్రశ్న : బలరాముని వృత్తాంతమును జెప్పు చున్నాము వినుము :

ఓ జైమిని మునీ! బలరాముడు శ్రీకృష్ణుడు తనకు తమ్ముడు అయివుండిన్ని పాండవులయందు అనురాగముచే యుద్ధకాలమున పాండవుల పక్షమున జేరలేదు. ధృతరాష్ట్ర పుత్రుడైన దుర్యోధనుడు తనకు శిష్యుడున్ను, ప్రేమ పాత్రుడున్ను అయివుండెను. తాను తన తమ్ముడని శ్రీకృష్ణునితో గలసి పాండవులలో జేరినయెడల తన శిష్యుడైన దుర్యోధనునితో యుద్ధమును జేయవలసి వచ్చును. లేదా తన శిష్యుడని దుర్యోధనునితో జేరిన యెడల తన తమ్ముడైన శ్రీకృష్ణునితో యుద్ధమును జేయ వలసి వచ్చును. గాన యీ రెండువిధములయిన విష యంబులను ఆలోచించి బలరాముడు యెవరి పక్షమునకు జేరక తీర్థయాత్రలు జేయుటకు వెడలిపోయెను.

౪వ ప్రశ్న : ఉపపాండవుల వృత్తాంతము జెప్పు చున్నాము వినుము :

ఓ జైమిని మునీ ! త్రేతాయుగమునందు హరిశ్చంద్రుడను రాజు రాజ్యము పాలించుచుండగా, విశ్వామిత్రుడు హరిశ్చంద్రునిచే అసత్యమును పలికించెదనని ప్రతినబూని హరిశ్చంద్రుని వద్దకు వచ్చి యాగ దక్షిణను యాచించి అది నీవద్దనే ఉంచవలసినదని జెప్పి వెడలిపోయెను. మఱికొంత కాలమునకు వచ్చి, మిష కల్పించి రాజ్యమును పుచ్చుకుని హరిశ్చంద్రుని నీవు నాకు యివ్వవలసిన యాగ దక్షిణ యివ్వవలసినదని బాధించెను. హరిశ్చంద్రుడు రాజ్యమును యిచ్చివేయుటచేత దగ్గిర ధనము లేకపోయెను.

అది జూచి విశ్వామిత్రుడు-" హరిశ్చంద్రా ! నీవద్ద దనము లేనియెడల నేను యివ్వనక్కరలేదని జెప్పుము, వెడలి పోయెదను " అని జెప్పెను.

ఆ మాటలు హరిశ్చంద్రుడు విని-" విశ్వామిత్రా ! మాట శాశ్వితముగాని, శరీరము శాశ్వితముగాదు. ఒక నెల రోజులు గడువును ఇమ్ము " అని జెప్పెను.

విశ్వామిత్రుడు ఆ మాటలను విని—"ఓ హరిశ్చంద్రా! నా శిష్యుని నీవెంట పంపించెదను. నా శిష్యునకు సొమ్మియిచ్చి పంపించుము" అని జెప్పెను.

హరిశ్చంద్రుడు తన భార్యను, కుమారుని, విశ్వామిత్రుని శిష్యుని వెంటబెట్టుకుని కొన్ని దినములకు కాశీని జేరెను. అప్పటికి ఒకటి రెండు రోజులు తక్కువగా నెల రోజులు కాజొచ్చెను. విశ్వామిత్రుడు వచ్చి తనడబ్బు ఇవ్వవలసినదని హరిశ్చంద్రుని బాధించెను. హరిశ్చంద్రుడు అసత్యము పలుకుటకు యిష్టములేక తన భార్యాపుత్రులను అమ్మి విశ్వామిత్రునకు సొమ్ముయిచ్చెను. విశ్వామిత్రుడు ఆ ధనమును తీసుకుని అది తన శిష్యుని దారిభత్యమునకు సరిపోయినదనిన్ని తనకు యివ్వవలసిన ధనము యివ్వవలసినదనిన్ని బాధించెను. హరిశ్చంద్రుని విశ్వామిత్రుడు బాధించుటను జూచి విశ్వదేవతలు అయిదుగురు విశ్వామిత్రునకు ధర్మమును జెప్పుటకు వచ్చిరి. అప్పుడు విశ్వామిత్రుడు—"విశ్వదేవతులారా! మేము కోరకుండగా ధర్మమును జెప్పుటకు వచ్చిరి. గాన మీరు భూలోకమునందు మనుష్యులై పుట్టుదురుగాక" అని శాపమును యిచ్చెను.

ఆ శాపమును విశ్వదేవతలు విని భయపడి ప్రార్థించగా విశ్వామిత్రుడు దయదలచి-" మీరు పాండవ వంశమునందు ద్రౌపది గర్భంబున ఉపపాండవులై బుట్టి వివాహాది సంస్కారములు లేక అనాధలవలె యుద్ధమున మృతి బొంది స్వర్గమునకు పోవుదురు " అని జెప్పెను ఆ కారణముచేత ఉపపాండవులు కౌరవ పాండవ యుద్ధమునందు అనాధులవలె మృతిని పొంది స్వర్గమునకు వెడలిపోయిరి " అని పక్షులు జెప్పెను.

పక్షుల మాటలువిని జైమిని-" ఓ పక్షులారా ! హరిచంద్రుని మిగిలిన విషయములను జెప్పవలసిన " దని యడిగెను.

జైమిని మాటలు పక్షులు విని యిలా చెప్పుచున్నవి-" ఓ జైమినీ ! హరిశ్చంద్రుడు విశ్వామిత్రుడు పెట్టెడు బాధలు సహించలేక తాను కాశీయందు కాటికాపరియగు వీరబాహువను వానికి అమ్ముడుపడి విశ్వామిత్రునకు ధనమును యిచ్చి ఋణవిముక్తి జేసుకొని ఆ స్మశానమునందే నివసించుచు తన యజమానికి రావలసిన డబ్బు పుచ్చుకొనుచు తాను కాటికాపరి కూలి పుచ్చుకొని జీవించుచుండెను.

ఈ విధముగా కొంతకాలము జరిగినపిమ్మట హరిశ్చంద్రుని కుమారుడు పాముగరచి చనిపోగా, హరిశ్చంద్రుని భార్య అతనికి అగ్ని సంస్కారమును జేయుటకు తన దగ్గిర డబ్బులేక అర్ధరాత్రియందు కుమారుని స్మశానమునకు తీసుకునివచ్చి అగ్ని సంస్కారము జేయుటకు ప్రయత్నించు చుండెను.

ఆ అర్ధరాత్రమునందు స్మశానవాటికలో మనుష్య సంచలనము కనిబెట్టి హరిశ్చంద్రుడు శవమువద్దకువచ్చి- " ఓ అబలా ! నీవు మా యజమానికి రావలసిన సుంకమును యివ్వక శవమును దహనము జేయుటకు వల్ల కాదు " అని జెప్పెను.

ఆ మాటలకు అబల—" అయ్యా ! చక్రవర్తి కుమారుడు అనాధవలె మృతిపొందెను. నావద్ద ధనము లేదు. గాన యీ శవమును దహనపర్చుటకు అనుమతించవలసిన " దని జెప్పెను.

యిటుల జెప్పగా విని—" ఓ కాంతామణీ ! నీవు ఎవరవు ? నీకు యేల దిక్కులేక పోయినది ? " అని యడిగెను. యిటుల వాదోపవాదములవలన హరిశ్చంద్రుడు ఆమె తన భార్య అని, ఆమె అతడు తన భర్త అనిన్ని తెలుసుకుని బిగ్గరగా యేడ్చుచుండిరి.

అంతట శ్రీ అన్నపూర్ణాదేవి సమేతముగా శ్రీ విశ్వేశ్వరుడు ప్రత్యక్షమయ్యెను. అంతట దేవేంద్రాదులు, విశ్వామిత్రాదులు వచ్చిరి. శ్రీ పార్వతీ పరమేశ్వరులు హరిశ్చంద్రుని జూచి—" ఓ రాజా ! నీవు విశ్వామిత్రుని వలన శాశ్వితముగా 'సత్యహరిశ్చంద్రుడవ'ని ప్రఖ్యాతిని పొందెదవు. నీవు పడిన బాధలు విశ్వామిత్రుడు చేసిన మాయగాని వేరుకాదు " అని కుమారుని బ్రతికించి, హరిశ్చంద్రునకు కోరిన వరములనిచ్చి-" విశ్వామిత్రా ! నీవు ఈ హరిశ్చంద్రుని అయోధ్యకు దీసుకుని వెళ్ళి రాజ్యమును వప్పగింత జేయవలసిన " జెప్పి అదృశ్యుడాయెను.

ఆ ప్రకారము హరిశ్చంద్రుని విశ్వామిత్రుడు రాజ్యమునందు నిలిపి రాజ్యమును పాలించునటులజేసి అనేక వరంబులు యిచ్చి తన ఆశ్రమమునకు బోయెను " అని పక్షులు జెప్పగానే జైమిని ముని విని మహానందము పొందెను.

జైమిని మునిని జూచి పక్షులు జెప్పుచున్నవి— " మునీంద్రా ! ఒక చిత్రమైన విషయంబును జెప్పుచున్నాము " వినుము.

హరిశ్చంద్రునకు పురోహితుండగు వశిష్ట మహా ముని పదిరెండు సంవత్సరములకు పూర్తి అగు తపంబును నీట మధ్యను మునిగి జలస్థంభనమును జేసి తపంబును జేయుచుండెను.

వశిష్టుడు తపంబును పూర్తిజేసుకొని జలమధ్య మును వీడి తన ఆశ్రమమునకు వచ్చెను. అంతట తన ఆశ్రమమునందుగల శిష్యులున్ను యితర మునులున్ను విశ్వామిత్రుడు హరిశ్చంద్రునికి పెట్టిన బాధలను అను పూర్వక్రమముగా జెప్పిరి. విశ్వామిత్రుడు తన శిష్యుడైన హరిశ్చంద్రుని బాధలు పెట్టినాడని విని కోపముగలవాడై విశ్వామిత్రునివద్దకు వెళ్ళి-" ఓ విశ్వామిత్రా ! నీవు క్రూరుడవు. బ్రహ్మఋషివని గర్వముగలవాడవు. క్రూరుడవును. పాపంబునకున్ను, లోకనిందకును, ఝడియక పాపకార్య ములను జేయుచుంటివి. నా పుత్రులను నూర్గురను బరి మార్చితివి. అందులకు నేను విచారించను. నా శిష్యుడైన హరిశ్చంద్రుని అనేక విధములుగా బాధించినాడవు. తప్పు గలిగినప్పుడు శిక్షించక తప్పదు. కావున ఆ పాపంబునకు నీవు బకరూపంబున నుందువుగాక " యని శపించెను.

ఆ శాపవాక్యములను విశ్వామిత్రుడు విని కోపము గలవాడై——" ఓ వశిష్టా ! నీవు బ్రహ్మకులంబున బుట్టి

నానని గర్వమున నన్ను శపించితివి, కావున నీవు దేగ రూపంబున నుందువుగాక "యని మారుశాపమును బెట్టెను. యీ ప్రకారము అన్యోన్య శాపంబుల నిద్దరును బక, దేగ రూపంబుగలవారై పూర్వవైరమును దలచుకొని యుద్ధంబునకు ఆరంభము జేసిరి.

## వశిష్ట విశ్వామిత్రులు పక్షిరూపమున పోరుట

యీ విధముగా వశిష్ట విశ్వామిత్రులు పక్షిరూపములను దాల్చి ఘోరముగా పోరుచుండగా నూరు ఆమడల పొడవును, లావును గల ఆ పక్షులు యుద్ధము జేయుచున్న భూమి అంతయు గజగజ వణకుచుండెను. సముద్రములు అల్లకల్లోలము లగుచుండెను. పర్వతములు విరిగి పడుచుండెను. అష్టదిక్పాలురు భయపడిరి. భూమియందు ఉత్పాతములుపుట్టి ప్రజానాశన మగుచుండెను. ఆ విధముగా భూమియందు ఉత్పాతములు పుట్టుట జూచి దేవేంద్రాది దేవతలు బ్రహ్మకు విన్నవించిరి.

బ్రహ్మ ఆ మాటలు విని దేవేంద్రాదుల వెంట బెట్టుకుని పక్షులు పోరుచున్న తావునకువచ్చి—"ఓ మునులారా! మీరు ఉభయులును యితరుల విషయములందు

కలుగజేసుకుని వృధాగా లోకములకు కీడును జేయు చున్నారు. మీరు యిద్దరును బ్రహ్మఋషులయి యుండియు పోరుట తగదు. మీరు పక్షిరూపములను వదలి మీ నిజ రూపములను పొందుడు" అని పలికెను.

పక్షిరూపములను వదలి వశిష్ట విశ్వామిత్రులు బ్రహ్మయెదుట నిలువబడిరి.

వారిని బ్రహ్మ జూచి—"ఓ మునులారా! మీరు లోకములన్నిటియందు పూజింపబడుచున్నవారు. అటు వంటి మీరు రాక్షసస్వభావములను పొంది తగవులాడు చున్నారు. వశిష్టా! విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని బాధిం చుటచేతనేగదా అతడు 'సత్యహరిశ్చంద్రుడు' అనే పేరును పొందియున్నాడు. పైగా ఎప్పుడో జరిగిన విషయమును గురించి యిప్పుడు తగవులాడకూడదు. యిప్పుడు మొదలు మీరు అన్నదమ్ములవలె స్నేహముతో నుండవలెను" అని జెప్పెను.

ఆ బ్రహ్మ వాక్యములను వశిష్ట విశ్వామిత్రులు విని ఆనందము పొంది ఒకరిని ఒకరు ఆలింగనమును జేసు కుని బ్రహ్మను స్తోత్రము జేయగా బ్రహ్మ దేవతలతో కూడా అదృశ్యుడాయెను. మునులు ఎవరి తావులకు వారు వెళ్ళిరి" అని జెప్పెను.

ఆ మాటలు జైమిని విని మహాసంతోషమును పొంది—"ఓ పక్షులారా! జంతువులు ఎటుల పుట్టును? అవి యే ప్రకారము వృద్ధిని పొందును? జంతువులు తల్లి గర్భమునందు ఎటుల నివసించును? తల్లి గర్భమునందు నివసించి తల్లి దిను పదార్థములను జీవుడు యెటుల అనుభవించును? తల్లి గర్భమునుండి యెటుల పుట్టును? చచ్చిన పిమ్మట యెక్కడకు పోవును? పుణ్యపాపములను యే ప్రకారము అనుభవించును? యీ విషయంబులుగల సంశయములను తీర్చవలసిన ద" ని కోరెను.

ఆ విషయములను పక్షులు విని—"ఓ జైమిని మహాముని! నీవడిగిన ప్రశ్నలు చాలా గొప్పవి. వాటిని సులభంబుగ జెప్పుటకు అలవికావు. నీ సంశయంబును దీర్చగల 'తండ్రి కుమారుల సంవాదము' అను యితిహాసము గలదు. దానిని జెప్పెదము శ్రద్ధగా వినుము" అని యిటులని జెప్పుటకు ప్రారంభము జేసెను.

## తండ్రి కుమారుల సంవాదము

"పూర్వకాలమునందు తుంగభద్రా నదీతీరంబున నంది గ్రామము అను ఒక గ్రామముగలదు. అందు వేద

వేదాంగములను చదివిన శివశర్మయను బ్రాహ్మణ పండితుడు ఉండెను. అతనికి వెంకట శర్మయను కుమారుడు గలడు. ఆ కుమారునకు శాస్త్రోక్తప్రకారముగా విద్యాభ్యాసమును జేయించి గర్భాష్టమునందు ఉపనయనము జేయించి వేదాధ్యయనమునకు గురుకుల వాసమునకు పంపించెను, ఈ విధముగా వెంకటశర్మ యేడు సంవత్సరములు వేదాభ్యాసమును జేసి గురువువద్ద అనుజ్ఞనుపొంది గృహంబునకు వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించి నిలువబడెను. తండ్రి కుమారుని విద్యాదివినయ గుణములను జూచి సంతోషమును పొంది యిటులని జెప్పెను—

"ఓ పుత్రరత్నమా! నీవు గురువులవలన వేదాది సకల విద్యలు నభ్యసించి వచ్చినవాడవు. గావున గృహస్థాశ్రమమును స్వీకరించుటకు తగిన వాడవ"ని జెప్పెను.

తండ్రి చెప్పిన మాటలను కుమారుడు వెంకటశర్మ విని పకపక నవ్వి యిటులని తండ్రితో జెప్పెను— "ఓ తండ్రీ! నేను పూర్వజన్మమునందే వేదాది సకల విద్యలను నభ్యసించి యున్నాను. ఆ విద్యలన్నియు నాకు స్ఫురహయందున్నవి. వాటిని లోకధర్మమునకు గురుకుల వాసముజేసి నభ్యసించితిని గాని వేరుకాదు. మీవంటి తల్లి

దంగ్రులను, అనేకమంది బంధువులను జూచితిని. మూత్ర పురీష యుక్తమగు మాతృగర్భ నరకంబును అనేక పర్యాయములు అనుభవించితిని. జరామరణాది దుఃఖహేతువైన సంసారాది సుఖంబులను యెరుగుదును. కర్మ జేయుట వలన మరల మరల జన్మహేతువు అగును గాని మోక్షము గలుగదు. నేను జన్మకారణమైన సంసార సుఖంబును గోరను. నాలుగు వేదంబుల వల్లను మోక్షజ్ఞానంబును బొందితిని " అని జెప్పెను.

కుమారుని మాటలు విని శివశర్మ ఆశ్చర్యమును పొంది—" కుమారా! నీకు చిన్నతనమునందే యింత జ్ఞానము యెటుల గలిగినది " అని ప్రశ్నించెను.

అందులకు కుమారుడు యిట్లనియె—" తండ్రీ! నేను పూర్వజన్మమునందు బ్రాహ్మణుడనై పుట్టి నిశ్చల తపంబున పరబ్రహ్మను గూర్చి తపంబుజేసి జ్ఞానమును పొందియు

శ్లో॥ ప్రారబ్ధం భోగతో నశ్యే తత్వజ్ఞానేన నిశ్చితం।
సంచితం ఆగామిద్వివిధం కర్మక ద్వేషీ ప్రియవాదినః॥

అని జెప్పబడియున్నది. సంచితం=క్రిందటి జన్మనుంచి తీసుకుని రాబడినది. ఆగామి=ఈ జన్మమునందు జేసినవి,

జేయుచున్నది. జేయదలంచినది. యీ రెండు విధములైన కర్మలు తెలిసిగాని, తెలియకగాని, యిష్టము వున్నను, యిష్టము లేకపోయినను, సుఖము, దుఃఖము అను రూపమున ప్రతి మనుష్యుడు (జీవము) అనుభవించక తప్పదు. అందువలన మీయందు జన్మము నొందితిని. నాకు బ్రాహ్మణాది శాపములులేవు. నా యొక్క ప్రారబ్ధము ఈ జన్మతో తీరిపోవుచున్నది. నేను తపంబుజేసి ముక్తికి పోవుదును" అని జెప్పెను.

ఆ మాటలు శివశర్మ విని కుమారుడైన వెంకటశర్మను జూచి—"నాయనా! జంతువులు యెటుల జన్మించును? ఎటుల వృద్ధిని పొందును? మాతృగర్భమునందు ఎటుల నివశించును? యెటుల వెలువడును? తల్లి గర్భమునందు వున్నప్పుడు తల్లిదినిన పదార్థములను ఎటుల దినును? మృతిపొంది యెచ్చటకు పోవును?" అని ప్రశ్నించెను.

తండ్రి మాటలు విని వెంకటశర్మ యిలా జెప్పుచున్నాడు—"ఓ తండ్రీ! వినుము. సంసారము అను రథచక్రము ఎన్నటికిని నశించదు, ఆగదు. నీకు దెలియునటుల జెప్పుచున్నాను: శరీరమునందు వేడి అను పేరుతో జఠరాగ్ని ప్రకాశించుచుండును. ఆ జఠరాగ్ని వలన మనము

తీసు పదార్ధములు జీర్ణము అగును. ఆ పదార్ధమును సుదా
నము అను వాయువు జెడకుండునటుల జేయుచు శరీరము
నందు అంతటను వ్యాపింపజేయును. అందువలన శరీరము
దారుఢ్యము, ఆరోగ్యములుగలిగి వృద్ధిని పొందుచుండును.
ధర్మచింత గలవారికిని, అన్నదానము జేయువారికిని,
అబద్ధములు పలుకనివారికిని సుఖమరణంబు కలుగును.
వస్త్రదానము జేయువారికి చలిబాధ యుండదు. ఉదక
దానము చేయువారికి దాహము వుండదు. ధర్మములు
జెప్పువారికిన్ని, జ్ఞానమార్గమును జెప్పెడువారికిని మోక్షము
గలుగును. పక్షపాతముగ మాట్లాడువారికిని, అసత్యము
పలుకువారికిని, యితరుల బాధించువారికిని, వేదములను,
దేవతలను, క్షేత్రములను దూషించువాడు కాలాంతము
నందు అనేక బాధలుపడి మరణించును. పాపాత్ములకు
మరణకాలమునందు యమదూతలు అనేక విధములయిన
భయములను కలుగజేయు రూపములు గలవారై కత్తులు,
గదలు మొదలగు ఆయుధములు ధరించి మోదుచు పాపుల
దేహములనుండి జీవుని బయటకు లాగుదురు. దానిని
యాతనా శరీరమున ప్రవేశపెట్టి మోదుచు భయంకరము
లగు నరకంబుల వెంట దీసికొనిపోవుదురు. పుణ్యాత్ములను
వారువారు జేయు దానధర్మములనుబట్టి వాహనాదులనెక్కి
పుణ్యలోకములకు తీసుకునిపోవుదురు. జీవము పోయిన

శరీరము కాకులు, గ్రద్దలు, నక్కలు మొదలగునవి తినిన యెడల ఆ జీవి యాతనా శరీరమునందు అనేక కష్టములు అనుభవించి పిశాచాది రూపంబులు ధరించి, భూమిమీద తిరుగుచు యితరులను బాధించుచు పిమ్మట పది పండ్రెండు సంవత్సరములకు వారు జేసిన కర్మలనుబట్టి నరకమునకు పోవుదురు.

మృతులు అయిన వారికి పుత్రాది బంధువులుండి ప్రేతలకు జేయవలసిన కృత్యములు సరిగా నెరవేర్చి అన్నదానమును జేసిన యెడల యాతనా దేహమునందు సుఖంబును పొంది వారువారు జేయు పుణ్యకార్యములను బట్టి స్వర్గసుఖములను పొందుదురు. కూట సాక్ష్యములను జెప్పువాడు, సాధుజనులను బాధించువాడు, నిందలు మోపువాడు రౌరవాదినరకమునకు పోవుదురు. ఆ నరకము రెండువేల యోజనంబుల పొడవును, అంతియే వెడల్పును గలిగివుండును. ఆనేల రాగిరేకులచే అమర్పబడి, ఎఱ్ఱగా కాలి, నిప్పుకణములు పైకి ఎగురుచు చూచుటకు భయమును పుట్టించుచుండును. అటువంటి యీ నరకమునందు దుష్టులను పడద్రోసి బాధింపుచుందురు యమదూతలు. దానియందు వారి శరీరములు కాలియు, మరల మరల యథాప్రకారముగానే పెరుగుచుండును.

పాపులు ఈ ప్రకారముగా బాధలు అనుభవించి క్రిమి కీటకాది జన్మమునెత్తి తిరుగుచుందురు. పుణ్యకార్యములు జేసినవారు స్వర్గమునందు రంభ, ఊర్వశీ మొదలగువారితో స్వర్గసుఖంబులు పొందుదురు.

## పిండోత్పత్తిని గురించి జెప్పుట

ఓ తండ్రీ! సృష్టిని వృద్ధిజేయుటకుగాను బ్రహ్మచే నిర్మింపబడిన పిండోత్పత్తి క్రమమును జెప్పుచున్నాను వినుము- "స్త్రీ పురుష సంయోగము వలన స్త్రీ గర్భంబున జీవుండు ప్రవేశించి బీజద్వయ రూపంబున మొదట నీరుగాను, కొంత కాలమునకు నీటబుగ్గవలెను, మరికొంత కాలమునకు మాంసఖండముగాను యుండి, విత్తనమువేసిన కొంత కాలమునకు మొలకయెత్తు విధమున క్రమ క్రమముగా అవయవ నిర్మాణములు యేర్పడును. కొన్ని దినములకు చర్మము, వెంట్రుకలు పుట్టును. ఆ పిండభాగము తల్లి తినెడు ఆహారాదులవలనను, జఠరాగ్నిచేతను గట్టిపడి నాభి హృదయ కుహరములందు వ్యాపించియుండును. ఆప్యాయనమను పేరుగల వాయువుచేత, తల్లి భుజించెడి పదార్థ విశేషములచేత పోషింపబడుచుండును.

ఈ విధముగా దినదిన క్రమముగా వృద్ధిపొంది తాను జేసిన పూర్వకర్మలను తలంచుకొనుచు నేను జేసిన పాపకర్మలచేతనుగదా యీ నరకము పొందుచున్నాను. యీ గర్భ నరకము వదలి భూమియందు పడితినేని పాపంబులను జేయక భగవంతుని గూర్చి తపంబుజేసి మోక్షమునకు పోదును అని చింతించుచు తొమ్మిదవ మాసము వెళ్ళి పదియవమాసము వచ్చిన పదిహేను దినములకు భూమియందు బుట్టి-"అయ్యో! తిరిగి సంసారము అనెడు చక్రంబున బడితినిగదా" యని మూర్ఛను పొందును. ఆ మూర్ఛయందు విష్ణుమాయ ఆవహించును. అందువలన జ్ఞానము నశించి అజ్ఞానమును పొంది యేడ్చుటకు ఆరంభము జేయును.

అటు పిమ్మట తల్లిదండ్రులచే వృద్ధిపొంది పూర్వజన్మ కర్మములబట్టి తిరుగా పుణ్యపాపంబులను జేయుచు కొంత కాలమునకు మృతినిపొంది ఘటకాయంత్రమువలె సంసార చక్రంబునబడి తిరుగుచుండును. కావున నేను సంసారమునకు గృహస్థాశ్రమము స్వీకరించనని జెప్పితిని" అనెను.

ఆ మాటలు శివశర్మవిని వెంకటశర్మను జూచి—
"పుత్రరత్నమా! నీవు యెన్నడయిన నరకబాధలను
పొందితివా?" యని అడిగెను.

## మిధిలరాజు యమభటుల సంవాదము

తండ్రిని జూచి కుమారుడైన వెంకటశర్మ యిటులని
జెప్పుచున్నాడు—"ఓ తండ్రీ! నేను యీ జన్మమునకు
ముందు ఏడవజన్మమున ఒక కోమటి కులమున బుట్టితిని.
అచ్చట బుట్టి ఆవులను బెంచి వాటిపాలతో వర్తకము
జేయుటకు ప్రారంభము జేసితిని. పాలుకొరకు ఆవులను
కొట్టుచు సరిగా ఆహారాదులను బెట్టక బాధించుచుంటిని.
ఆ పాపముచేత కొంతకాలమునకు మృతినిపొంది నర
కమునకు బోయితిని. ఆ నరకమునందు ఆవులచే పొడవ
బడుచు, తన్నబడుచు, నాకుటచేత చర్మముపోయి రక్తము
కారుటచేత బాధలను పొందుచు నూరు సంవత్సరములు
బాధలనుభవించితిని ఈ విధముగా పాపముల ననుభ
వించుచుండగా ఒక దివ్యపురుషుడు యమభటులచే నర
కమునకు తీసుకుని రాబడెను. ఆ దివ్యపురుషుడు ఈ నర
కములను జూచి- యమభటులారా! నేను యే పాపమును
జేయుటచేత యీ భయంకరమగు నరకములకు తీసుకుని

రాబడితిని. నేను పండితుడను, మిధిలా చక్రవర్తి కుటుంబములోని వాడను. నా పేరు విష్ణువర్మ అందురు. నేను రాజ్యమును పాలించునపుడు పక్షపాతములేక రాజ్యమును పాలించితిని. అనేక యజ్ఞయాగాదులను జేసితిని. యుద్ధకాలమునందు ధర్మమును తప్పి యెరుగను దేవతలకుగాని పితరులకుగాని ద్రోహముచేసి యెరుగను. పరస్త్రీ పరధనములను కోరనివాడను. అటువంటి నన్ను యీ నరకలోకమునకు తీసుకొని వచ్చుటకు కారణమేమి ?" యని అడిగెను.

ఆ మాటలకు యమదూతలు ఇలా జెప్పుచున్నారు:- "ఓ రాజా ! నీవు జెప్పిన వాక్యంబులు యదార్ధములే గాని నీకు గల యిద్దరు భార్యలను సమముగా జూడక రెండవ భార్యయందు మోహాధిక్యము గలిగి పెద్ద భార్యయందు ఋతుకాలమునందైనను భోగాధికృత్యములను జరుపక పోవుటచేత బ్రూణహత్య అను పాతకము నీకు సంభవించినది. ఆ కారణముచేత నీకు నరకదర్శనము జేయించవలసి వచ్చినది. యింక ఆ దోషములు నశించినవి, నీవు స్వర్గమునకువెళ్ళి సుఖించెదవు కనుక రమ్ము ! నిన్ను దేవదూతలకు వప్పగించెదము" అని జెప్పెను.

రాజు ఆ మాటలు విని—"యమదూతలారా! యేయే పాపములను జేసినవారు యేయే నరకములు అనుభవించవలెనో జెప్పవలసినద"ని కోరెను.

## పుణ్యపాపములకు దగిన నరకములు

యమభటులు చెప్పుచున్నారు—"ఓ రాజా! ఎవరుచేసిన పుణ్యపాపములను వారు అనుభవించక తప్పదు. భూలోకమునందు "పరోపకారాయ పుణ్యాయ పాపాయ పర పీడనం" అని జెప్పబడియున్నది. యితరులకు ఏవిధముగానైన ఉపకారము జేయుట పుణ్యమనియు, మనోవాక్కాయ కర్మలచే యితరులకు బాధలను కలిగించుట పాపమనియు జెప్పబడి యున్నవి. అన్నదానము జేయువారు, దాహ సత్రముల నుంచువారును, యిటువంటి మంచి గుణములు గలవారు స్వర్గమున నుందురు. స్వల్పపాపములను జేయు వారు బ్రతికియుండగానే శిరోభారము, జ్వరరోగము మొదలగు స్వల్పబాధ లనుభవింతురు.

శ్లో॥ పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ బాధితం।
తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జప హోమార్చనాదిభిః॥

అని చెప్పబడియున్నది, మంచి బుద్ధి గలవారు అది తెలుసు కొని పూర్వకర్మ నశించుటకు శాంతులను జేసుకుని సుఖించెదరు. భూలోకమున నుండువారు జేయు పుణ్యము గాని పాపముగాని అధికమైనప్పుడు ఆ ఫలమును కొంత వరకు ఆ భూలోకమునందే అనుభవించి మిగిలిన దానిని యీ నరకమున ననుభవింతురు,

శ్లో॥ త్రిభిర్వర్షై స్త్రిభిర్మాసై స్త్రిభిర్పక్షై స్త్రిభిర్దినైః।
అత్యుత్కృష్టైః పుణ్యపాపైః రిహైవ ఫలమన్యుతే॥

అని జెప్పబడియున్నది. అందువలననే బ్రహ్మహత్య, గోహత్య మొదలగు ఘోరపాపములను జేయువారు దాని ఫలితమును వెంటనే అనుభవించి మిగిలిన దానిని అనుభ వించుటకు వచ్చెదరు. ఎందువల్ల ననగా ? యీ పాపము వలన యీ బాధ అనుభవించుచున్నాడని అందరకును తెలియుటకుగాను యమధర్మరాజు రోగసంఘములకు ఆజ్ఞాపించియున్నాడు. వేదములను, గురువులను, తల్లి దండ్రులను, యాత్రాపరులను నిందించువాడు ఇనుప ముక్కులుగల పక్షులచే కళ్లు పీకబడుచు బాధింపబడును. తల్లికి, కొడుకులకు, భార్యాభర్తలకు, స్నేహితులకు, యిరుగుపొరుగు వారికి కలహములు పెట్టువారు అశిపత్ర

నరకమునందు బాధల పడుచు రంపములచే కోయబడు చుండును. పరిమళ వస్తువులను దొంగిలించువాడు చుంచు, రోకటిబండ, నల్లి మొదలగు జన్మము లెత్తును. శ్రాద్ధ దివసంబున కర్తచే నిమంత్రణ జేయబడి దాని నిరాకరణ జేయువాడు మూత్రపురీష యుక్తమగు నరకంబున నుండును. పంక్తి భేదము జేయువాడు మలభక్షణ అను నరకంబున నుండును. సాధుజనులను నిందించువాడును, బాధించువాడును, కుంభీపాకము అను నరకమునందు కాకులు, గ్రద్దలు, పురుగులు మొదలగువాటిచే పీకి తిన బడుచుండును. అందులకే సూ॥ సాధుజన సంతాపం కిమాశ్చర్యం కులక్షయం॥ అని జెప్పబడియున్నది.

అటువంటివారికి కాలక్రమమున వంశాదులు నశించును. దేవబ్రాహ్మణవృత్తిచ్ఛేదకులు, విద్యాగర్వితులు, ధర్మకంటకులు, హరిహర భేదకులు, కూటసాక్షులు, మిథ్యాపవాదులు, తమ పొట్టను మాత్రమే పోషించు కొను వారు అయిన యిటువంటివారిని యమభటులు వారి కండ లను కోసి వారినే తినమని మోదుదురు. పగటియందు సంభోగము చేయువారు, పరుల భార్యలను పొందువారు, పరులను తిట్టువారు మొదలైనవారు కాలిన రాళ్ళను మోయుచు, యినుపగదలచే కొట్టబడుచు బాధింపబడుదురు.

పాపులవద్ద ద్రవ్యమును పుచ్చుకుని యాగాదులను జేయు వారు నరకమున పురుగులై వుందురు. స్నేహితులను మోసపుచ్చువాడును, చేసిన మేలు మరచువాడును, ఆపద కాలమునందు రక్షించినవారికి కీడు తలచినవాడును, బంగారము దొంగిలించువాడును అనేక సంవత్సరములు యీ నరకము లన్నింటియందు బాధ లనుభవించును" అని యమభటులు జెప్పిరి.

ఆ మాటలు విని రాజు యిట్లనియె—"ఓ యమకింకరులారా! ఈ నరకమును అనుభవించిన పిమ్మట వారు యేయే జన్మముల నెత్తుచున్నారో జెప్పవలసినది" అని ప్రశ్నించెను.

అందులకు యమకింకరులు-"ఓ రాజా! దుర్మార్గుల వద్ద ధనమును పుచ్చుకొన్నవారును, యితరులకు అపకారము జేసినవారును, తల్లిదండ్రులకు అపకారము చేయ దలచినవాడును గాడిదయై పుట్టును. అన్నభార్య, గురుభార్య మొదలగు స్త్రీలను పొందువాడు పావురపిట్టయై పుట్టును. పరుల భార్యను గొట్టువాడు తాబేలై పుట్టును. యితరుల నవమానము పరచువాడు కోతియై పుట్టును. యితరుల సిరిసంపదలను జూచి ఓర్వలేనివాడు పిచ్చుక,

గోరువంకలై పుట్టుదురు. యితరుల ద్రోహము చేసినవాడు కుక్కయై పుట్టును. స్త్రీలవద్ద ద్రవ్యము నపహరించువాడు తోడేలై పుట్టును. వివాహములను జెడగొట్టువాడు పేడ పురుగులై పుట్టుదురు. తినెడు ద్రవ్యములను దొంగిలించు వాడు కాకియై పుట్టును. అన్నము దొంగిలించు వాడు ఎలుక, పందికొక్కు, మాను బిల్లులై పుట్టుదురు. మాంసము దొంగిలించువాడు డేగయై పుట్టును. బట్టలను దొంగిలించువాడు చిలుక, నెమలి మొదలగు పక్షులయి పుట్టుదురు. నీటిని దొంగిలించువాడు చాతక పక్షియై పుట్టును. భూమిని అపహరించినవాడు లతగుల్మాదులై పుట్టి చీడపురుగులచే బాధపడుచుండును" అని జెప్పి— "ఓ రాజా! వారువారు జేయు పుణ్యపాపములను బట్టి భూమియందు బుట్టి పుణ్యాత్ములు సుఖములను, పాపాత్ములు దుఃఖములను అనుభవించుచుందురు.

శ్లో॥ సుఖానంతరం దుఃఖం దుఃఖానంతరం సుఖం
చక్రవత్పరివర్తంతే దుఃఖానిచ సుఖానిచ॥

అని జెప్పబడి యున్నట్లు సుఖ దుఃఖము లనుభవించు చుందురు. నీవు పుణ్యాత్ముడవు గనుక నరకమునందు ఆలస్యముగా నుండరాదు. నీవు నరకములను యిక జూడ దగదు. త్వరితముగా రమ్ము" అని తొందర జేయు చుండిరి.

ఆ మాటలను నరకమునందున్న పాపులు విని—"ఓ రాజా! నీవు క్షణకాలము యిచ్చట నుండుము. నీవు వచ్చినది మొదలు మాకు బాధలు కనబడుటలేదు. నీమీద నుండి వచ్చెడు గాలివలన మాకు సుఖంబుగానున్నది" అని ప్రార్థించుచుండిరి.

పాపులు జెప్పిన మాటలు రాజు విని—"ఓ కింకరోత్తములారా! నా శరీరమునుండి వచ్చు గాలి పరిమళించుటకు కారణము యేమి? నేను యే పుణ్యము చేయుట వలన పరిమళ మిచ్చుచున్నదో చెప్పవలసినది" అని యడిగెను.

## ఇంద్ర యమధర్మరాజులు రాజువద్దకు వచ్చుట

కింకరులు జెప్పుచున్నారు—"ఓ మిధిలాపుర రాజకుల సంభవా! విష్ణువర్మా! నీవు అనేక పుణ్యకార్యములను, క్రతువులను జేయుటచేతను, పితృకార్యములను, దేవతా కార్యములను అతి శ్రద్ధాభక్తులు గలిగి నియమము ప్రకారము జేయుటవలన నీ శరీరము పరిమళ మిచ్చుచున్నది. యిక యిచ్చట నుండరాదు" అని జెప్పుచుండగా యింద్ర యమ ధర్మరాజులు రాజువద్దకువచ్చి—

"రాజశేఖరా! నీవు పుణ్యాత్ముడవు, కావున సుఖములు అనుభవించుటకు స్వర్గమునకు రావలసినద"ని జెప్పిరి. పిమ్మట "రాజా! నీవు స్వల్పమైన పాపము జేయుటవలన నరకమును జూడవలసి వచ్చినది" అనిరి.

ఆ మాటలకు రాజు—"దేవేంద్ర యమధర్మ రాజ శ్రేష్టులారా! వీరు అందరును నరకము అనుభవించుచుండగా నేను స్వర్గసుఖము అనుభవించుట రాజధర్మము గాదు. 'శరణు' అని కోరినప్పుడు రక్షించువాడు రాజు గాని వేరుకాదు. కనుక వీరినికూడా వదిలిపించుడు, లేని యెడల వీరితోకూడా నేనును యిచ్చటనే వుందును" అని చెప్పెను.

ఆ మాటలకు యమధర్మరాజు జెప్పుచున్నాడు— "రాజా! నీవు జెప్పిన వాక్యములు యదార్థములే. కాని పాపకార్యములు జేసినవారు పాపఫలమున్ను, పుణ్యకార్యములను జేయువారు స్వర్గసుఖమున్నూ అనుభవించక తప్పదు. బ్రహ్మచే నియమింపబడిన ధర్మమును ఎవరు తప్పించగలరు. నీవు జెప్పిన వచనములు మాకు యుక్తముగా దోచుటలేదు" అని జెప్పెను.

ఆ మాటలకు రాజు యిట్లని జెప్పుచున్నాడు—"ధర్మరాజా ! నీవు జెప్పిన వాక్యములు నాకు హితవుగ లేవు. ఈ నరకమునందున్నవారు—"ఓ రాజా ! మమ్ముల రక్షింపవు, రక్షింపవు" అని మొరబెట్టుచున్నారు. వీరు యీ విధముగా యేడ్చుచుండగా నేను మాత్రము స్వర్గ సుఖము అనుభవించుట నాకు యిష్టములేదు. "ప్రజాం పాలయేత్ రాజ" అనిన్ని, "వాచాసార మహీపతేః" అనిన్ని జెప్పబడియున్నది. నా కోరికను మీకు నెరవేర్చు టకు యిష్టము లేనియెడల నేను యిచ్చటనే వుండెదను అని ప్రతిన జేయుచున్నాను" అని జెప్పెను.

ఆ మాటలు ఇంద్రాదులు విని—"రాజా ! నీ పరి పాలనా సామర్థ్యమునకును, నీ పట్టుదలకున్ను సంతో షమును పొందితిమి. మేము నీ వాక్యములను పాలించని యెడల మాకు కీర్తి వుండదు" అని జెప్పి రాజును స్వర్గ మునకు తీసుకుని వెళ్ళిరి. ఆ రాజుతోకూడా మమ్మును స్వర్గమునకు తీసుకొని వెళ్ళిరి.

తేతం భుక్త్వా స్వర్గలోకే విశాలేక్షణే పుణ్యే మర్త్యే లోకే విశంతి॥ అను విష్ణువాక్య ప్రకారము నేను మరల భూమిమీద జన్మించితిని" అని వెంకటశర్మ జెప్పెను.

ఆ మాటలను శివశర్మ విని సంతోషించి—"కుమారా, వెంకటశర్మా! నీవు యదార్ధమును జెప్పితివి. నమ్మితిని. నీవంటి బుద్ధిమంతులు యెన్నడును అసత్యమును పలుకరు. సజ్జనుడు, వేదమును జదివినవాడు 'నానృతం వరేత్' అని వేదములే జెప్పుచున్నవి. నీవు జెప్పిన వాక్యములు వలన 'సంసారము' అను సముద్రమును దాటితిని. 'పుత్రాన్ముక్తి మవాప్నుయాత్' అని జెప్పియున్నది. నేను నీవలన ముక్తిని పొందవలసియున్నది. గాన నాకు ముక్తి మార్గమును జెప్పుము" అని కోరెను.

ఆ మాటలకు కుమారుడు జెప్పుచున్నాడు—"ఓ తండ్రీ! నీవు నేను జెప్పిన ప్రకారము నడచుకున్న నీకు ముక్తి గలుగుటకు సందేహములేదు. నీవు గృహస్థాశ్రమమును విడచి, వానప్రస్థాశ్రమమును పొంది, అగ్ని పరిసమాప్తినిజేసి, పరమాత్మను జీవాత్మలయందు లయముజేసి సుఖదుఃఖాదులను వదలి జితేంద్రియుండవై యోగమార్గము నవలంబించి ముక్తిని పొందుము" అని జెప్పెను.

"పుత్రరత్నమా! యోగమార్గమును, ముక్తి మార్గమును జెప్పుము" అని యడిగెను.

ఆ మాటలు కుమారుడు విని—"తండ్రీ! మీరు అడిగిన ప్రశ్నమును దత్తాత్రేయు నడిగి అలర్కుఁడు తెలుసుకొనెను. దానిని జెప్పుచున్నాను" వినుము.

## పతివ్రత ప్రభావము

"పూర్వకాలమునందు ఆత్మపురమను పట్టణమున కౌశికుడను బ్రాహ్మణుడు కలడు. అతడు 'పూర్వజన్మ కృతం పాపం వ్యాధి రూపేణ బాధతే' అని జెప్పబడి యున్నట్లు అతనికి పూర్వజన్మ కర్మవలన కుష్టురోగము సంభవించెను. అతనికి రూప యవ్వన సంపద గల భార్య గలదు. ఆమె తన భర్త వ్యాధిగ్రస్థు డయి నప్పటికీ పూర్వజన్మ కర్మఫలము అనుభవించక తప్పదు అని తెలుసుకుని భర్తను దైవములాగున భావించి సంరక్షణ జేయుచుండెను. ఆ బ్రాహ్మణుడు రోగమువలన అతి కోపము గలవాడై భార్యను సదా బాధించుచుండెను. అయినప్పటికీ ఆమె భర్తను పూజించుచుండెను.

ఇట్లుండగా ఒకనాడు ఆ బ్రాహ్మణుడు రాజమార్గ మున పోవుచున్న ఒక వేశ్యకాంతను జూచి దానిని మోహించి భార్యను పిలచి—"ఓ ధర్మచారిణీ! నేను

ఆ మార్గమున బోవుచున్న వేశ్యకాంతను జూచినది మొదలు కాముకులకు ఆవహించు దశావస్థలు నన్ను పొంది బాధింపుచున్నవి. యీ రాత్రి దానియింటికి నన్ను నీవు తీసుకుని వెళ్ళవలెను. లేనియెడల నా ప్రాణములు పోవును" అని జెప్పెను.

ఆ మాటలు విని బ్రాహ్మణి భయపడి ఆ వేశ్య వెనుక జని తనకు—"పతిభిక్ష పెట్టవలసినది" అని ప్రార్థించెను.

ఆ భోగకాంత ఆమె దీనాలాపములను ఆలించి జాలిగలిగి—"అమ్మా! నేను యిదివరకు అనేకమందిని దాసులుగ జేసుకుంటిని. అయినప్పటికి నీవు పతిభిక్ష పెట్టమని కోరుచుంటివిగాన ఈ రాత్రి నీ పతిని నా ఇంటికి తీసుకుని రమ్ము. నీ కోరిక ప్రకారం, నీ భర్త కోరిక నెరవేర్చెదను" అని జెప్పి పంపించివేసెను.

ఆ విషయము భర్తకు జెప్పి తొందర తొందరగా గృహకృత్యముల నిర్వర్తించుకుని కనుచీకటికాగా తన భర్తను భుజముపైని గూర్చుండ బెట్టుకుని వేశ్యయింటికి బయలుదేరి వెళ్ళుచుండెను. విధివశంబున ఆ రాత్రి ఆకాశమునందు గాఢాంధకారముగ మేఘము గ్రమ్మి

చినుకులు, మెరుపులు గలిగి మార్గము భయంకరముగా నుండెను. దైవభక్తి గలవారికిని, పతివ్రతలకును భీకరములగు మార్గములు ఉండునా? ఆ పతివ్రత అటువంటి నిశివేళ నిర్భయముగా భర్తను మూపుమీద కూర్చుండబెట్టుకుని మార్గంబున వేశ్యయింటికి వెళ్ళుచుండెను.

ఆ మార్గమునందు పూర్వజన్మకృత దోషంబున మాండవ్య మహాముని చోరుడని భ్రమనుజెంది ఆ పట్టణమును పాలించు రాజు కొరతను వేయించెను. అందువలన ఆ ముని లంబికాయోగము వీడి బాధపడుచుండగా కౌశికుడు కాళ్ల నొప్పి గలిగి తన పాదములను జాచెను. అట్లు జాచుటలో ఆపాదములు కొరతమీదనున్న మాండవ్యమునికి తగులుటచే కొఱ్ఱుకదలి బాధ యెక్కువయ్యెను.

కొఱ్ఱువనున్న మాండవ్యుడు తనకు పాదము తగులుటచేత కోపము గలిగి—"బాధపడుచున్న నన్ను కాలితో తన్నినవాడు సూర్యోదయము కాగానే మృతిని పొందుగాక" యని శాపమును బెట్టెను.

తన భర్త మునిని తన్నిన విషయము ఆమెకు తెలియలేదు. గాని "నీవు నన్ను కాలితో తన్నితివిగాన సూర్యోదయము కాగానే నీవు మృతిని పొందుము" అని

ముని పలికిన శాపవాక్యములు ఆమె చెవుల బడెను. ఆ మాటలు విని—"అయ్యో! నేను ఏమి చేయుదును. భర్తయందుగల భక్తి చేతనేగదా యిటువంటి చీకటిలో భర్తను వేశ్యయింటికి మోసుకొని పోవుచుంటిని. సూర్యోదయము అయిన నాకు వైధవ్యము గలుగును. నేను వైధవ్యము ఎటుల భరించగలను" అని విచారించి—

"ఓ పంచభూతములారా! నేను మనోవాక్కాయ కర్మలచే పతిభక్తి గలిగి యుంటినేని సూర్యోదయమే లేకపోవుగాక" యని పలికెను. పతివ్రతల వాక్యములు వృధాయగునా?

ఈవిధముగా మూడు అహోరాత్రములు గతించెను. భూమండల మంతయు అంధకారముగా నుండెను. అందు వలన దేవతలకు హవిర్భాగములు లేకపోయెను. మహా ఋషులకు కర్మలులేకపోయెను. క్రతువులు నిలచిపోయెను. ఆ సమయమునందు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, దేవేంద్రాది దేవతలు అందరు ఆలోచించి పతివ్రతా శాపమును పతివ్రతలే మరలింపవలెను గాని యితరులవలన గాదని తెలుసుకుని దేవతలందరును కలసి అత్రిమహాముని భార్య

అనసూయవద్దకు వెళ్ళి పతివ్రతా శాపమును జెప్పి— "అమ్మా! నీవు పతివ్రతా శాపమును మరలించి లోకము లను కాపాడవలసినది" అని కోరిరి.

అంత బ్రహ్మాదిదేవతలు జెప్పిన మాటలను విని అనసూయ లేచి భర్తకు ప్రదక్షిణ నమస్కారములుజేసి భర్తను వెంటబెట్టుకుని దేవతలతోకూడా కౌశికుని భార్య యింటికివచ్చెను. కౌశికుని భార్య, బ్రహ్మాదిదేవతలతో వచ్చిన అత్రి మహామునిని, అనసూయను జూచి మహా నందము పొంది షోడశోపచారంబుల పూజించి అందరకు నమస్కరించి—"అమ్మా, అనసూయా! నీవు వీరందరిని వెంటబెట్టుకుని నా గృహంబునకు వచ్చితివి. మా గృహం బును, మేమును పవిత్రుల మయితిమి. కారణము వున్న యెడల జెప్పవలసినది" అని వినయముతో కోరెను.

ఆ మాటలు అనసూయ విని—"అక్కా! లోకం బున స్త్రీలకు పాతివ్రత్యంబునకు మించిన మహాత్మ్యము లేదు. స్త్రీలకు పతికంటె వేరు దైవములేదు. నీవంటి పతివ్రతను మూడు లోకములందును జూడలేదు. నీ శాపంబులకు భయపడి సూర్యుడు ఉదయించుటలేదు. అందువలన భూలోకమునందు కర్మలు నశించుచున్నవి.

నీవు కరుణించి సూర్యోదయము అగునటుల జేయుము. నీ భర్త మృతుండైన నేను నీ భర్తను యవ్వనవంతుడుగ జేసి బ్రతికించెదను" అని జెప్పెను.

ఆ మాటలు విని పతివ్రతలయందు యింత మహాత్మ్యము వున్నదని తెలుసుకుని సూర్యోదయ మగునటుల అనుగ్రహించెను, సూర్యుడు ఉదయించిన వెంటనే కౌశికుడు మృతుడయ్యెను. అనసూయ అటుల మృతుడయిన కౌశికుని శిరమునందు తన కుడిచేతిని వుంచి తన భర్తను హృదయకమలమున ధ్యానించి—"నేను పతివ్రతనైతి నేని ఈ కౌశికుడు రూపయవ్వన సంపదలు గలవాడై జీవించుగాక" యని పలికెను. అంతట కౌశికుడు రూప యవ్వన సంపదలు కలవాడై నిద్రనుండిలేచిన విధముగా లేచి భార్యతోసహా అత్రి మహామునిని అనసూయను పూజించి బ్రహ్మాది దేవతలకు ప్రదక్షిణ నమస్కారములను జేసి అనేక విధములుగా స్తోత్రములను జేసెను.

ఆ సమయమునందు బ్రహ్మాదిదేవతలు అందరును అనసూయను అనేక విధములుగా పొగడి—"అమ్మా! నీవు లోకములకు మేలును కలుగజేసిన మహాతల్లివి. నీకు కావలసిన వరంబుల నిచ్చెదము కోరవలసినది" అని

చెప్పిరి. ఆమాటలను అనసూయ విని ఆనందముపొంది–
"బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలారా! మీకు నా
యందు దయగలదేని బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గు
రును నాకు పుత్రులై పుట్టునటుల వరంబులు యివ్వవలసి
నది" అని కోరెను. ఆ వరంబుల నిచ్చి యెవరి తావులకు
వారు జనిరి. లోకంబులు సంతసించెను. కౌశికుడు తన
భార్యయొక్క పతివ్రతా మహాత్మ్యమును తెలుసుకుని తన
భార్యయందు అనురాగము గలవాడై సర్వసుఖంబులు
అనుభవించుచుండెను.

ఈ విధముగా కొంతకాలము జరిగిన పిమ్మట
అనసూయ యందు బ్రహ్మ చంద్రుడు రూపమునను,
విష్ణువు దత్తాత్రేయ రూపమునను, ఈశ్వరుడు దూర్వాస
రూపమునను జన్మించిరి. దూర్వాసుడు జన్మించుటకు
ముందు అనసూయ గర్భవతి అయివుండగా ఒకనాడు
కార్తవీర్యార్జునుడు అత్రిమహాముని ఆశ్రమమునకు వచ్చి
అనసూయను జూచి మోహించి మోసముజేయుటకు ఆలో
చించుచుండగా గర్భమునందున్న శిశువు మహారౌద్రము
దాలిచి బయటకువచ్చి కార్తవీర్యుని శపించెను. ఆతని
ఆకారమును, కోపమును జూచి అశరీరవాణి దూర్వాసు
డని పేరుపెట్టి—'వీడు దూర్వాసుడని పిలువబడు' నని
జెప్పెను"

## దత్తాత్రేయుని చరిత్ర

అని జెప్పగానే జైమినివిని ఆనందమును పొంది—"పక్షి కులోత్తములారా! మహావిష్ణు స్వరూపుడైన దత్తాత్రేయుని చరిత్రను జెప్పవలసిన" దని కోరెను.

పక్షులు జెప్పుచున్నవి—"జైమినీ! మహావిష్ణు వయిన దత్తాత్రేయ మహాముని యొద్దకు కొందరు ముని కుమారులు వచ్చి ఆయనకు శుశ్రూషను జేయుచు యోగ మార్గమును ఉపదేశించవలసినదని ప్రార్థించెను. ఒకనాడు దత్తాత్రేయుడు ఒక తటాకమునకువెళ్ళి తటాకమధ్యమున నీటిలో మునిగి తపంబును జేయుచుండెను. మునికుమారులు అందరును తటాకముయొక్క గట్టునకు జేరి గుమి గూడి మాట్లాడుచుండిరి.

దత్తాత్రేయుడు గుమిగూడి మాట్లాడుకొనుచున్న ముని కుమారుల జూచి—"అయ్యో! వీరందరును నన్ను బాధించుచున్నారు. అందువలన నా తపంబునకు విఘ్నము కలుగుచున్నది. వీరి నందరను ఏదో మార్గము పన్ని వదిలించుకోవలెను" అని యోచించి తన మాయచే దివ్య

సుందర రూపమునుగల ఒక కాంతను పుట్టించి కామపర వశుడై సురాపానమును జేయుచు ఆమె వెంట దిరుగు చుండెను. అది జూచి మునికుమారులు—"అయ్యో! యితడు దుర్మార్గుడు, త్రాగుబోతు, కామినీలోలుడు ఇతనికి యోగము తెలియదు" అని ఆలోచించి యెవరితావులకు వారు పోయిరి. తరువాత దత్తాత్రేయుడు ఆమెను వదలి స్వేచ్ఛగా యోగాభ్యాసము జేయుచుండెను.

కొంత కాలమునకు సకలలోకములను పాలింప బడుచున్న కృతవీర్యుడను రాజు మృతుడయ్యెను. ఆతని కుమారుడు కార్తవీర్యార్జునుని రప్పించి—"నీ తండ్రి మృతుడయ్యెను. నీ వంశాను గతంబగు రాజ్యమును వహించవలసినది" అని అమాత్యాది సకలజనులు కోరిరి.

ఆ మాటలు కార్తవీర్యుడు విని—"అమాత్యాది పురజనులారా! 'రాజారాష్ట్రం కృతం పాపం' అనిన్ని, 'రాజ్యాంతే నరకం ధృవం' అనిన్ని జెప్పబడియున్నది. కాన నేను రాజ్యభారమును వహించజాలను. యోగ మార్గము నవలంబించి తపంబునకు జనెదను" అని జెప్పెను.

ఆ మాటలు విని మంత్రి పురోహితాదు లిటులని జెప్పిరి—

## మంత్రి కార్తవీర్యుల సంవాదము

" అయ్యా! రాజకులశేఖరా! కార్తవీర్యా! రాజు లేని యెడల లోకములు అరాజకమై జార చోరాది దుర్మార్గుల వలన ప్రజలు బాధింపబడుదురు. అందువలన యజ్ఞ యాగాది కర్మలు నశించును. సాధుజన దేవతాదులకు బాధలు కలుగును. ఆ పాపము సమర్థుడయిన రాజు యుండియు, రాజ్యమును ధర్మయుక్తముగా పాలించని యెడల రాజును పొందును" అని మంత్రులు మొదలగు వారు జెప్పిరి.

ఆ మాటలు కార్తవీర్యుడు విని యేమియు జెప్పక యూరకుండెను. ఆ సమయమునందు గర్గమహాముని—
"ఓ కుమారా! నీవు దత్తాత్రేయ మహామునివద్దకు వెళ్ళి అతనిని ఆశ్రయింపుము. ఆ ముని మూడు లోకములను రక్షింపగల సమర్థుడు. సహ్యాపర్వతమునందు ఆశ్రమము కల్పించుకుని తపంబు జేయుచుండెను. అతడు యోగ మార్గము నవలంబించిన మహావిష్ణు అంశా సంభూతుడు,

ఆ మహామునిని ఆశ్రయించి దేవేంద్రాదులు రాక్షసుల సంహరించి స్వర్గాధి పత్యమును వహించి సుఖించు చుండిరి " అని జెప్పెను.

ఆ మాటలకు కార్తవీర్యుడు—" ఓ మునిపుంగవా ! దేవేంద్రాదులు ఆ దత్తాత్రేయు నే విధముగా ఆశ్రయించిరి ? రాక్షసులు యింద్ర రాజ్యము నెటుల అపహరించిరి ? జెప్పవలసినది " అని కోరెను.

కార్తవీర్యుని మాటలు గర్గమహాముని విని— " ఓ రాజపుత్రా ! పూర్వకాలమునందు దేవదానవులకు మహాయుద్ధము జరిగెను. ఆ యుద్ధములో దేవతలకు దానవులకు సంధికుదిరి శంభుడను దానవుడు రాక్షస లోకమునకు రాజుగ నుండునటులను, శచీపతియైన యింద్రుడు దేవతాలోకమునకు రాజుగను నుండునటుల యేర్పాటును జేసుకొనిరి. గాని రాక్షసులు అసూయ గల వారై దేవతాలోకమును గూడ ఆక్రమించుకొనుటకు యోజించి ఇంద్రుని మీదకు యుద్ధమునకు వచ్చిరి. ఆ యుద్ధము అనేక సంవత్సరములు జరిగెను. తుదకు దేవతలకు అపజయము గలిగి పలాయనమై పారిపోయిరి. అప్పటి రాక్షసరాజు విప్రజిత్తు స్వర్గమును ఆక్రమించుకుని

రాజ్యమును జేయుచుండెను. దేవతలు రాజ్యహీనులై యేమియు దోచక బృహస్పతి వద్దకువెళ్ళి జెప్పిరి. ఆ సమయమునందు వాలఖిల్యాది మహామునులు అచ్చటనే యుండిరి. ఆ మాటలు విని బృహస్పతి వాలఖిల్యాదులతో ఆలోచించి—“ యింద్రా! నీవు దేవతలతో గూడా సహ్య పర్వతమునకు వెళ్ళి దత్తాత్రేయుని ఆశ్రయింపుము. ఆ ముని మీకు జయము గలుగజేయును ” అని జెప్పి పంపించెను.

దేవతలు సహ్యపర్వతమునకు వెళ్ళి దత్తాత్రేయుని ఆశ్రయించి అనేక విధములుగా స్తోత్రమును జేసిరి. ఆ మునికి దేవేంద్రాదులు శుశ్రూషలను జేయుచుండిరి. అనేక విధములుగా శుశ్రూషలను జేయుచున్న దేవేంద్రాదులను దత్తాత్రేయుడు జూచి—“ దేవతలారా! నేను సురాపానాది కామినీ లోలుడను. నాకు జితేంద్రియత్వముతేదు. అటువంటి నన్ను ఆశ్రయించి యేమి ఫలము పొందగలరు. పొండు పొండు ” అని పలికెను.

ఆ మాటలు విని దేవతలు—“ అయ్యా! నీవు మహావిష్ణు సంభూతుడవు, దత్తాత్రేయుడవు, నిర్లిప్తుడవు, యోగాభ్యాసాది అంతఃకరణ పరిశుద్ధుడవు. నీవు నెరవేర్చ

లేని కార్యములను ఇతరులు ఎవ్వరును నెరవేర్చలేరు. రాక్షసులు మమ్ములను వెడలగొట్టి మా స్వర్గమును ఆక్ర మించుకొనిరి. మమ్ములను కాపాడుము. విష్ణుమాయను పంపి మమ్ములను మోసపుచ్చకుము ” అని ప్రార్థించిరి.

ఆ మాటలను దత్తాత్రేయుడు విని సంతోషించి— “ దేవేంద్రాది దేవతలారా ! మీకు ఒక్క వుపాయమును జెప్పెదను. మీరు శీఘ్రముగా బోయి రాక్షసులను యుద్ధము నకు పిలువుడు. ఆ యుద్ధసమయమునందు మీరు వెనుకకు జరుగుచు ఆ రాక్షసులు నా దృష్టికి కనబడునటుల జేయుడు. నా దృష్టికి గోచరమైన యెడల రాక్షసులు నశింతురు ” అని జెప్పి దేవతలను రాక్షసులమీదకు యుద్ధ మునకు పంపించెను.

దేవతలు రాక్షసరాజులైన విప్రజిత్తు, జంభాసురుడు మొదలగు వారివద్దకు వెళ్ళి యుద్ధమునకు ప్రేరేపించిరి. ఆ మాటలు రాక్షసులు విని కోపోద్రేకము గలవారై తమ తమ ఆయుధములను ధరించి దేవతలమీదకు యుద్ధము నకు వచ్చిరి. దేవతలు యుద్రేకులై వచ్చిన రాక్షసులతో యుద్ధమును జేయుచు నెమ్మదిగా వెనుకకు జరుగుచు యుద్ధము జేయుచు దత్తాత్రేయుని ఆశ్రమ సమీపమునకు తీసుకుని వచ్చిరి.

అటులవచ్చిన రాక్షసులు చూచుచుండగా దేవతలు పారిపోయి దత్తాత్రేయుని వెనుకకు జేరిరి. రాక్షసులు దేవతలను తరుముకొనుచు పోయి దత్తాత్రేయుని జూచిరి. ఆ సమయమునందు దత్తాత్రేయులు ఘోరముగా తపంబు జేయుచుండెను. ఆ ముని సమీపమునందు దివ్యసుందర విగ్రహమగు నారీరత్నము వుండెను. ఆమెను జూచి మోహముజెంది దేవతలను వదిలి ఆ నారీరత్నమును పట్టుకొని శిబికయందు కూర్చుండబెట్టుకుని తమ స్వస్థానమునకు శిబికను శిరంబున బెట్టుకుని పరుగిడసాగిరి. దత్తాత్రేయుడు తపంబు చాలించి రాక్షసులు మహాలక్ష్మిని శిరంబున వహించి తీసుకొని వెళ్ళుటను జూచి నవ్వుచు దేవతలతో యిటులని జెప్పుచున్నాడు—

## లక్ష్మీదేవియొక్క పాదాది అష్టస్థానముల ఫలితములు

"ఓ దేవతలారా! దైవయోగమున మహాలక్ష్మి రాక్షసుల శిరంబున నున్నది. ఆ రాక్షసులచేత యేడు స్థానములు

దాటినవి. ౧. పాదస్థితియందు మహాఐశ్వర్యము గలు గును. ౨. తొడలయందు వివిధ వస్త్రములు నిచ్చును. ౩. గుహ్యస్థానమునందు కళత్ర సంపద కలుగును. ౪. క్రోడు స్థలగతంబైన సంతాన సౌఖ్యంబు గలుగును. ౫. హృదయమునందు సకల మనోరథంబులు నెర వేరును, ౬. కంఠంబున ప్రవేశించిన భూషణ ఐశ్వ ర్యంబులును, బంధుసమాగంబును, సకల విద్యాసంపదలు మృష్టాన్న లాభము కలుగును. ౭. ముఖమున శ్రీదేవి పొందెనేని కవిత్వసంపద కలుగును. ౮. శిరంబుననున్న శ్రీమహాలక్ష్మి ఆయువు, ఐశ్వర్యములను నశింపజేయును. యిప్పుడు శ్రీమహాలక్ష్మి రాక్షసుల శిరంబున నివశించి యున్నది. కావున మీరు భయమును పొందక అస్త్ర శస్త్రాదులను ధరించి యుద్ధమునకు వెళ్ళి రాక్షసుల సంహ రింపుడు. నా దృష్టి తగులుటచేత ఆరాక్షసులు సత్యహీను లైరి. పరదారా శక్తివలన క్షీణపుణ్యులై ఆయుర్దాయ హీనులైరి" అని జెప్పగానే దేవతలు యుద్ధసన్నద్ధులై రాక్షసుల మీదకు యుద్ధమునకు వెళ్ళిరి. దేవతలు రాక్ష సులతో యుద్ధమునకురాగానే శ్రీమహాలక్ష్మి దత్తాత్రేయుని వద్దకు వచ్చెను.

దేవతలు రాక్షసులను సంహరించి నిశ్శేషశత్రులై స్వర్గలోకమును ఆక్రమించుకుని మూడు లోకములను సుఖంబుగా పరిపాలించుచుండెను. కావున నీవును దత్తాత్రేయుని ఆశ్రయించి రాజ్యసంపదలు అనుభవింపుము" అని గర్గమహాముని జెప్పెను.

ఆ మాటలు కార్తవీర్యుడు విని సంతోషమును పొందెను.

## కార్తవీర్యుడు దత్తాత్రేయుని ఆశ్రయించుట

కార్తవీర్యుడు గర్గమహాముని జెప్పిన ప్రకారం రాజ్యభారము మంత్రి పుంగవుల ఆధీనముజేసి తాను దత్తాత్రేయుని ఆశ్రమమునకు పోయి ఫలపుష్పాదులను దెచ్చియిచ్చుచు, పాదంబుల నొత్తుచు అనేక విధములుగా శుశ్రూషలను జేయుచు వినయ విధేయములు గలవాడై సేవించుచుండెను. ఈ విధముగా నూరు సంవత్సరములు గడచెను. ఈ విధముగా ఉపచారములను జేయుచున్న కార్తవీర్యుని జూచి దత్తాత్రేయుడు—"ఓ రాజనందనా! నేను సురాపానాది ఆసక్తుడను. స్త్రీ లోలుడను. యీ నారీరత్నము రెప్పపాటు కాలమయినను నన్ను విడచి వుండదు.

నేను దూషితుడను. యితరులకు ఉపకారము జేయువాడను గాను. నీవు నన్ను ఆశ్రయించిన ఫలితములేదు. మరి యొకని ఆశ్రయించిన ఫలితమును పొందవచ్చును పొమ్ము పొమ్ము " అని పలికెను.

ఆ మాటలు కార్తవీర్యుడు విని గర్గమహాముని జెప్పిన వాక్యములను దలచుకుని వినయంబున దత్తాత్రేయుని పాదంబులు బట్టుకుని— " అయ్యా! మునికులోత్తమా! నన్ను మాటలచేత మోసమును జేయుచున్నావు. ఈ దేవి లోకమాతయైన ఆదిమహాలక్ష్మి. నీవు మహావిష్ణుడవు. నన్ను కాపాడగల సమర్థుడవు, నీవుగాక నన్ను యితరులు ఎవ్వరును రక్షింపలేరు " అని బదులు జెప్పెను.

ఆ మాటలకు దత్తాత్రేయుడు ఆనందము పొంది— " నీ వచనములు యదార్థములు. నేను సంతోషమును పొందితిని. నీకు కావలసిన వరంబుల నిచ్చెదను కోర వలసినది " అని జెప్పెను.

కార్తవీర్యుడు ఆ వచనములను విని మహానందము పొంది యిట్లని పలికెను—

## కార్తవీర్యుని పట్టాభిషేకము

" ఓ దత్తాత్రేయ మహామునీ! నేను సకల భూమండలమును పరిపాలనము జేయగల సామర్థ్యము గలుగునటుల యున్ను, సర్వకాల సర్వావస్థలయందు నేను పరిపాలనము జేయు రాజ్యమునందు అధర్మము జరుగకుండునటుల యున్ను, నేను శత్రువులచేత జయింపబడక అష్టైశ్వర్యములతో నుండునటులయున్ను అనుగ్రహింపుము" అని కోరెను.

ఆ మాటలకు దత్తాత్రేయుడు—" ఓ రాజనందనా! నీవు చక్రవర్తివై సర్వసుఖంబులు ననుభవించుచు నిత్యయవ్వనవంతుడవై దేవ బ్రాహ్మణులను పూజింపుచుండుము. దేవ బ్రాహ్మ క్షేత్రాదులకు హాని కలిగినయెడల నీ ఐశ్వర్యాదులు నశించును" అని జెప్పెను.

కార్తవీర్యుడు మహానందముపొంది దత్తాత్రేయుని వద్ద శలవును పొందగా—" రాజా! నిన్ను సూ॥ కార్తవీర్యార్జనోనామా రాజా బాహు సహస్రవాన్॥ అని తలంచుచుందురో వారిని సర్వావస్థలయందును రక్షింపుచుండుము" అని జెప్పి పంపించెను.

కార్తవీర్యుడు తన రాజధానికి వచ్చి గర్గాది మంత్రి పురోహితాదులకు తన చరిత్రను జెప్పి సామ్రాజ్య పట్టాభిషేకమును పొంది సర్వసుఖంబులను అనుభవించుచు డెబ్బది అయిదు వేల సంవత్సరములు రాజ్యంబును పరిపాలనము జేసెను " అని వెంకటశర్మ జెప్పెను.

కార్తవీర్యార్జునుని పరిపాలనా సామర్ధ్యము, దత్తాత్రేయ మహాముని అనుగ్రహమును విని సంతోషమును పొందిన తండ్రి అయిన శివశర్మను జూచి కుమారుడు వెంకటశర్మ యిటులని జెప్పుచున్నాడు—

## కువలయాశ్వుని చరిత్ర

"ఓ తండ్రీ! పూర్వకాలమునందు ఋతధ్వజుడను రాజు గలడు. ఆ రాజు అనేకములగు యజ్ఞయాగాదులను జేసి దేవేంద్రునితో సఖ్యముగలవాడై యుండెను. ఆరాజునకు ఒక్క పుత్రుడు గలడు. అతడు నాల్గువేదములను, ఆరు శాస్త్రములను జదివి అస్త్ర శస్త్రాది విద్యల పరిశ్రమను అవలీలగ జేయుచు తోడి రాజనందనులతో గూడి తిరుగుచు కాలానుగుణ్యములగు ఆటల నాడుచు సంచరించుచుండెను.

యిటుల నుండగా ఒకనాడు నాగలోకమునుండి యశ్వతరు
డను నాగేంద్రుని కుమారులు యిద్దరు వచ్చి రాజకుమారు
నితో స్నేహమునుజేసి ఆహార విహారాదులను జర్గించుచు
అర్ధరాత్రమున యెవ్వరికిని తెలియకుండునటుల నాగ
లోకమునకు బోవుచు వచ్చుచుండిరి. ఈ విధముగా చాలా
కాలము జరిగిన పిమ్మట కుమారులు భూలోకమునుండి
నాగలోకమునకు వచ్చుటను యశ్వతరుడు జూచి తన
పుత్రులతో యిటులని పలికెను—

"ఓ పుత్రరత్నములారా! మీరు భూలోకమునకు
వెళ్ళి వచ్చుచున్నటుల కనబడుచున్నది. మీరు భూలోక
మున నెవ్వరితో స్నేహమును జేయుచుండిరో జెప్ప
వలసిన ద"ని అడిగెను.

ఆ నాగపుత్రులు తండ్రికి వినయంబున వందనము
లను జేసి—"ఓ తండ్రీ! మేము భూలోకమునందు
ఋతధ్వజుడను రాజపుత్రుడు శత్రజిత్తు అనువాడు కలడు.
అతడు సర్వగుణ సంపన్నుడు, సకలవిద్యాపారంగతుడు.
అటువంటి వానితో స్నేహముజేయుట మంచిది అని
మేమతనితో స్నేహముజేసి నిత్యము అచ్చటికి బోవు

చుంటిమి. యతని స్నేహమువలన మేము సకలవిద్యలను యభ్యసించితిమి. యతని స్నేహమువలన భూలోకము నకు వెళ్ళి వచ్చుచుంటిమి. అతని స్నేహము లేనియెడల మా ప్రాణములు నిలువవు" యని జెప్పగానే అశ్వతరుడు- "ఓ పుత్రరత్నములారా! శాస్త్రములు యభ్యసించినవారు యనేకులు గలరు. సుగుణసంపత్తి గలవారును యనేకులు గలరు. గాని ఈ రెండు గుణములును ఒక్కనియం దుండుట అరుదు. ఆ రెండుగుణములు మీ స్నేహితుని యందు గలవని వినుటచేత నాకు చాలా సంతోషము గలుగుచున్నది. మీరు అతనివలన నుపకారమును బొంది ప్రత్యుపకారము చేయకుండుట సాధుజన సమ్మతము కానేరదు. మీరు మన లోకమునందుగల అపూర్వ వస్తువును వానికి యివ్వవలెను" అని తండ్రి జెప్పగానే కుమారులు జెప్పుకున్నారు— "ఓ తండ్రీ! ఆ రాజపుత్రుడు అష్టైశ్వర్య సంపన్నుడు. అతనికి యివ్వదగిన వస్తువులు మన దేశమున ఎవ్వియు లేవు. యతని సాహస గుణములను జెప్పుచున్నాము వినుము—

ఆ రాజపుత్రుడు ఒకనాడు గాలవముని ఆశ్రమమును పాడుజేయుచున్న రాక్షసుని సంహరించుటకు కోరబడి, వెళ్ళి ఆ మునివలన కువలయాశ్వమును పొంది

ఆశ్రమమునకు వెళ్లెను. ఆ గుఱ్ఱము నదీ, పర్వతములు సహితము యవలీలగ దాటగలదు. అంతరిక్షమునందును స్వేచ్ఛగ సంచరించును. ఆ గుఱ్ఱమునెక్కి ఆశ్రమమును సంరక్షించుచుండగా ఆ రాక్షసుడు పందిరూపమునుదాల్చి ఆశ్రమ సమీపమునకు వచ్చెను. అది రాజపుత్రుడు జూచి కువలయాశ్వమును రాక్షసునిమీదకు త్రోలి అతనిని అర్ధ చంద్రాకార బాణముతో కొట్టెను. ఆ దెబ్బకు సూకర దానవుడు తాళలేక అడవిలోనికి పారిపోయెను. దానివెంట దరుముచు రాజపుత్రుడు వెళ్లెను.

ఈ విధముగా సూకరదానవుడు అనేక యోజనములు పరుగిడి పర్వతగుహలో దూరెను. కువలయాశ్వముతో గూడ రాజపుత్రుడు వెళ్లెను. ఆ గుహలో దూరిన రాక్షసుడు ఎచ్చటను కనబడలేదు. గాని ఆ సమీపమునందు పాతాళలోకము కనబడెను. అచ్చట స్వర్గపట్టణముతో సమానముగు పట్టణము కనపడెను. అందు జొచ్చి జూచుచుండగా పూలతోటయందు దిరుగుచున్న కన్యారత్నము కనబడెను. ఆమె యేమియు బలుకక పోవుచుండెను. ఆ కన్యను జూచి కువలయాశ్వుడు మదన పీడితుడై గుఱ్ఱమును దిగి ఒక తావున దానిని బంధించి

తాను ఆమెవెంట పోయెను. అచ్చట అలంకారయుక్త మైన మంచముమీద కూర్చుండి విచారించుచున్న ఒక కన్యను జూచెను. ఆమె ఈ రాజనందనుని జూచి మోహా వేశముగలదై యిటులని యోచించుచుండెను—"ఆహా! యీ పురుషుడు సామాన్యుడు కాడు. దివ్యలక్షణ సమన్వితుడై యుండెను. సిద్ధ, విద్యాధర, గంధర్వ, గరుడ వంశాదులందు ఉద్భవించి యుండును. ఇతడు యెందువలన ఇచ్చటకు వచ్చియుండును" అని యోచించుచు మూర్ఛపొందెను.

కువలయాశ్వుండును మదనపీడితుడై యుండియు, ధైర్యముగలవాడై—"ఓ తరుణీ! నీవు యెందులకు బాధను పొందుచున్నావు? నీ అభీష్టమును నిర్భాటంకముగ నెరవేర్చి నీ దాసుడనై యుండగలవాడను" అని అనేక విధములుగా జెప్పెను.

ఆ మాటలు మృదుమధురముగా హృదయంబునకు సంతోషము కలిగించగా ఆ కన్య సిగ్గుగలదై సమీపము నందుగల చెలికత్తెతో తన వృత్తాంతమును జెప్పుమని సంజ్ఞజేసెను.

అంతట చెలికత్తె సర్వవృత్తాంతమును తెలియ పర్చెను. పిమ్మట యీ విధముగా జెప్పినది—“ఈ కన్య నీ దర్శనము జేసినది మొదలు బాధపడుచున్నది. ఈమె స్వర్గలోకమున విశ్వావసుడను గంధర్వరాజు కుమార్తె. ఈమె పేరు మదాలస. సకలగుణ సంపదలవల్లను ఆ పేరునకు తగియున్నది. ఈమెను పాతాళకేతుడను రాక్షసుడు తీసుకువచ్చి యిచ్చట వుంచెను. యీమె విచారించుచుండగా ఆకాశవాణి మదాలసతో—‘నిన్ను కువలయాశ్వుడు వివాహమాడును’ అని జెప్పెను. పాతాళకేతుడు సూకరరూపమున నిన్ను యిచ్చటకు తీసుకుని వచ్చెను. నీవు మదాలసను వివాహమాడి యీమె దుఃఖమును పోగొట్టవలసిది” అని జెప్పెను.

కుండలి యను చెలికత్తె జెప్పిన మాటలు రాజనందనుడు విని సంతోషించి యిట్లని జెప్పసాగెను—“అమ్మా, కుండలాంబ! నేను ఋతధ్వజుడను రాజేంద్రుని పుత్రుడను. నన్ను శత్రజిత్తని లేక కువలయాశ్వుడని అందురు” అని జెప్పెను.

ఆ మాటలు మదాలస విని చాల సంతోషించెను.

# మదాలసను కువలయాశ్వునకిచ్చి వివాహము జేయుట

మదాలస అనుజ్ఞప్రకారం విశ్వావసు అను గంధర్వ రాజును, తుంబురుని రప్పించి మంచి సుముహూర్తమున మదాలసను కువలయాశ్వునకు యిచ్చి వివాహము జేసెను.

విశ్వావసు, తుంబురులు, బంధుమిత్రులయుక్తముగా వివాహమును జేసి తన ఆశ్రమమునను వెళ్ళిరి. కుండలాంబ మదాలసను జూచి—"అమ్మా! మదాలసా! నీ కోరిక నెరవేరెను. యింక నేను నా ఆశ్రమమునకు వెళ్లెదను. నీకు తగిన భర్త లభించెను. రాజపుత్రా! నీవు యీ మదాలసయందు అనురాగము గలిగి వుండవలెను" అని జెప్పి తన ఆశ్రమమునకు వెళ్లెను.

కువలయాశ్వుడు తన భార్యయగు మదాలసను తీసుకుని కువలయాశ్వము నెక్కి వచ్చుచుండగా పాతాళకేతుడు తన చారులవలన వర్తమానమును విని తన సేనలతో ఎదురువచ్చి కువలయాశ్వునితో యుద్ధమును జేయదొడగెను. అంతట కువలయాశ్వుడు రౌద్రాకారుడై

ఆగ్నేయాస్త్రమున రాక్షసుల నందరిని సంహరించగా పాతాళకేతుడు మృతిబొందెను. వాని తమ్ముడు తాళకేతుడు మొదలగువారు పారిపోయిరి.

అంతట కువలయాశ్వుడు శత్రుసంహారముజేసి తన భార్యతో రాజధానికివచ్చి తల్లిదండ్రులకు భార్యా సమేతముగా నమస్కరించి జరిగిన వర్తమానమంతయు జెప్పెను. తల్లిదండ్రులు చాల సంతోషించి వారిని ఆశీర్వదించిరి. కువలయాశ్వుడు భార్యతో సుఖంబుగానుండి ప్రజలచే గౌరవింపబడుచుండెను.

యిట్లు కొంతకాలము జరిగిన పిమ్మట సూకర రాక్షసుని తమ్ముడు తాళకేతుడు పూర్వవైరమున కువలయాశ్వుని మోసముజేసి మదాలసను అపహరించెను" అని అశ్వతరుని కుమారులు జెప్పిరి.

ఆ మాటలకు అశ్వతరుడు చాల విచారించి తన కుమారులను భూలోకమునకు పంపించి కువలయాశ్వుని రప్పించి తన తపోమహిమచే మదాలసను తెప్పించి కువలయాశ్వునకు యిచ్చెను. కువలయాశ్వుడు తన భార్య మదాలసను పొంది యువరాజై సర్వసుఖంబులను పొందు

చుండెను. యిట్లు చాలాకాలము జరిగిన పిమ్మట ఋత ధ్వజుడు కువలయాశ్వునకు రాజ్యభారము నప్పగించి తాను భార్యాసమేతముగా తపోవనంబునకు జనెను.

## మదాలసకు పుత్రులు కలుగుట

ఇట్లుండగా కొంత కాలమునకు మదాలసకు విక్రాంతుడను కుమారుడు గలిగెను. ఆ కుమారునకు తల్లి మదాలస తత్త్వోపదేశము జేయగా అతడు తపోవనంబునకు పోయెను. ఈ విధముగా సుబాహుండు, రిపుమర్దనుండు అను పుత్రులు గలిగిరి. వారికిని తత్త్వోపదేశము జేయగా వారును తపోవనమునకు జనిరి. పిమ్మట నాల్గవపుత్రుడు అలర్కుడు జన్మించెను. ఆ కుమారునకు శాస్త్రోక్త ప్రకారంబుగా ఉపనయనాదులు జేసెను. వానికి సకల శాస్త్రంబులు జెప్పించగా సకల శాస్త్రంబులను, అథర్వణ వేదమును ఆమూలాగ్రముగా నభ్యసించి తల్లి యెదుట నిలువబడి— "అమ్మా! నేను జేయవలసిన కార్యమును జెప్పవలసినది" అని కోరెను.

మదాలస కుమారుడగు అలర్కుని జూచి— "నాయనా! అలర్కా! నీవు రాజ్యాభిషిక్తుడవై నిష్పాక్షి

కముగా ధర్మయుక్తముగా రాజ్యపాలనంబు జేయుము. నానావిధములను అపకారములను జేయుచున్న

శ్లో॥ మృగయంతక్షస్త్రియః పానం వాక్పారుష్యమర్ధాదూషణం।
రిత్తపారుష్య మిత్యే యంగ్నేయం వ్యసన సప్తకం॥

ద్యూతము, పానకము, వాక్పారుష్యము అను సప్త వ్యసనములను వదలవలెను. శత్రువులవలన అపజయము కలుగునట్టి మార్గముల నెరిగి జాగ్రత్తగ నుండవలెను. దుష్టాదుష్టులగు మంత్రుల స్వభావంబుల నెరిగి యుండవలెను. చారులవలన శత్రువులసంగతి తెలిసికొను చుండవలెను. రాజు మిత్రాప్త బంధువర్గంబును నమ్మి యుండ రాదు. సమయోచితంబుగ ఒకానొకప్పుడు శత్రువులనైనను నమ్మియుండవలెను.

## మదాలస అలర్కునకు రాజనీతి దెల్పుట

"స్థాన, వృద్ధి, క్షయములను; సంధి, విగ్రహ, యానాసన ద్వైదీభావ సమాశ్రయములను దెలసి యుండవలెను. రాజునకు మంత్రులు, భృత్యులు ఆత్మవంటివారు. మరియు

ప్రజానురాగము గలవారై యుండవలెను. ఇటువంటి రాజును ఎవ్వరును జయింపలేరు. శత్రువులను జయింప గలిగి యుండును. లేనియెడల రాజ్యపదభ్రష్టుడగుటకు సందియములేదు. కామ, క్రోధ. లోభ, మదమోహ, మాత్సర్యములను ఆరు వికార గుణంబులను జయింప వలెను. ఇంద్రియములను జయింపలేనివారు ముఖ్యముగా ఇహపరములకు జెడుదురు. కామముచేత పాండు మహా రాజున్ను, లోభంబువలన ఇలుండును నాశనము పొందిరి. మదంబుచేత వేనుడు నశించెను. సంతోషముచేత పురంజయుడు నశించెను. కనుక నీవు కామక్రోధాదులను వదలి సంచరింపుము, బహు నీతిమంతుడవు గమ్ము. మరుత్తుడను రాజు కామాది షడ్గుణంబులు గలిగి నశించును. శత్రు పక్షమునందు కీటక కృత్యంబుల నాచరించవలెను. ఒక్కొక్కప్పుడు పిపీలికావృత్తి నుండవలెను. ఈతిబాధలు తన రాజ్యమునందు గలుగకుండునటుల పరిపాలించు చుండవలెను. దేవేంద్రుడు భూలోకమునందు నాలుగు మాసములు వర్షమును గలుగజేసి తాను భూలోకమునందు జేయబడు యజ్ఞయాగాదులవలన పదిరెండు మాసములు సుఖమును పొందుచుండును.

నీవును ప్రజలను సుఖింపజేయవలెను. సూర్యుడు ఎనిమిది నెలలు భూమియందు గల జలమును హరించు చందమున రాజు ప్రజలను బాధించగూడదు.

యముడు కాలము సరిపోయిన వారిని, శత్రువులని మిత్రులని తలంచక అందరను తీసుకొనిపోవు విధమున రాజు నిష్పక్షముగ ప్రజలను శిక్షింపుచుండవలెను. పూర్ణిమ చంద్రుని జూచి ప్రజలు సంతోషమును పొందు విధమున రాజును ప్రజలను జూచి సంతోషమును పొందుచుండవలెను. గాలి అన్ని జంతువులయందు సంచరించుచుండు విధమున రాజు ప్రజలు మనస్సులలో తలంచుకొను చుండునటుల మెలగవలెను. యీ విధముగ సంచరించు రాజు ఇహ పరములందు సర్వసుఖంబులను పొందును. ధర్మ యుక్తంబుగ పరిపాలనజేయు రాజు ప్రజలు చేయు పుణ్య కార్యంబుల ఆరవపాలు పుణ్యంబును పొందుచుండును. అధర్మ పరిపాలనము జేయు రాజు ప్రజలుజేయు పాపంబున సగము భాగమును పొందుచుండును " అని తల్లి జెప్పెను.

తల్లి మాటలకు అలర్కుడు యిటులని ప్రశ్నించు చున్నాడు—

## వర్ణ ఆశ్రమ ధర్మంబులు

" ఓ తల్లీ ! నీవు రాజనీతిని జెప్పితివి. నీ వచనామృతమును గ్రోలి కృతార్థుడనైతిని. వర్ణ, ఆశ్రమ ధర్మంబులను కూడా తెలియజేయవలసినది " అని అలర్కుడు అడిగెను.

ఆ మాటలకు మదాలస యిట్లు జెప్పదొడంగెను—

" పుత్రా ! అలర్కా ! దానాధ్యయన యజ్ఞంబులును, యజన అధ్యాపన ప్రతిగ్రహణము లను ఆరు విధములను బ్రాహ్మణుడు ఆచరింపదగిన ధర్మములు. యివి బ్రాహ్మణులకు ప్రాణాధారమును గలవి. దానాధ్యయన యజ్ఞంబులు మూడును క్షత్రియ ధర్మంబులు. రాజు ధర్మమును జేయుచు భూమిని పాలించుచు శస్త్రధారియై జీవించవలెను. ధర్మము దాన, యజ్ఞంబులు మూడును వైశ్యుల ధర్మములు. వాణిజ్యము, జీవికావృత్తి, దానయజ్ఞములు. బ్రాహ్మణ శుశ్రూషయు శూద్రకుల ధర్మములు. పశుపోషణము, కృషి, ద్విజాతి, శుశ్రూష పోషణములు, క్రయ విక్రయములును జీవికావృత్తి. ప్రతి మనుష్యుడును స్వధర్మము

వలన వృద్ధిపొందును. భ్రష్టుడు కానేరడు. నిషిద్ధ కార్యములు జేయుటవలన నశించిపోవును. ఉపనయనము అగు పర్యంతము ద్విజత్వమును పొందడు.

సూ॥ జన్మనా జాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః॥
అని జెప్పబడియున్నది. ఉపనయనము అయిన పిమ్మట గురువునొద్ద శుశ్రూషను జేయుచు బ్రహ్మచర్యమును నడుపుచు వేదాధ్యయనాదులు జేయుచుండవలెను.

సూ॥ నిత్యం సంధ్యాముపాశీతా ప్రత్యవాయో అన్యథాభవేత్॥

ఆ విధముగా నడచుకొనినవాడు నరకమును పొందును '' అని జెప్పెను.

## బ్రహ్మచర్య ధర్మములు

తిరిగి మదాలస యిట్లు జెప్పదొడగెను—" ప్రతిద్విజుడును ఉపనయనము అయిన పిమ్మట గురువునొద్ద శుశ్రూషను జేయుచు బ్రహ్మచర్యమును నడుపుచు వేదాధ్యయనము జేయుచుండవలెను. స్వాధ్యాయము, అగ్ని శుశ్రూషయు, స్నానము, భిక్షాన్నము, గురు అనుమతిపొంది భుజించుట ఇవి ధర్మములు. యీ విధముగా విద్యాభ్యాసమునుజేసి

గురు దక్షిణ నిచ్చి అనుమతిపొంది గృహస్థాశ్రమమును పొందవలెను. గృహస్థాశ్రమము ఇష్టము లేనివారు వాన ప్రస్థాశ్రమమును పొందవలెను. లేనియెడల చతుర్థాశ్రమమును పొందవలెను.

## గృహస్థాశ్రమ ధర్మములు

గృహస్థాశ్రమమునకు ముఖ్యములు :— వివాహము, సమానకుల కన్యకనుగాని, ఋషికులోత్పన్న కన్యకను గాని, సుగుణ సంపన్నత గల కన్యకనుగాని వివాహము జేసుకొనవలెను. తన ఆశ్రమ ధర్మములచే ధనమును ఆర్జించి పిత్రు, దేవతా కార్యములు జేయుచుండవలెను. భృత్యులను, పుత్రులను, బంధుజనులను, దీనులను, అంధులను, పతితులను, కుంటి మూగ అంగహీనులు మొదలగు దుర్బలులకు (అనగా కష్టపడి పనిచేసుకుని ఉదరపోషణము జేసుకొనుటకు శక్తిలేని వారికి) తన శక్త్యానుసారముగ అన్నదానము జేయుచుండవలెను. పంచయజ్ఞములు చేయుచుండవలెను. గృహస్థులు పిత్రు దేవతాదికార్యములు జరిపి భుక్తశేషమును భుజింపు చుండ వలెను. తన సంపద (స్వార్జితమును) పై విధముగా అనుభవించుచుండవలెను.

## వానప్రస్థ ధర్మములు

దేహదారుఢ్యము తప్పిపోయిన పిమ్మట గృహకృత్యాది భారము కుమారులకు ఒప్పగించి ఆత్మశుద్ధికొరకు వానప్రస్థ ధర్మములు ఆచరింపవలెను. అరణ్య పదార్థములను దినుచు, తపస్సును జేయుచు, నేలయందు పరుండుట, బ్రహ్మచర్యము, పిత్రుదేవతాది తిధులు, హోమములు, త్రికాలస్నానము, జటావల్కధారణము, మౌనము (మితభాషణము) యివి ఆత్మశుద్ధికొరకు ఆచరించి సమముగా ధర్మములను నడపుచు మనస్సును అరికట్టుట ముఖ్యధర్మములు.

## చతుర్థాశ్రమము

చతుర్థాశ్రమము : దీనికి సన్యాసము అని పేరు. దీనికి సర్వాంగము, సర్వసంగపరిత్యాగము, జితేంద్రియుడై చిరకాలము ఒక్కచోట నుండక బ్రహ్మచర్యము జరుపుచు కోపములేనివాడై భిక్షాన్నమును తినుచు, తత్వశాస్త్రమును పరిశీలనము జేయుచు ఆత్మాలోకనము జేయుచుండవలెను.

## సర్వ వర్ణములవారు ఆచరించవలసిన ధర్మములు

సత్య, శౌచ, అహింస, అసూయములు, అందరును ఆచరించవలెను. ఆనృశంశ్యమును, నకార్పణ్యమును, సంతోషమును గలిగి యుండవలెను. ఈ విధముగా ధర్మములను దెలుసుకొని ప్రతి మానవుడు సంచరించు చుండవలెను. యీ ధర్మములు ఆచరించనివారిని రాజు శిక్షింపు చుండవలెను" అని జెప్పెను.

తల్లిమాటలు విని అలర్కుడు యిటుల ప్రశ్నించు చున్నాడు—"అమ్మా! గృహస్థాశ్రమ ధర్మములను, వాటి విశేషములను, తన వర్ణాశ్రమమునకు తగిన ధర్మములను జేయుచున్నప్పుడు మనుష్యుడు జేయదగిన కార్యములేవి? చేయతగని కార్యములేవి? వాటిని విశదముగా జెప్పవలసినది" అని కోరెను.

ఆ మాటలకు మదాలస యిటుల జెప్పుచున్నది— "కుమారా! అలర్కా! గృహస్థు సకల జీవులను రక్షింపు చుండవలెను. పితృదేవతలు, దేవతలు, మునులు, మనుజులు, క్రిమి కీటకములు, పక్షులు, పశువులు, గృహస్థుచే

కాపాడదగినవి. వేదత్రయరూపమైన ఆవు సర్వసంప దలకు ఆధారమని నమ్ముము. వేదమునందు అన్ని లోకములు నిండివున్నవి. ఋక్కులు, వృష్టము, ఋజు వేదము మద్యము, సామవేదము ముఖము, ఇష్టా పూర్తములు. శృంగములు, సాధుసూక్తములు, రోమ ములు, శాంతి పుష్టులు. గోమయము, గోమూత్రములు వర్ణములు, పాదములు, స్వాహాకార స్వధాకార వషట్కా రహంత, ఆకారములు స్థనములు.

యీ నాలుగు స్థనములలో మొదటిదానిని దేవతలు, రెండవదానిని పితృదేవతలు, మూడవదానిని ఋషులు, నాలుగవదానిని మనుష్యులు పానము జేయుచుందురు. యీ విధముగా గో, ధేనువు, అన్నివర్ణముల మానవు లకును సంతోషము కలుగజేయును. కావున మనుష్యుడు ఈ ధర్మములను వదలిన యెడల శీలలేని రథమువలె కాలక్రమమున శిధిలమగుటకు సందియములేదు. అధః పతితుడగును.

## దేవతలకు బలిదానముజేయు విధము

పుత్రరత్నమా! గృహస్థు ప్రతిదినమునందు ప్రాతః కాలమునందు, అనగా సూర్యోదయమునకు నాలుగు

ఘడియల ముందుకాలము. దీనినే తపోకాలమనిన్ని, ఋషి కాలమనిన్ని పిలచెదరు. యీ కాలమునందు లేని పూర్వ దినమునందు

శ్లో॥ అర్కే వీర్యం ధటేదీప్తిః కరంజేవి జయోభవేత్ ।
ప్లక్షే చైవార్థ సంపత్తిః ర్బదర్యాం మధురో ధ్వనిః ।
ఖదిరే ముఖ సౌగంధ్యం బిల్వేతు విపులం ధనం ।
జౌ దంబారేతు వాక్సుద్ధి రామ్రేత్వారోగ్య మేవచ ।
కరంజేతు ధృతిర్మేధా చంపకేతు ధృఢామతిః ।
శిరీషే కీర్తి సౌభాగ్యం ఆయురారోగ్యమేవచ ।
కరంజేతు ధృతిర్మేధా ప్రజ్ఞాశక్తి స్తథాధ్వనిః ।
దాడిమ్యాం సుందరాకారః కకుభేకుటభేస్తథా ।
జాజీతగరమందారై ర్దుస్స్వప్నం చవినస్యతి॥

అని చెప్పబడియున్నది. దంతకాష్టమును తీసుకుని తూర్పుగానైనను, ఉత్తరముగా నైనను కూర్చుండి

శ్లో॥ ఆయుర్బలం యసోవర్చః ప్రజాపశూవసూనిచా
బ్రహ్మప్రజ్ఞాంచ మేధాంచ తన్నో దేహి వనస్పతే॥

అని జెప్పి దంతధావనముజేసి యిష్టదేవతా నమస్కారమును జేసి స్నానానుష్టానాదులను తీర్చుకుని ధౌత వస్త్రాదులను

దాల్చి భస్మధారణముజేసి ధర్మాసనంబున గూర్చుండి సూర్యోదయము అగువరకు గాయత్రీ మహామంత్రమును జపించవలెను. సూర్యోదయము అయిన పిమ్మట సూర్యోప స్థానమును జెప్పి రెండు యామములవరకు తపంబుజేసి పిమ్మట దేవర్షి పితృతర్పణంబులు జేసి గృహంబునకు రావలెను. అనంతరమునందు దేవతలను గంధ పుష్పా దులచే పూజింపవలెను. (దీనినే దేవార్చనమందురు) గృహ మధ్యమునందు బ్రహ్మకును, విశ్వదేవతలకు బలి అన్నమును పెట్టవలెను. ఈశాన్యదిక్కున ధన్వంతరికిని, తూర్పున యింద్రునకును, దక్షిణమున యమునకును, పశ్చిమమున సోమునకును యివ్వవలెను. గృహద్వారమున ధాతకును, విధాతలకు యింటిచుంట్టును, సూర్యునకును, రాక్షసులకు అంతరిక్షమున యివ్వవలెను. యివి అయిన పిమ్మట సర్వభూతములకు యివ్వవలెను. తరువాత పిపీలి కాది సర్వభూతములకు యివ్వవలెను.

ఈ విధముగా భూతములకు అన్నము పెట్టిన పిమ్మట గృహస్థు నియమిత మనస్కుడై ఆచమనమును జేసినయెడల దీనినే వైశ్యదేవమని జెప్పుదురు. పిమ్మట

గృహస్థు సింహద్వారమువద్దకు వచ్చి తలుపు తెరచి కొంత తడవు నిలుచుండవలెను. ఆ సమయమున వచ్చిన అతిథిని పూజించి అన్నాదులచే తృప్తిపరచవలెను. వాని కుల గోత్రాదుల నడుగరాదు. అతిథి భుజించి తృప్తిని పొందిన యెడల శ్రీమహాలక్ష్మి మహావిష్ణువులు సంతోషమును పొందుదురు.

అతిథికి అన్నమును బెట్టక గృహస్థు భుజించిన యెడల అతిథి యొక్క పాపములు గృహస్థునకు జేరును. గృహస్థుని పుణ్యములను తాను తీసుకొనిపోవును. అతిథి సత్కారము ముఖ్యము.

## గృహస్థు జేయదగిన ధర్మములు
## నిత్య నైమిత్తికములు

ప్రతి గృహస్థు నిత్యమనియు, నైమిత్తికమనియు, నిత్య నైమిత్తికమనియు మూడు విధములయిన కర్మలు జేయు వలెను. ప్రతి దినమునందు పంచయజ్ఞములు జేయుట నిత్యము. జాతకర్మాదులు నైమిత్తికము. పర్వశ్రాద్ధాది కర్మలు నిత్యనైమిత్తికములు, ఉపనయనకాలమునందు

జేయు నాందీ, వివాహ కాలమునందుజేయు స్థాళీపాకములు దేవతలను పూజించుట యివిగాక, ఒకడు మరణము పొందినపుడు దహనాది ప్రేతకర్మలు అతి శ్రద్ధాభక్తులతో జేయుటయు మరణకాలము మొదలు ప్రతినెలకు మాస శ్రాద్ధమును జేయుచు సంవత్సరము అనంతరమందు ప్రత్యాబ్ధిక శ్రార్ధంబును యధావిధిగా జేయవలెను.

ఈ విధముగా జేసిన విశ్వదేవతలును, పితృ దేవతలును, తృప్తిని పొందుదురు.

పుత్రహీనునకు క్రియలు అతని సపిండులు జేయవలెను. సపిండులు లేనియెడల సహోదరులు జేయవలెను. లేనియెడల భార్య, అదియు లేనియెడల దేశాధిపతి జేయవలెను. అనగా ఆ కులమువారిచేత ప్రేతకృత్యములు జేయించవలెను.

## శ్రార్థ విధానము

ఒకనికి తండ్రి తాత ముత్తాత వీరు ముగ్గురు సపిండులు. ముత్తాతకు మీదనుండు ముగ్గురును ఉపభుక్కులందురు. ఈ ఆరుగురును కర్తయుజేరి సప్తపురుషులని పిలువబడును.

ఈ ఆరుగురులోను ముగ్గురు ముఖ్యబంధువులనియు తక్కినవారు గౌణసంబంధులనియు జెప్పబడుదురు. శ్రాద్ధకర్మలను యథావిధిగా జేయుటచేత పితృదేవతలు తాము భూలోకమునందు జేసిన పాపములకు తగిన నరకములను పొందక పుణ్యలోక ఫలములను అనుభవించెదరు. శ్రాద్ధదినమునందు కర్త స్నానము జేయునపుడు కట్టుకొనిన బట్టనుండి జారిన నీటిబిందువులచేత వృక్షత్వము పొందినవారును, శరీరమునుండి జారిన నీటిబిందువులచేత దేవత్వము పొందినవారును, పిండదానకాలమునందు భూమియందు రాలిన కణములచేత పశుపక్ష్యాది యోనులయందు బుట్టినవారును, వికిరాన్నముచేత భూతపిశాచాది రూపములు పొందినవారును, వికిరాన్నము మీద విడుచు నీటిచేత సంస్కారము చేయదగినవారై యుండియు సంస్కారము లేక దగ్ధులగువారును భుజించి తృప్తిపొందుదురు. ఆచమన పాదప్రక్షాళన కాలమున భూమిమీద పడిన జలబిందువులచేత, అన్యుల కులములందు యితర స్త్రీలకు బుట్టినవారు, కర్తకు సంకర కులములందు బుట్టినవారును సంతుష్టులగుదురు. అన్యాయముగా ఆర్జించి శ్రాద్ధము చేసిన ఛండాలాదుల పాలగును. పితృదేవతలకు జెందవని తెలుసుకొనుము.

స్వమతానుచారముగా న్యాయముగా సంపాదించిన ద్రవ్యముచేతను పితృకార్యముల జేయవలెను. ప్రతి నెల యందు వచ్చు అమావాస్య, మఖ, అష్టమి మొదలగు తిధులును, సద్బ్రాహ్మణ సమాగమ కాలమును, సూర్య చంద్ర గ్రహణ కాలములు, దక్షిణ ఉత్తరాయణ పుణ్య కాలములు విష్ణువత్పుణ్యకాలము.

సంక్రమణ వ్యతీపాత కాలములు, శ్రార్ధమునకు ఉపయుక్తమునకు పనికివచ్చు పదార్ధములు దొరకిన కాలమునందును దుస్స్వప్నము గలిగిన కాలము, జన్మ నక్షత్ర దినము, గ్రహపీడ గలిగిన సమయము, యివి శ్రార్ధము జేయదగిన కాలములని తెలుసుకొనుము.

ఏకశాఖాధ్యయన పరుడు, యోగియు, సామాన్య వేదపాఠకుడు, శాస్త్రము చదివినవాడు, వేదము చదివిన వాడు, దౌహిత్రుడు, ఋత్విక్కుడు, అల్లుడు, మేనల్లుడు, మామ, మేనమామ, కర్మనిష్టుడు, తపోనిష్టుడు, మాతృ పితృభక్తి గలవాడు, ఆత్మబంధువు, వీరు శ్రార్ధనిమంత్రణకు తగినవారు.

## శ్రార్ధ నిమంత్రణకు తగనివారు

వ్రతభ్రష్టుడు, రోగి, అంగహీనుడు, అంగాధికుడు, రెండవ వివాహమాడినదానికి పుట్టినవాడు, కుష్టురోగి, నల్లని దంతములు గలవాడు, ఏకనేత్రము గలవాడు, కుండకుడు (అనగా తండ్రీయుండగా యితరులకు పుట్టిన వాడు) గోళకుడు (అనగా విధవా స్త్రీకి బుట్టినవాడు) మిత్రద్రోహి, పుప్పిగోళ్ళవాడు, అపవాదు పొందినవాడు, దొంగ, కొండెగాడు, నెయ్యి అమ్మేవాడు, కన్యకను అమ్మినవాడు, వైద్యము జేయువాడు, గురు వేద దేవ నింద జేయువాడు, వేదవిక్రయుడు, శత్రువు, విధవా స్త్రీని వివాహము ఆడినవాడు, కర్మభ్రష్టుడు, రజస్వలై స్త్రీని వివాహము అయినవాడు, వీరు శ్రార్ధనిమంత్రణకు పనికి రారు. కావున యుక్తాయుక్తములను దెలుసుకుని యోగ్యు లగు బ్రాహ్మణులను నియమించవలెను. శ్రార్ధదినంబునకు పూర్వదినమునందు నిమంత్రణముజేయు భోక్తలును, శ్రార్ధకర్తయు, శ్రార్ధదినంబునకు పూర్వదినమునందును, శ్రార్ధదినమునందును సంభోగాదులు పనికిరావు. స్త్రీ సంభో గము జేసిన యెడల పితరులు ఒక మాసము రేతః

కూపమున నుందురు. అందువలననే పూర్వదినమునందు భోక్తలను నియమించవలెను. అటుల నియమించుటకు వీలులేనియెడల స్త్రీలోఁబరుగాని భోక్తలను నియమించవలెను. శ్రార్ధ సమయంబునకు వచ్చిన సద్బ్రాహ్మణుడు గాని, యతిగాని, యోగికాని, భోక్తగా వచ్చినయెడల గొప్ప ఫలము గలుగును. శుక్లపక్షముకంటె నపరాహ్ణము నందు పితరుల ప్రీతికొరకు విద్యుక్తానుసారముగ పిత్రు శ్రార్ధము చేసిన యెడల పితరులు సంతసించెదరు. తన శక్తికి తగినటుల సువర్ణ, రజిత, వస్త్రాదుల నొసంగవలెను. అటుల జేసిన పిత్రుదేవతలు సంతోషించి అష్టయిశ్వైర్యములు నొసంగుటకు ఆశీర్వదించుచుందురు.

## శ్రార్ధ దినమునకు పనికివచ్చు పదార్థములు పనికిరాని పదార్థములు

శ్రార్ధమునకు చాపలు మొదలగు ధాన్యములు పనికివచ్చును. మర్కటాది ధాన్యములు, ఉల్లి, ముల్లంగి మొదలగునవి లంచముగా గాని, పతితునిచేతగాని, అన్యాయముగా గాని, కన్యను విక్రయించిన వారివలన గాని

తీసికొనిన పదార్థములుగాని పనికిరావు. పరిశుభ్రమైన ప్రదేశమునందును, సూర్యరశ్మి తగిలెడు తావునందు గల జలము నుపయోగించవలెను. అడవి మృగములు, గొఱ్ఱె, లొట్టిపిట్ట, ఒక్క గిట్టగల జంతువులు, బఱ్ఱె, చమరి మొదలగు జంతువులు పాలు పనికిరావు. పిపీలికములు, పురుగులు, మెట్టపల్లములు గల తావులు, తగులబడిన తావులు, దుర్వాసనగల తావులు పనికిరావు. పరనింద జేయువాడు, దీర్ఘరోగి, మంగలి, దిగంబరి, పాతకి, నపుంసకుడు, అపవిత్రుడు మొదలగువారును, కోడి, పంది, కుక్క, మార్జాలము మొదలగు నీచజంతువులు చూచుచుండగ చేయరాదు. ఆవు ఈనిన పదిదినములలోని పాలును, యాచించి తెచ్చిన పాలును పనికిరావు. కర్త యగువాడు శ్రార్ధ దినమునందు రజస్వలాస్త్రీ స్పర్శ ప్రమాదమున తగిలినను, శ్రార్ధమునకు నీచవస్తు స్పర్శ తగిలినను ఆ రోజున ఉపవాసము వుండి మరుచటి దినము నందు తిరుగా యధావిధిగా శ్రార్ధములు జరిగించవలెను.

శ్రార్ధ దినమునందు మరుగైన, పరిశుద్ధమైన స్థలమునందు నువ్వులను జల్లి మితభాషియై, దుంపజాతి, కంద, పెండలము, చామయు, అరటి, పనస, కాకర,

అల్లము, బలుసు మొదలగు పదార్ధములు, స్వార్జితముగ సంపాదించిన పదార్ధములతో శ్రద్ధాభక్తులు గలిగి శ్రార్ధ కార్యము నెరవేర్చవలెను. ఈ విధముగా పితృకార్యము నెరవేర్చిన పితరులు సంతసించి యిష్టార్ధములును, ఆయుర్వృద్ధియు నొసంగుచుందురు.

## కామ్య శ్రార్ధము

"ఓ కుమారా ! అలర్కా ! కామ్యశ్రార్ధమును జెప్పు చున్నాను వినుము" —

౧. పాడ్యమియందు ధనలాభమును

౨. విదియయందు సంతానమును

౩. తదియయందు ఇష్టార్ధములు

౪. చవితియందు శత్రునాశనమును

౫. పంచమియందు ఐశ్వర్యంబును

౬. షష్టియందు విలాసాదులును

౭. సప్తమియందు అధికారమును, ఉద్యోగలాభం

౮. అష్టమియందు సుఖసంపదలును, పశువృద్ధియు

౯. నవమియందు స్త్రీలాభంబును, వివాహాది శుభములు
౧౦. దశమియందు సకల కామ్యములు నెరవేరును
౧౧. ఏకాదశియందున సకల విద్యాప్రాప్తియు
౧౨. ద్వాదశియందు సర్వకార్య ఫలప్రదమున్ను
౧౩. త్రయోదశియందు స్త్రీ పురుష సంతాన్నలాభమున్ను బుద్ధి, కుశలత, పశువృద్ధి, ఆయుర్వృద్ధిన్ని.
౧౪. చతుర్ధశియందు ఆయుధముచే మృతిని పొందిన వారున్ను, చిన్నపిల్లలుగా చనిపోయినవారు తృప్తిని పొందుదురు.
౧౫. అమావాస్య (పూర్ణిమ) యందు శ్రార్ధము జేసిన కర్తకు సకల లాభంబులు గలిగి సర్వసుఖంబులును గలుగును. కావున అమావాస్య పూర్ణిమలయందు శ్రార్ధకర్మలు జేయుట ముఖ్యము.

## కామ్యకర్మలు జేయుటకు నక్షత్రములు

౧. కృత్తికా నక్షత్రమున స్వర్గమును
౨. రోహిణియందు సంతాన్నము

౩. మృగశిరయందు జయము

౪. ఆరుద్రయందు శౌర్యము

౫. పునర్వసునందు భూలాభము

౬. పుష్యమియందు సంతోషము

౭. ఆశ్లేషయందు కుమారలాభము

౮. మఖయందు బంధుగౌరవము

౯. పుబ్బయందు సౌభాగ్యము

౧౦. ఉత్తరయందు పుత్ర, మిత్ర, సంపద, ధర్మబుద్ధి

౧౧. హస్తయందు సుజనత్వము

౧౨. చిత్తయందు శరీరకాంతి, సంతాన్నము

౧౩. స్వాతి వర్తకలాభము

౧౪. విశాఖయందు పుత్రలాభము

౧౫. అనూరాధయందు ప్రభుత్వము

౧౬. జ్యేష్ఠయందు ఉద్యోగలాభము

౧౭. మూలయందు ఆరోగ్యము

౧౮. పూర్వాషాఢయందు కీర్తియు

౧౯. ఉత్తరాషాఢయందు శోకనాశనము

౨౦. శ్రవణమునందు స్వర్గప్రాప్తి

౨౧. ధనిష్టయందు ధనసంపదలు

౨౨. అభిజిత్తుయందు వేదవేదాంగ విద్యలు

౨౩. శతభిషంయందు వైద్యసిద్ధి

౨౪. పూర్వాభాద్రయందు పశువృద్ధి

౨౫. ఉత్తరాభాద్రయందు భార్యాపుత్రాది సౌఖ్యము

౨౬. రేవతియందు ధనధాన్య సమృద్ధియు

౨౭. అశ్వనీ నక్షత్రమునందు వాస్తువాహన సమృద్ధియు

౨౮. భరణియందు ఆయుః భాగ్యాదులను కలుగును.

కాబట్టి కర్తయగువాడు యుక్తాయుక్తంబులు విచారించి తిధి, వార, నక్షత్రంబులు విచారించి తీర్థవిధులను జేయుచుండవలెను.

ఈ విధముగా నిత్య నైమిత్తికాది కర్మలు జేయనివాడు మహాపాపంబులను పొంది ఘోరంబులగు నరకంబులు పొందుదురు.

## గృహస్థుం ఆచరించవలసిన ధర్మములు

గృహస్థు సదాచారసంపన్నుడై దైవభక్తి గలిగియుండెనేని పాపంబులను పొందక సుఖించును. ఆచారహీనుడై యున్న యెడల యిహపరములకు చెడును. అటువంటివాడు జేయు పుణ్యకార్యములు ఫలమును యివ్వవు. ఆయువు నశించును, ఐశ్వర్యము నశించును, ఆపదలు గలుగుచుండును, కావున ఆచారసంపన్నుడై యుండవలెను. ధర్మము, అర్థము, కామము, మోక్షమును, ధనమును, సంతాన్నమును, భార్యాదులును గలిగి యిహమునందును, పరమునందును సుఖంబుల పొందును, గృహస్థు త్రివర్గ సంసిద్ధిని పొందును. ధర్మబుద్ధిగల గృహస్థు తనకుగల మూలధనంబువలన వచ్చెడు లాభంబు నాల్గుభాగంబులుగా జేసి ఒక భాగము యజ్ఞయాగాది సత్కర్మలకును, రెండవ భాగము నిత్యనైమిత్తికాది కర్మలకును, సంసార బంధమగు ఖర్చులకును ఉపయోగించవలెను. మూలధనమును జెడకుండ కాపాడుచుండవలెను. పాపంబు క్షయించు

టకును, పుణ్యలోకములు గలుగుటకును దాన ధర్మంబులు జేయుచుండవలెను. యీ ధర్మమునందు కామ్య కర్మములు కూడా జేయుచుండవలెను. ధర్మార్థములకు హానిజేయు కామ్య కర్మలు జేయరాదు. గృహస్థు ప్రాతఃకాలమున లేచి స్నానాది కృత్యములు నిర్వర్తించి ఆదినమునందు తాను జేయుటకు తగిన కార్యములను నిర్ణయించుకుని తూర్పుముఖముగా కూర్చుండి ఆచమనముజేసి నక్షత్రము లుండగా ప్రాతఃసంధ్యావందనము జేయవలెను. సూర్యాస్తమయ సమయమునందు సాయం సంధ్యావందనమును జేయవలెను. వ్యర్థముగా మాట్లాడుట, అనృత్యములు పలుకుట, కఠినముగా మాట్లాడుట, గట్టిగా మాట్లాడుట, నీతిలేని శాస్త్రములు జదువుట, అయోగ్యులతో తిరుగుట పనికిరాదు. ప్రాతఃస్సాయంకాలములందు నిర్మలమైన మనస్సుగలవాడై వేళకు అగ్నిహోత్రాది కార్యములు జేయుచు ఉదయమునందును, అస్తమయమునందును, సూర్యమండలమును జూడక పరిశుభ్రమైన మనస్సు గలిగి యుండవలెను.

సూర్యబింబమును జూచుచు తలదువ్వుట, అద్దము జూచుట, పండ్లు తోముట మొదలగు చెడుపనులు జేయ రాదు. గ్రామ సమీపములందును, తీర్థంబులందును,

మార్గములందును, పశువులు తిరుగు స్థలములందును, దున్నిన పొలములు మొదలగు ప్రజలు తిరుగు స్థలము యందు మూత్రపురీషములను విడువరాదు. వస్త్రములేని స్త్రీని జూడరాదు. మలమూత్రములు విడుచునప్పుడు జూడరాదు. వెంట్రుకలు త్రొక్కరాదు. రజస్వలైన స్త్రీని జూచుట, మాట్లాడుట కూడదు. నీటియందు మలమూత్రములు విడువరాదు. బూడిద, ఎముకలు, బొగ్గులు, గుడ్డ పీలికలు త్రొక్కరాదు. మార్గమునందు పడిన ఆకులు, మలిన వస్తువులు, మురికినీరు వీటిని ద్రొక్కరాదు. పితరులకు, సాధుజనులకు, దేశ, కాల, శక్త్యానుసారముగ ఉపచారములను జేసి పూజింపుచుండవలెను. పిమ్మట భుజించి తూర్పుముఖముగా పద్మాసనముగా కూర్చుండి ఆచమనము జేయవలెను. భుజించునప్పుడు పడమట ముఖముగా గాని, తూర్పు ముఖముగా గాని కూర్చుండ వలెను. ఎప్పుడును ఉత్తరముఖముగా కూర్చుండి భుజింప రాదు. ఉప్పు, కారము, పులుపు, మిక్కిలి వేడిగానుండు పదార్థములు విశేషముగా తినకూడదు. నడచునప్పుడు మలమూత్రములను విడుచునప్పుడు తినుట తగనివని. ఆచమనము జేయక భుజింపరాదు. అపరిశుద్ధుడై యితరులతో మాట్లాడకూడదు. గోవును, బ్రాహ్మణుని, అగ్నిని, తన శిరంబును కారణములేక ముట్టుకొనకూడదు. బుద్ధి

పూర్వకంగా సూర్య చంద్ర నక్షత్రాదులను చూడరాదు. శిధిలమైన పీటలయందు గూర్చుండరాదు. విరిగిన మంచమునందు పరుండరాదు. గురు జనంబులతో విన యంబుగ మాట్లాడవలెను. శిధిల యజ్ఞోపవీతము ధరించుట యేకవస్త్రముతో భుజించుట, యేక హస్తమున దేవతాదుల పూజించుట, బ్రాహ్మణుల నిందించుట, మంటలేని అగ్ని యందు హోమముజేయుట, దిశమొలతో స్నానము జేయుట పనికిరాదు. రెండు చేతులతో తొడలను, శిరస్సును గోకరాదు. మాటిమాటికి శిరస్నానము జేయరాదు. గృహస్థు ప్రాతః కాలమునందును, మధ్యాహ్న కాలము నందును గాక సాయంకాలమునందు శిరః స్నానము జేయరాదు.

అధ్యాయ దివసంబులుగాని అనాధ్యాయ దినము లందు వేదాధ్యయనము జేయరాదు. ఆవులకు, బ్రాహ్మణు లకు, సూర్యచంద్రులకు, దేవాలయములకు ఎదురుగా కూర్చుండి మలమూత్రములను విడువరాదు. పగటివేళ ఉత్తరముఖముగాను. రాత్రులయందు దక్షిణ ముఖము గాను కూర్చుండి మలమూత్రములు విడువవలెను. గురు వును, దేవతలను, బ్రాహ్మణులను నిందించుట వినరాదు.

మార్గమునందు రాజునకు, బ్రాహ్మణునకు, దేవతలకు, గర్భిణీ స్త్రీలకు, రోగులకు, బరువును మోయువారికి, మూగ, అంధిక, పిచ్చివారికిన్ని, మదించినవారికిన్ని, పగవానికిన్ని, బాలురకు, మతభ్రష్టులకు, మార్గమును వదలవలెను. దేవాలయమునకు, రావిచెట్టునకు, ఆవునకు, పండితునకు, గురువునకు, ప్రదక్షిణము జేయవలెను. తాను ధరించు పాదరక్షలు, వస్త్రములు యితరులను తాకనివ్వరాదు. చతుర్ద దశియందు, అష్టమియందు, పూర్ణిమ, అమావాస్యయందు, ఏకాదశి, ద్వాదశిలయందు తైలాభ్యంగనమును, స్త్రీ సాంగత్యములును పనికిరావు. ఒంటి కాలిమీద నిలుచుండుట, కాళ్లు ఆడించుట, ఒక పాదము మీద మరియొక పాదము పెట్టి తోముట, డాంబికము, దురభిమానము, చోరగుణము యివి యుండరాదు. మూర్ఖుని, వెఱ్ఱివానిని, ఏడ్చువానిని, కురూపిని, దగా జేయువానిని, హీన, అధికాంగములవానిని, హేళన జేయరాదు. ఆసనంబున కూర్చుండునపుడు పాదములు నేలనుమోపి కూర్చుండవలెను. క్షీరాన్నము, పులగము, తనకొరకు వంటచేయించరాదు. పగలును, రాత్రుల యందును, అతిధుల పూజింపుచుండవలెను.

ప్రాతఃకాలమున లేచి ఉత్తరదిక్కుగా కూర్చుండి దంతధావనము చేయవలెను. దుర్గంధముగా నుండు నీటి యందును, మురికి నీటియందును స్నానము చేయరాదు. గ్రహణ కాలములందు తప్ప యితర కాలములందు రాత్రి స్నానము చేయరాదు. రంగుగల వస్త్రములు ధరించ కూడదు. వెంట్రుకలు, కాకి, చిలుక, పిల్లి, కుక్క మొదలగునవి తాకిన పదార్థములు తినకూడదు. దుష్టాన్నము అనగా అందరును భుజించిన పిమ్మట మిగిలిన శేష పదార్థములు. ఇవి పనికిరావు. ఉదయమునందు, అస్త మయమునందు నిద్రింపగూడదు. స్నానము జేయకయు, నిలుచుండియు, సంభోగము జేసిన పిమ్మట బరుండియు, శయ్యను గూర్చుండియు, ఏకవస్త్రము గలవాడై యుండియు భుజింపరాదు. తాను ఏ పదార్థమైనను తినునప్పుడు ఇతరు లకు బెట్టక తినరాదు.

ప్రాతః కాలమునందు యథావిధిగా స్నానము చేయవలెను. పరస్త్రీ సంగమము చేయకూడదు. అందు వలన ఆయువు, కీర్తి, ఐశ్వర్యములు నశించిపోవును. దేవతార్చనము జేయునప్పుడును, అగ్నికార్యమునందును గురు నమస్కారము జేయునపుడును, ఆచమనము

జేయుట ముఖ్యము. ఆచమనము జేసిన పిమ్మట రెండు పర్యాయములు మార్జన చేయవలెను. (చవిటి నేలమట్టి మార్జనకు పనికిరాదు) దాహము వేయునపుడును, వాంతులు అయిన పిమ్మటను ఆచమనము జేయవలెను. పిమ్మట ఆవు పృష్ఠము నయినను, సూర్యునైనను జూచి నమస్కరించవలెను. శిరస్స్నానమును జేయక పిత్రుకార్యమును జేయరాదు. మంచి కులమునందు పుట్టినదియు, శుభలక్షణములు గల కన్యను వివాహమాడిన సుఖము కలుగును. దుర్గుణముగల కన్యను వివాహమాడుటకంటె సన్యాసము మంచిది. రజస్వలైన నాల్గవనాడు సంభోగము జేసిన స్వల్ప ఆయుర్భాగ్యములు గల పుత్రుడు గలుగును. కావున రజస్వలానంతరము నాల్గవరోజున భార్యా సంసర్గము నిషేధింపబడినది. బేసిదినములందు ఆడ సంతాన్నమున్ను, సరిదినములందు పురుష సంతాన్నమున్ను కలుగును. కావున తమ కోరికనుబట్టి సంభోగాదులు జేయుట మంచిది.

పర్వదినముల యందును, సంధ్యాకాలముల యందును, పగటియందును, దుఃఖము కలుగునప్పుడును,

నిశిరాత్రులందును, భయముగా నుండునపుడును, స్త్రీ సంభో గము కూడదు. అటువంటి కాలములయందు స్త్రీ సంభో గము జేసినయెడల క్రూరులు, అల్పాయుష్యులు, దరిద్రులు వికలాంగులు పుట్టుదురు. క్షౌరకర్మయందును, వాంతి యందును స్త్రీ సంభోగమునందును సచేల స్నానము జేయవలెను. అశుభము కలుగజేయు కృత్యములు జేయ కూడదు. అమంగళ వాక్యములు పలుకరాదు. ఉన్మత్తులు, మూఢులు, అవినీతి పరులు, దుష్టకార్యములు జేయువారు, వీరితో స్నేహము జేయరాదు. సాధుజన సాంగత్యము చేయుచుండవలెను. యజ్ఞ దీక్షితుడు, రాజస్నాతకుడు, బ్రహ్మచారి, శ్వశురుడు వీరు మొదలగువారు ఎవ్వరైనను గృహమునకు వచ్చినయెడల సకల కార్యములు వదిలి వారిని సత్కరించవలెను. అటుల సత్కరించక నిత్యాగ్ని హోత్రములు చేయరాదు. సత్కరించిన పిమ్మట నిత్య కృత్యములు నెరవేర్చవలెను. అంగుష్టమూలము బ్రహ్మ తీర్థము, తర్జని, అంగుష్ట మధ్యప్రదేశము పిత్రు తీర్థము, అంగుళాగ్రములు దేవతీర్థము, కనిష్టికా మూలము, ప్రజా పత్య తీర్థము, వీనిచే క్రమముగ నాచమన, పిత్రుకర్మ, దేవపూజ, నాందీముఖ, పిత్రుపూజలు యధావిధిగా

నెరవేర్చవలెను. యితర కార్యములు చేయగాదు. ఏకాలము నందైనను అగ్నినిగాని, జలమునుగాని, జేత పట్టుకొనరాదు. గురునకు, దేవతలకు యెదుటగా పాదములు చాచుట, మంచినీటిని త్రాగుట, ఆవులించుట, తుమ్ముట తగదు. అగ్నిని నోట ఊదరాదు. అప్పు యిచ్చువాడు, వైద్యుడు, శ్రోత్రియుడు, మంచినీరు, సజ్జనులుగల గ్రామమందుగాని, పట్టణమునందుగాని నివాసము చేయవలెను. ఈ విధమగు నియమములు గృహస్థు ఆచరించవలెను.

## వర్జావర్జ పదార్థములు

నెయ్యి నూనె కలసిన అన్నమును, నెయ్యి నూనె కలవని గోధుమ, యవలు, ఆవుపాలు పవిత్రములైనవి. యివి భుజించుటకు తగినవి. మలినమైన శంఖములు, రాళ్ళు, బంగారము, వెండి, త్రాళ్ళు, వస్త్రములు, పుస్తకములు, పుష్పములు, ఫలములు, పప్పులు, మణులు, వజ్రములు, పగడములు, ముత్తియములు, గృహపాత్రలు ఇవి ఉదక మార్జనముచే పవిత్రములగును. యినుప పాత్రలు తోమి కడుగుటచేత పవిత్రమగును. తైలపాత్రలు ఉష్ణోదకముచే

పవిత్రమగును. శూర్పములు, ధాన్యము, కృష్ణాజినము, రోలు, రోకలి, మడత పెట్టిన వస్త్రములు, గడ్డి, వంట కట్టెలు మొదలగు వస్తువులు జలముచే సంప్రోక్షణ చేసిన పవిత్రములగును. నారచీరలు, పట్టువస్త్రములు వేడినీళ్ళచే సంప్రోక్షణ చేసిన పరిశుద్ధమగును. కొయ్య, దంతములు, కొమ్ము మొదలగు వాటిచేత చేయబడిన వస్తువులు తడి వస్త్రమున తుడిచిన శుద్ధి అగును. మట్టిపాత్రలు, జాడీలు మొదలగునవి అగ్నిస్పర్శచేత శుద్ధి అగును. భిక్షాన్నము, మంగలి, చాకలి మొదలగువారి హస్తములు, స్త్రీముఖము పవిత్రమైనవి.

మార్గమధ్యమునందుగల వస్తువులు తెలియక త్రొక్కిన యెడలను, సేవకులు తెచ్చిన గంధ పుష్పాదులు, దాదులు, బాలురు, వృద్ధులు వీరుచేయు కార్యములును, అగ్నిహోత్రముగల గృహంబులును, పసిబిడ్డ తల్లియు, ఉదకము ఇవి సహజముగ పవిత్రముగలవి. కాల్చుట చేతను, ఊడ్చుటచేతను, గోమయముచేత అలుకుటచేతను గీయుటచేతను, భూమి పరిశుద్ధమగును. వెండ్రుకలు, కీటకములు పడినస్థలము ఆవుచేత ఆఘ్రాణింపజేసిన

శుద్ధిగలదగును. ఈగలు ముసిరిన స్థలము భస్మము జల్లినను, మట్టి పోసినను పరిశుభ్రమగును. పులుపుచేత రాగిపాత్రలును, కారముచేత సీసముచేత చేయబడిన పాత్రలును, సత్తుచేతను కంచుచేతను చేయబడిన పాత్రలు బూడిదచేత పవిత్రములగును. మలమూత్రములుగల్గ తావులు పరిశుభ్రము చేసిన పవిత్రమగును. ఆవు త్రాగుటకు సరిపడు నీరుగల గుంట పరిశుద్ధము గలదని తెలియుము. దుమ్ము, నిప్పు, గుఱ్ఱము, ఆవునీడ, సూర్య చంద్ర కిరణములు, గాలి ప్రసరించు భూమి, జలము, జలబిందువులు, పవిత్రములగును. ఈగలు మొదలగు వాటిచేత అపవిత్రములగు తావులు, బ్రాహ్మణులు సంచరించుటచేత పవిత్రములగును. మేక, గుఱ్ఱము వీటి ముఖములు పవిత్రములు ఆసనము, శయనము, బండి, నావ, మార్గములోని తుక్కు, సూర్యచంద్రకిరణములు తగులుటచేత పవిత్రములు అగును. అన్నపురాశిని కుక్క పిల్లి స్పృజించినను వాసన జూచినను ఆ రాసిలోని అన్నము అవి స్పృశించిన భాగము తీసివేసి మిగిలిన భాగమును బంగారమువేసిన నీటిచేత సంప్రోక్షణము జేసిన పవిత్ర మగును. ఉపయోగించుట దూష్యముకాదు.

దుష్టాన్నము అనగా ? భుక్తశేషము తిన్నవాడు మూడు పూటలు ఉపవశించిన శుద్ధుడగును. రజస్వలను, సూతకుని దినమొలవానిని, ఛండాలుని, మంగలివానిని తాకినయెడల సచేల స్నానము జేయవలెను. పీనుగును మోసినను, అస్థి సంచయము జేసినను సచేల స్నానము జేయవలెను సూర్యుని, దేవతలను, పండితులను జూచిన పవిత్రుడగును. ఉదకము, ఎముకలు, నలుగుపిండి దాటరాదు. నీచపదార్థములు, మల మూత్రములు, గృహమునందుగాని గృహసమీపమునందుగాని ఉంచరాదు. స్నానము జేయుటకు ముందు నదియందు గట్టుననుండి మట్టిని మూడు పర్యాయములు నదిలో వేయవలెను. చెరువునుంచి గట్టున వేయవలెను. పిమ్మట స్నానమును జేయవలెను. గృహస్థు యీ ఆచారములను తెలుసుకుని ప్రవర్తించవలెను. అటుల గాక దురాచారమును జేసిన యెడల మహాపాతకము సంభవించి నరకములకు పోవును " అని మదాలస అలర్కునకు జెప్పెను.

## ఆశౌచము

పిమ్మట మదాలస అలర్కుని జూచి యిటుల జెప్పుటకు ఆరంభము జేసెను—

కుమారా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదుల యందు మరణము సంభవించిన వారి జ్ఞాతులకు, బ్రాహ్మణులకు పది దినంబులును, క్షత్రియులకు పదిరెండు దినంబులును, వైశ్యులకు పదునైదు దినంబులును, శూద్రాదులకు ముప్పది దినంబులును ఆశౌచము వుండును. ఏజాతివారికైనను ఆశౌచదినములు అతిక్రమించక పూర్వము నిజకులాను సారముగా కర్మాధికారము కలుగదు.

సపిండులు మృతుని ముట్టుకొనిన దోషములేదు. బంధువులు అస్తిసంచయము అయిన పిమ్మట కర్తను ముట్టరాదు. సోదరులు అస్థిసంచయము చేసినపిమ్మట మృతునకు యధావిధిగా దాన ధర్మంబులు యివ్వవలెను.

ఆయుధముచేతగాని, అగ్నిచేతగాని జలమునందుగాని మరణము సంభవించిన వారి బంధుజనులకు స్నానముచేతనే పరిశుద్ధులగుదురు. బాలుడు, దేశాంతరగతుడు, సన్యాసము తీసికొనినవాడు మృతి బొందినవారి బంధువులకు స్నానము తోడనే శుద్ధిగలుగును. సన్నిహితజ్ఞాతులు మాత్రము మూడు దినములు వుండవలెను. మొదట ఒక బలవన్మరణము వలన ఆశౌచమును పొందియుండి మరియొక మరణము సంభవించిన మొదటి

ఆశౌచముతోడనే రెండవ ఆశౌచము పోవును. జాతము నందును, మృతమునందును ఈ విధముగా నుండును. సపిండ సహోదరులందే పరస్పర జాతము, మృతము గలిగిన ఆ క్షణమునందే సచేల స్నానము జేసి, పిమ్మట ఆశౌచము ఆచరించవలెను. ఆశౌచానంతరము శాస్త్రోక్తముగా ఏకోదిష్టశ్రార్ధము చేయుట మంచిది. ఈ శ్రార్ధము చేత పితృదేవతలు అక్షయ పుణ్యలోకమును పొందుదురు. కావున కర్త తన శక్తికొలది శ్రార్ధాధికార్యములు నిర్వర్తించి బ్రాహ్మణులకు దాన ధర్మాదులు చేయవలెను. అందువలన పితరులు స్వర్గసౌఖ్యమును పొందుదురు. కర్త సుఖములను పొందును.

## అలర్కుడు రాజ్యమును పొందుట

ఈ విధముగా అలర్కుడు తల్లి వలన సకల విషయములను తెలుసుకుని సంప్రాప్త యవ్వనమురాగా తల్లి దండ్రాదుల వలన వివాహాదులను పొంది యువరాజై సర్వసుఖంబులు పొందుచుండెను. కొంత కాలమునకు పుత్ర సంతానము పొంది సర్వకాల సర్వావస్థలయందు పితృవాక్యాను వర్తియై సంచరించుచుండెను.

తండ్రియైన కువలయాశ్వుడు తన కుమారుడు అలర్కుడు రాజ్యభారమునకు తగినవాడని నిశ్చయించుకుని రాజకులోచితముగా మంత్రి పురోహిత సామంతాది సహితముగా యధావిధిగా అలర్కునకు రాజ్య పట్టాభిషేకమును జేసి రాజ్యభారము కుమారునకు వప్పగించి తాను భార్యయైన మదాలసతో కూడా వానప్రస్థాశ్రమమును తీసుకుని అరణ్యమునకు బోవుచు కుమారునితో సర్వజనాను మతంబుగా ప్రజాపాలనము జేయమని అనేక నీతి వాక్యములను జెప్పెను. ఆ సమయమునందు తల్లి మదాలస యిటులని జెప్పదొడగెను—

“కుమారా! అలర్కా! నీకు యిదివరకే సకల ధర్మములను బోధించియుంటిని. వాటిని జ్ఞప్తియందుంచుకుని రాజ్యమును పరిపాలనము జేయుము. గృహస్థు ధర్మము అన్ని విధములను సుఖదుఃఖంబుల నొసంగుచుండును. నీకు దుఃఖము గలిగినప్పుడు విచారించకుము. ఒకవేళ రాజ్యాది సంపద నశించినను భయమును జెందకుము. నీకు నేను ఒక ఉంగరమును యిచ్చెదను. దీనిని నీవద్ద భద్రముగా నుంచుకొనుము. నీకు విచారము కలిగి

నప్పుడు ఆ ఉంగరముమీదనున్న వాక్యమును గ్రహించి జీవింపుము " అని జెప్పి ఉంగరమునిచ్చి అనేక ఆశీర్వచనములనుజేసి తన భర్తతో కూడా అరణ్యమునకు వెళ్లెను.

అలర్కుడు తల్లిదండ్రాదులవలన ఆశీర్వచనములను, రాజ్యమును పొంది ప్రజలను కుమారులవలె జూచుచు సర్వజనానుమతంబుగా రాజ్యపాలనంబు జేయుచు దుష్టశిక్షణ, శిష్ట పరిపాలనము జేయుచు అనేకములయిన యజ్ఞయాగాది క్రతువులజేసి దేవతా పితృ ఋణంబులను తీర్చుచు సర్వ ధర్మస్వరూపులయిన పుత్రాదులతో సర్వసుఖంబు లనుభవించుచు అన్ని దిశలయందు ధర్మస్వరూపుడని కీర్తింపబడుచు, ధర్మార్ధ కామమోక్షములను పురుషార్ధములకు భంగము లేకుండగ అనేక సంవత్సరములు రాజ్యపాలనంబు జేసియు ఒక్క దివసంబు కైవడి తలంచుచుండెను.

యీ విధముగా రాజ్యపాలనంబు జేయుచున్నను అలర్కునకు సంసార సుఖ విరక్తియు, ధర్మకార్యాసక్తియు వదలదయ్యెను. ఈ వృత్తాంతమును అతని సోదరుడు సుబాహుడను తపశ్శాలి విని తన తమ్ముడు

అలర్కునకు సంసారమునందు వైరాగ్యము యెటుల కలుగునా యని ఆలోచించి—"ఆహా! సంసార సాగరమును యీదువారికి శత్రువులు అధికమైన సంసారము నందు విరక్తి గలుగును" అని ఆలోచించి శత్రువులను కల్పించుటకు నిశ్చయించుకుని కాశీరాజు నొద్దకు వెళ్ళి— "నీవు అలర్కునిపైకి దండెత్తివెళ్ళి వాని రాజ్యమును అపహరించవలెను" అని జెప్పెను.

## అలర్కుని రాజ్యము పోవుట

రాజులకు రాజ్యకాంక్ష యెక్కువ వుండును. గాన సుబాహు డను తపశ్శాలి చెప్పిన విధముగా చతురంగ బలములను తీసుకుని అలర్కుని మీదకు దండెత్తివెళ్ళి పట్టణమును ముట్టడించి సామ, దాన, భేద, దండోపాయంబులచే రాజ్యమును స్వాధీనము జేసుకొనెను.

అలర్కుడు తన రాజ్యమును పరరాజులు స్వాధీనము జేసుకొనుటకు విచారించి తన తల్లి మదాలస యిచ్చిన ఉంగరమును స్మరించెను.

తన తల్లి మదాలస మహాత్మ్యము వలన ఆ యుంగ రము అలర్కుని ముందుకువచ్చి నిలచెను. ఆ యుంగరము మీద నున్న అక్షరములను నిటులని జదువుకొనెను—

శ్లో॥ సంగస్సర్వాత్మ నాత్యాజ్య స్సచేత్త్యర్తుం నశక్యతే।
సస్సస్సహ కర్తస్య స్సవై తస్యహి భేషజం।
కామస్సర్వాత్మనాహే యోహాతుంబే చ్ఛక్యతే నసః।
ముముక్షాం ప్రతికర్తవ్య స్సవై తస్యాపి భేషజం॥

అని యెరుంగవలెను. అనగా? సంగమును వదలుటకు యిష్టము లేనివాడు నస్సత్సాంగత్యమును వదలి సత్సాం గత్యము నవలంబించవలెను. కామమును వదలుటకు యిష్టములేనివాడు మోక్షకామి యగుట యుత్తమము. యిటుల చిత్రముగల అర్థమును స్ఫురించు పద్యమును చదివినతోడనే అలర్కుడు మోక్షమును పొందుటకు సస్సాంగత్యము ముఖ్యమని తలంచెను.

## అలర్క దత్తాత్రేయుల సంవాదము

అలర్కుడు ఆ శ్లోకమును జదువగానే మోక్షమును పొందుటకు నిశ్చయించుకుని భగవంతుడైన దత్తాత్రేయుని

వద్దకు పోయి ఆ మునికి నమస్కారమును జేసి—"ఓ దేవోత్తమా! నేను మోక్షార్థినై నీ చరణసన్నిధికి వచ్చితిని. నా దుఃఖము పోవునట్లు జేయుము" అని పలికెను.

అలర్కుని మాటలు దత్తాత్రేయ మహాముని వరుండు విని—"ఓ రాజా! నీ దుఃఖమును నేను పోగొట్టె దను. నీకు దుఃఖము కలుగుటకు కారణము యేదికలదో జెప్పుము. నీవు యెవ్వరివాడవు? దుఃఖము యెవ్వరిది? ఈ విషయమును ముందుగా ఆలోచింపుము. అంగములను అంగిని సంగమును, సర్వాంగములను విచారింపుము" అని పలికెను.

అని తండ్రియైన శివశర్మకు పుత్రుడైన వెంకట శర్మ జెప్పి—"ఓ తండ్రీ వినుము! అలర్కుడు దత్తా త్రేయ మహామునిచే అడుగబడి రెండు విధములైన దుఃఖమునకు ఆత్మయే స్థానమని, తనను దాను తెలసు కుని పకపక నవ్వి యిటులని జెప్పెను.

"ఓ మునికుల సంభవా! పృథ్వీ అపః తేజః వాయుః ఆకాశమును జేరి శరీరము అయ్యెను. ఆ శరీరము

వలన దుఃఖము గల్గెను. యీ పంచభూతములచేతను యేర్పడిన శరీరమునకు సుఖము దుఃఖము మంచి చెడ్డలు కలుగుచుండును. ఇవి దేహమునకుగాని దేహికి కలుగవు. అవియు మానసిక ధర్మములుగాని శారీరక ధర్మములు గావు. సర్వసముడ నయిన నాకు సుఖదుఃఖములు గాని, ధనధాన్యములుగాని, రాష్ట్రములుగాని, బలములుగాని లేవు" అని దత్తాత్రేయునితో అలర్కుడు పలికెను.

ఆ మాటలు దత్తాత్రేయులు విని యిటుల చెప్పుచున్నారు—"ఓ అలర్కా ! ఆత్మ పంచభూతంబులకు వేరు అయి ప్రకృతికి అతీతంబై వుండును. యెటులనగా? ఆకాశము ఒక్కటిగా వుండియు ఘటజలమునందును, తటాకమునందును, అనేక రూపములుగా కనబడునటుల సర్వవ్యాప్తమైయున్న ఆత్మ తత్వ శరీరముచేత వేరుగా కనబడును. గాని నిజమును తెలుసుకొనిన అది ఒక్కటిగానే యుండును. ఆత్మజ్ఞానము లేనిదై కర్మలనుబట్టి సుఖదుఃఖము లనుభవించుచుండును. నేను అను మొక్కను, మోహము అను ప్రమాను, ఇల్లు, భూములు అను కొమ్మలను, భార్యాపుత్రాదులు పలవలు, ధనధాన్య

డులు పత్రములు, పుణ్యపాపములు పుష్పములు, సుఖ దుఃఖములు, ఫలములు, సంసారమను నీటివల్ల పెంచ బడును. ఇవి అజ్ఞానము అను చెట్టుయొక్క నీడను జేరి యుండురు. కావున సత్సంగమను రాతియందు జ్ఞానమను విద్యను సానబెట్టి అజ్ఞానము అను చెట్టును జ్ఞానము అను గొడ్డలిచే నరికినయెడల బ్రహ్మజ్ఞానము గలుగును.

అలర్కా ! దేహము అనెడు మొలకను పెరికి వేసిన భ్రాంతి అది తెలియును. బ్రహ్మము నీవుగావు, నేను కాదు. ఇది శాశ్వతమై, అంతములేనిదై, ప్రకాశము గలదై, పంచభూతములు గలదై వెలుంగుచుండును" అని దత్తాత్రేయులవారు చెప్పిరి.

అప్పుడు అలర్కుడు—" ఓ విష్ణుసంభూతా ! పునర్జన్మము లేకుండునటుల మార్గము ఏది గలదు ? ఒకవేళ జన్మించినను నిర్గుణత్వము గలుగుటకు యేవిధము ఆచరింపవలెను ? యీ విషయములు గురించి చెప్పవలసినది" అని కోరెను.

# దత్తాత్రేయుఁడు అలర్కునకు జేసిన యోగ మార్గము

దత్తాత్రేయుడు యిటుల చెప్పుచున్నాడు—ఓ అలర్కా! జ్ఞానము గలిగియుండుట ముక్తి యనబడును. ముక్తి సంగరహితము జ్ఞానపూర్వకమై యుండును. దేనిచే బ్రహ్మైక్యము కలుగునో అదియే యోగశక్తి అనబడును. యోగమువలన ముక్తియు, సంగ త్యాగమువలన యోగమును బుట్టును. సంగము దుఃఖకారణము కావున మోక్ష మార్గమును గోరువారు సంగవర్జితుడు కావలెను. సంగము వర్జించుటవలన మమకారము నశించును. ఐక్యము సుఖము కలుగును. జ్ఞానమున వైరాగ్యము గలుగును. తాను నివశించు గృహము, తాను భుజించు అన్నము ముక్తికి అజ్ఞాన కారణమని తెలియుము, పుణ్య పాపములు వలన సంభవించెడు కర్మబంధము శరీరమును బాధించును గాని ఆత్మను బాధింపజాలవు. ఇది అజ్ఞాన మార్గము.

అలర్కా! యోగమార్గమును దెల్పెదను వినుము. ప్రాణాయామముచే దోషములును, ధారణచే పాపంబును,

ప్రత్యాహారముచే సంసర్గమును, ధ్యానంబున ప్రాకృత కర్మలు నశించును. సూర్యకాంతిచేత గైరికాది ధాతువులు నశించునటుల ప్రాణాయామముచే నింద్రియ దోషంబులు నశించును. ప్రాణాపాన నిరోధము ప్రాణాయామమని పిలువబడును. గావున ముందు ప్రాణాయామము సాధించవలెను. ఇది లఘువు, మధ్యమము, తురీయము అని మూడు విధములు. యిరువది ఆరు మాత్రలు కాలము తురీయమని పేరు.

## తత్త్వోపదేశము

ఒక రెప్పపాటు కాలము మాత్ర మనబడును. ప్రాణాయామము మూడు విధములు, ప్రాణాయామము మొదట జేరుటకును. రెండవదానిచే గంపమును, మూడవదానిచే దుఃఖమును జయింపవచ్చును. సింహము, పెద్దపులి మొదలగు క్రూరజంతువులు పెంపకముచేత మనుష్యులకు స్వాధీనమగునటుల యోగికి ప్రాణాయామముచేత ప్రాణము స్వాధీనమై యుండును. మదపుటేనుగు మావటి వానికి స్వాధీనమై యుండునటుల యోగికి ప్రాణము స్వాధీనమై

యుండును. అటువంటి యోగికి ముక్తిని గలుగజేయు దశలు నాలుగు గలవు. వాటిని జెప్పెదను వినుము.

ద్వస్తి, ప్రాప్తి, సంవిత్తు, ప్రసాదము-అనునవి. వీని స్వరూపములు జెప్పెదను వినుము. పుణ్యము, పాపము, కర్మఫలరతుండై, నిర్మలాంతఃకరుణుండై ఉండుటకు ద్వస్తి యనబడును. లోభము, మోహములు గల యిహలోక సౌఖ్యంబులు విడచియుండుట ప్రాప్తి యనబడును. గతము, అనాగతము, విప్రకృష్ట తిరోహితములైన యుద్ధములను తెలసి సూర్య చంద్ర నక్షత్రముల సందర్శనము గలవాడై పొందు సంపద సంవిత్తము. మనస్సు, వాక్కు, యింద్రియములు, నిర్మలముగా నుంచుట ప్రసాదంబని పిలువబడు పద్మాసనము, అర్ధాసనము, స్వస్తికాసనము మొదలగు వాటిలో యే ఆసనము నయినను వేసి ఆసీనుడై హృదయంబున ఓంకారము నిలిపి యోగము ప్రారంభము చేయువలెను. సర్వసత్వసముండును. సమాసనాసీనుండును అగుచు ఊరువులు బిగియజేసి శిశ్నవృషణంబుల మడిమల నంటనీక, దిక్కులు చూడక, నాసికాగ్రము నందు దృష్టి నిలిపి సత్వగుణంబులు

## అణిమాదులు

శ్లో॥ అణిమా మహిమాచైవ లఘిమా గిరిమా స్తధా
ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం అష్టభూతయః॥

అనునవి అష్టసిద్ధులని పిలుతురు. యివి యోగి యగువాడు ముఖ్యముగా పొందదగినవి.

౧. అణిమ = అతి సూక్ష్మమైనది. ౨. మహిమ = అతి గొప్పదిగాగలది. ౩. లఘమ = అతి శీఘ్రమయినది. ౪. గిరిమ = పర్వతాకారము గలది. ౫. ప్రాప్తిః = పొందదగిన వస్తువులను పొందుట. ౬. ప్రాకామ్యము = ఆదిపత్యము గలది. ౭. యీశత్వము = సర్వవ్యాపకమయినది. ౮. వశిత్వం = సర్వప్రపంచకమును తన వశమునం దుంచుకొనుట, యీ యణిమాదులచే యోగి యగువాడు. నిప్పు, నిప్పునందు కలియునటుల అభేధాభావమున పరబ్రహ్మమును పొందును.

## యోగిధర్మములు

అలర్కా! నరులకు సుఖమునకు దుఃఖమునకు కార ణములు మానము, అహంభావము, అవమానము అనెడి ఈ మూడును క్రమముగ అమృతము. విషము అను వాటితో సమానములు. మానము విషమువంటిది, అవ మానము అమృతమువంటిది అని తలచెడి యోగికి సకల సిద్ధులు కలుగును. యోగి కన్నులకు బాగుగ వున్నదని తోచిన స్థలమునందు పరుండుట, నడచుట, వడపోసిన నీరును త్రాగుట, సత్యము పలుకుట, మంచి వస్తువని దలంచుట, ధర్మములు, ఆతిధ్యము, శ్రాద్ధము, యజ్ఞము, దేవతా వుత్సవాదులు యివి చూచుటకు వెళ్ళరాదు. భిక్షాట నమును జేయుచు ప్రజలకు పిచ్చివానివలె కనవడవలెను

యతీశ్వరులు మంచి గుణములుగల గృహస్థుల గృహములనుండి భిక్షాన్నమును దెచ్చుకుని భుజింపవలెను. పతితులు వర్ణాంతరులు మొదలగువారి గృహంబులనుండి భిక్షాన్నము తెచ్చుకుని తినరాదు. మజ్జిగ, పాలు,

క్షీరాన్నము, పండ్లు, దుంపలు, శనగలు, పెసలు మొద లగునవి భుజించుట మంచిది పూర్వ, ఉత్తర, అపరాశ నములు జేయవలెను. దొంగతనము జేయకుండుట, బ్రహ్మచర్యము, సర్వసంగ పరిత్యాగము చేయవలెను. లోభగుణము వుండరాదు. యోగికి అహింస ముఖ్య ధర్మము. ఆశాపాశాదులకు జిక్కరాదు. సంగవర్జితుడై కోపములేక మితాహారము జితేంద్రియత్వముగలిగి శూన్య ప్రదేశములు, పర్వత గుహలు, వనములు మొదలగు తావులయందు మనస్సును ధ్యానమున నిలిపి ప్రారంభము జేయవలెను. వాక్కును, మనస్సును, కాయమును అను ఈ మూడు దండములను నియమితి గలిగి యుండవలెను. వీనినే త్రిదండి అందురు. లోకము ఆత్మమయముగా దోచిన యోగికి శత్రువులుగాని స్నేహితులుగాని వుండరు.

సర్వభూత సమత్వముగల యోగి బ్రహ్మపదము పొందును. పునర్జన్మ లేదు. వేదముకంటె యజ్ఞము, యజ్ఞముకంటె జపము, జపముకంటె జ్ఞానము ఉత్తమము. అటువంటి యోగి విశ్వమయుడు, విశ్వేశ్వరుడు అని తెలియుము.

## ప్ర ణ వ ము

పరమాత్మను తెలుసుకొనుటకు 'ఓం' అను అక్షరమును స్మరించవలెను. ఈ ఓంకారమున బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, త్రిభువనములు, త్రేతాగ్నులు, త్రికాలములు, త్రిమతములు నిండియున్నవి. ఓంకారమునందు ప్రపంచక మంతయు నిండియున్నది. ఇటువంటి ఓంకారము తెలిసిన యోగి పూర్వ, జన్మ, కర్మంబులను వదిలి మరల జన్మించువాడైనను ఓంకారమును స్మరించుట చేత యోగి అయి పుట్టును.

## మృత్యువును తెలుపు అరిష్టములు

శ్లో॥ అరుంధతీం ధృవంచైవ, విష్ణో స్త్రీణి పదానిచ ।
ఆయుర్హీనా నపశ్యంతి, చతుర్థం మాతృమండలం॥

అనగా:- అరుంధతి, ధృవుడు, దేవమార్గము, శుక్రుడు, తనపీడ కనపడనివాడు ఒక సంవత్సరము

బ్రతుకును. అగ్నియందు సూర్యచంద్రులయందు కిరణములు కనబడనివాడు పదునొకండు నెలలు బ్రతుకును. స్వప్నమునందు వమనము, మలమూత్రములు తాను విడచినట్టు వచ్చిన పదినెలలు, శవము, పిశాచములు, పచ్చటి (పసుపునః) చెట్లను జూచిన తొమ్మిది నెలలు బ్రతుకును. హఠాత్తుగా బలిసినను, చిక్కినను, చిరాకు గలుగుచున్నను, బుద్ధి చలించుచున్నను, జ్ఞాపకశక్తి తగ్గినను ఎనిమిది నెలలు బ్రతుకును. పావురము, గ్రద్ద, బొంతకాకి, కాకి, గుడ్లగూబ మొదలగునవి తలపై వ్రాలినను, తన్నినను ఆరు ఏడు నెలలును, తన నీడయందు శిరము లేనియెడల రెండు లేక మూడు నెలలు, తన శరీరము మేక కంపు, పీనుగుకంపు, దుర్గంధముగాని వోచిన పదునైదు దినములు జీవించును. స్నానము జేసిన వెంటనే శరీరమందును పాదములయందును తడిలేకయున్నను, దాహము త్రాగినను తీరకయున్నను, గాలి తన శరీరమునకు తగిలినప్పుడు అంగములు నొప్పి తోచినను, నీరు తాకినప్పుడు దుఃఖము కలిగినను, యెలుగు, కోతి, దున్నపోతునెక్కి దక్షిణముగా పోవునట్లును, ఎఱ్ఱ బట్టలు, తైలవస్త్రములు, వికారరూపముగల ఆడది నవ్వుచు ఆడుచు వచ్చినను, బురదలో శిరఃపర్యంతము మునిగినట్లును స్వప్నము వచ్చిన పది దినములు బ్రతుకును.

పగటియందు భయము కలిగినను, కన్నులయందు తన నీడ కనపడకపోయినను, ముక్కు వంకర గలిగినను, చెవులు వంగినను, ముఖము తెల్లబాఁడినను, నాలుక నల్ల బడినను, ఎడమకన్ను నీరు కారుచున్నను, తల వణకు చున్నను, దేహము మొద్దుబారినను, ఊర్ధ్వముగా చూచు చున్నను, శ్వాస పుట్టినను, కడుపులో మంట కలిగినను, వెంటనే మరణము కలుగును. చెవులు మూసుకున్న, ఆత్మ ఘోషము వినబడకపోయినను మరణము కలుగును. యుత్తమ లక్షణములుగల యోగి మరణ లక్షణములను తెలుసుకుని ఆత్మధైర్యమును అవలంబించి తన్మయుడై మనోవాక్కాయ బుద్ధులను నియమించి, పరబ్రహ్మ సంధానమును జేసిన మోక్షమును బొందును.

## బ్రహ్మపదము గనుట

ఓ రాజా! చంద్రకిరణములకు, చంద్రకాంత రాయి ఉదకమును స్రవించు విధమున, సూర్యకిరణములకు సూర్యకాంతి రాయి నిప్పును గ్రక్కు విధమున యోగంబున బ్రహ్మపదము గలుగును. పిపీలికాదులు తమ గృహము

చెడిపోయిన వేరు గృహంబున ప్రవేశించు విధమున జీవుడు మరియొక శరీరమున ప్రవేశించును చిన్నది అయిన చెదపురుగులు క్రమక్రమముగా మన్నును కొరికి గుప్పలు కుప్పలుగా జేర్చునటుల దానిని గురూపదేశముగా నెంచుకుని క్రమముగా యోగమును సాధింపవలెను. అటుల సాధించిన యోగికి సులభముగా బ్రహ్మైక్యము కలుగును " అని అనేకవిధములుగా దత్తాత్రేయ మహా ముని అలర్కునకు జెప్పగా సంతోషమును పొంది అలర్కుడు ఇటులని జెప్పుచున్నాడు—

" అయ్యా ! దత్తాత్రేయా ! నా రాజ్య కోశాదులను శత్రురాజులు ఆక్రమించగా భయముచేత నీవద్దకు వచ్చి నీ దయవలన యోగము అను అగ్నిచే అజ్ఞానము అను అడవిని దహింపజేసి, సంసారము నిస్సారమని తెలుసు కుంటిని. నాకు శత్రువులు మిత్రులు లేరు " అని జెప్పెను.

ఆ మాటలకు దత్తాత్రేయుడు సంతోషమును పొంది నమస్కారమున బడవద్దని జెప్పి అలర్కుని పంపించి వేసెను " అని కుమారుడు వెంకటశర్మ తండ్రి అయిన శివశర్మతో జెప్పెను.

## సుబాహు, అలర్కు, కాశీరాజుల సంవాదము

కుమారుడు జెప్పుచున్నాడు:—" ఓ తండ్రీ ! అలర్కుడు దత్తాత్రేయునివలన తత్వోపదేశమును పొంది ఆ మునికి నమస్కరించి అనుజ్ఞను పొంది తన రాజధానికి వెళ్ళి తన రాజ్యమును తీసుకొనిన కాశీరాజువద్దకును సోదరుడైన సుబాహు వద్దకును వెళ్ళి ఇటులని పలికెను—

" రాజ్యకాంక్ష గల ఓ రాజా ! నా రాజ్యము అంతయును నీవు స్వేచ్ఛగా అనుభవింపుము. ఓ సుబాహూ ! నీ కోరిక ప్రకారము రాజ్యమును మీకు వదిలితిని. మీరు యిద్దరును నా రాజ్యమును అనుభవింపుడు " అని చెప్పెను.

ఆ మాటలకు కాశీరాజు ఆశ్చర్యమును పొంది— " అలర్కా ! రాజులు సంగరమునుజేసి రాజ్యము పాలించుట ధర్మమైయుండగా నీవు రణముజేయక రాజ్యమును వదలుటకు కారణమేమి ? ఇటుల రాజ్యమును వదలుట రాజ్యధర్మము కాదు. నీవు క్షత్రియ ధర్మమును యెరుగుదువు. రాజ్యకాంక్షచే మరణ భయము వదిలి శత్రువుతో యుద్ధము జేయవలెను. గాని నీవు వైరాగ్యము పొందుటకు కారణమేమి ? అని యడిగెను.

ఆ మాటలకు అలర్కుడు—"ఓ రాజా! నేను యుద్ధమును జేయుటకు నిశ్చయించితిని. గాని ఇప్పుడు దత్తాత్రేయ మహాముని వలన బ్రహ్మజ్ఞానము పొంది పంచభూతాత్మకమైన ప్రపంచక మంతయు శ్చిచ్ఛక్తి స్వరూపమునియు, రాజ్య, అమాత్యాదులందరును అస్థిరము లనియు తెలుసుకుంటిని. నేను బ్రహ్మయందు ఐక్యమును బొందుటకు అరణ్యమునకు పోవుచున్నాను. ఇంద్రియ నిగ్రహముకంటె అధికమగు జయములేదు" అని జెప్పెను.

సుబాహుడు రాజునకిట్లని—"కాశీరాజా! నా సోదరుడు అలర్కుడు చాలాకాలము రాజ్యమును పాలించియు సకల భోగంబులు అనుభవించియు, ఎన్నటికిని విరక్తిని పొందక ఉండుటచేత నిన్ను ప్రార్థించి వాని రాజ్యమును ఆక్రమించమని కోరితిని మా తల్లి మదాలసవల్ల మేము ముగ్గురము తత్వజ్ఞానమును పొంది రాజ్యకాంక్ష లేక తపంబునకు వెళ్ళితిమి. ఇప్పుడు అలర్కుడు నీవలన దత్తాత్రేయుని వలన జ్ఞానియయ్యెను. నీవు రాజ్యమును పొంది సుఖింపుము" అని జెప్పెను.

అంత కాశీరాజు—"ఓ సుబాహూ! నాకుకూడా రాజ్య కాంక్షలేదు. కావున నీవు నాకు తత్వోపదేశము చేయవలసినది" అని కోరెను.

కాశీరాజు సుబాహువల్ల తత్త్వోపదేశమును పొంది జ్ఞానియై అలర్కునకు రాజ్యమును వదలి తన రాజధానికి పోయెను. సుబాహుడు తపంబునకు పోయెను. అలర్కుడు తన పెద్దకుమారునకు యథావిధిగా రాజ్యమును ఒప్పగించి తపోవనంబునకు పోయెను.

గద్య : ఇతి శ్రీ వేమూరి సూర్యనారాయణ సిద్ధాంతివర్య
గురుకటాక్ష లబ్ధ శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వర వర
ప్రసాద యజుర్వేద తైత్తిరీయ శాఖాధ్వర ఆపస్తంబ
సూత్ర గౌతమగోత్ర పవిత్ర వోలేటి వంశ పయః
పారావార రాకాసుధాకర సంజీవరాయామాత్య
పౌత్ర రామయామాత్య తృతీయ పుత్ర
బుధజన విధేయ వెంకట లక్ష్మీ
నృసింహశర్మ ప్రణీత ఇతిహాస
గ్రంథమున మార్కండేయ
పు రా ణ ము ను తె లు గు
వ చ న కా వ్య ము న
ప్రథమాశ్వాసము.
శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరార్పణమస్తు.



శ్రీ ర స్తు

శ్రీ రాజరాజేశ్వరాయనమః

# మార్కండేయ పురాణము

## వచనం - ద్వితీయాశ్వాసము

కుమారుడు వెంకటశర్మ చెప్పగానే తండ్రి శివశర్మ విని- "కుమారా! అలర్కుడు పిమ్మట యేమిజేసినది వివిపించవలసినది" అని యడిగెను.

తండ్రి మాటలువిని కుమారుడు జెప్పుచున్నాడు- "ఓ తండ్రీ! శ్రద్ధగా వినుము! అలర్కుడు వైరాగ్యమును పొంది యీ ప్రపంచక మంతయు

శ్లో॥ నభూమిర్నతేజో నవాయు నఖనేంద్రియం వా।
నతేషాం సమూహహః అనేకాంతి కత్వా
స్థితస్త్రైకసిత్వా తదేకో శివః కేవలోహం॥

అనునట్లు యీ ప్రపంచక సుఖము లన్నియు దుఃఖమును కలుగ జేయునవిగాని సుఖమును గలుగజేయవు. నేను చాలాకాలము రాజ్యాది సుఖంబులను అనుభవించితిని కాని ఆ సుఖములు సుఖమును బుద్బుదాలవు యని తెలుసుకొని తపోజ్ఞానంబువలన గలిగిన సుఖమే సుఖము. ఆ సుఖము వలన జన్మరాహిత్యమైన సుఖము గలుగునని ఆలోచించి భార్యాసమేతుడై వానప్రస్థాశ్రమమునకు పోయి తపంబు జేయుచుండెను. కావున ఓ తండ్రీ! నీవును ఈ సంసార సంబంధములగు సుఖములను వదిలి ముక్తి కొరకు యోగ మార్గమును అవలంబనము జేసి జ్ఞానమును పొంది సుఖమును పొందుము. నేనును తపంబునకు అడవికి పోవుదును. యజ్ఞములవలనను, జపములవలనను, ప్రయోజనములేదు. నీవు అనుజ్ఞ యిచ్చితివేని నేను మోక్షమును పొందుదును" అని చెప్పి కుమారుడు తపోవనంబునకు పోయెను.

అని ధర్మపక్షులు జైమిని మునికి జెప్పి పిమ్మట— "మునివరా! తండ్రి కుమారుడు జెప్పిన ప్రకారము సర్వ సంగ పరిత్యాగమును జేసి భార్యాసహితముగా వాన ప్రస్థాశ్రమము అవలంబించి ముక్తికి పోయెను. కావున

ఓ జైమినీ! సర్వోత్తమమయిన యోగమార్గము అవలంబించిన ఆనందము కలుగును గాని వేరు మార్గమున ఆనందము కలుగనేరదు" అని జెప్పెను.

ఆ మాటలు జనమేజయుడు విని—"మహాత్మా! వైశంపాయనా! నీవు జెప్పిన ఇతిహాసమువలన సకల ధర్మంబులను తెలుసుకుంటిని. వేదోక్తమునైన ఆచారములను వింటిని. సంశయములు తొలగినవి. మహాత్మా! స్థావర జంగమాత్మకమైన జగత్తుయొక్క ఉత్పత్తి, ప్రళయములు, కల్పములు, దేవ, పితృ, మన్వాదులు, మన్వంతరములు మొదలగు విషయంబులను దెలియజేసి నన్ను కృతార్థుని జేయవలసినది" అని యడిగెను.

ఆ మాటలకు వైశంపాయనుడు యిలా జెప్పుచున్నాడు—"జనమేజయా! నీవడిగిన ప్రశ్నమునే జైమిని ధర్మపక్షుల నడిగెను. ఆ పక్షులు—"జైమిని మునీంద్రా! నీవు అడిగిన ప్రశ్నము చాలా ప్రయాసము గలది. అయినను మాకు తెలిసినంతవరకు మార్కండేయ మహాముని క్రోష్టికి అను మునిపుంగవునకు జెప్పిన విషయంబులు నీకు వినిపించెదము సావధానుడవై వినుము" అని జెప్పెను. జనమేజయా! ఆవిషయంబును నీకు జెప్పుచున్నాను వినుము"

# భూతస్వర్గము

సృష్టికి ఆదియందు బ్రహ్మపుట్టెను. ఆ బ్రహ్మ నాలుగు ముఖములు నుండియు ౧. ఋగ్వేదము, ౨. యజుర్వేదము, ౩. సామవేదము, ౪. అధర్వణవేదము పుట్టెను. పిమ్మట అనేక పురాణములు, సనకసనందనాది మహామునులు పుట్టిరి. ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యమనునవి వేదోపదేశంబునగాని సిద్ధిని పొందనేరవు. ఆ బ్రహ్మవలన సప్తమహాఋషులు నాలుగువేదములను, అంగ, ఉపాంగములు సహితముగా అధ్యయనము జేసిరి. భృగుమహాఋషివలన చ్యవనుండును, అతనివలన బ్రాహ్మణులను అధ్యయనము జేసిరి. మునులు పురాణములను బ్రహ్మవద్ద పఠించిరి. మునులు వలన దక్షుడుపదేశమును పొందెను. దక్షునివలన నేను తెలుసుకుంటిని. కావున కలిదోష నివారణమగు ఈ విషయము నీకు జెప్పితిని.

మార్కండేయుడు జెప్పుచున్నాడు—" ఓ క్రోష్టికీ! స్థావర జంగమాత్మకమైన ప్రపంచకమంతకును పరబ్రహ్మ మూలకారణము. ఆ పరబ్రహ్మయందు ఈ ప్రపంచక

మంతయు ఇమిడియున్నది. లోకతంత్ర స్వరూపుడును, హిరణ్య గర్భుండును అయిన పరబ్రహ్మకు అనేక నమస్కారములను జేసి సకల దురితములను, సంచిత, ఆగామి, కర్మంబులను నశింపజేయునట్టి ఉత్తమమయిన భూతస్వర్గమును జెప్పెదను వినుము.

ప్రపంచకమునకు ఆదికారణమును మహాఋషులు అవ్యక్తంబుగా జెప్పుదురు. అది సూక్ష్మమును, నిత్యమును, ఆత్మానాత్మకమని జెప్పబడుచున్నది. సృష్టించు కాలమున, అవ్యక్తవ్యక్తంబులవలన, మహాతత్వంబు పుట్టినది. త్రిగుణాత్మిక మయిన నీరు మహాతత్వమువలన, తేజంబువలన, భూతములకు మొదటిది అగు అహంకారము పుట్టెను. పిమ్మట తామసము, అహంకారము వలన శబ్ద, తన్మాత్రలు పుట్టెను. దానివలన వాయువు, దానివలన రూప తన్మాత్రము బుట్టెను. దానివలన తేజంబును, దానివలన రసతన్మాత్రము బుట్టెను. దానివలన ఉదకము, ఉదకమువలన గంధతన్మాత్రము, దానివలన పంచభూతములును పుట్టెను. పిమ్మట వాక్కు, చేతులు, పాదములు, యూరువులు, కర్మేంద్రియములు పుట్టెను.

పిమ్మట చర్మము, నేత్రములు, చెవులు, జింహ్వా, నాశికములను జ్ఞానేంద్రియములు పుట్టెను. పిమ్మట మనస్సు పుట్టినది. పిమ్మట పృథివి, నీరు, తేజము, వాయువు, ఆకాశము పుట్టినవి. వీటివలన స్థావర జంగమాత్మకమగు ఒక అండము పుట్టినది. అది నీటిబుగ్గవలె ఉదకమధ్యమున వృద్ధిని పొందెను. ఆ అండమువలన స్థూలసూక్ష్మములు, భూమి, సముద్రములు, అంగములును పుట్టినవి. పిమ్మట పురాణ పురుషుండును, బ్రహ్మయు పుట్టెను. ఆ యండమును ప్రకృతి యందురు. దానివలన మాయాతత్త్వంబును మూలకారణమందురు " అని మార్కండేయుడు జెప్పెను.

ఆ మాటలకు క్రోష్టికి సంతోషించి—" మహాత్మా! సృష్టించబడిన పదార్థంబంతయు ప్రళయ కాలంబున లయమగునా? లేక కొంత లయము, కొంత శాశ్వతమగునా?" అని ప్రశ్నించెను.

మార్కండేయుడు యిలా జెప్పుచున్నాడు—

" అయ్యా! క్రోష్టికీ! ప్రకృతి పురుషుండును అగు బ్రహ్మకు పగలు గడచి, రాత్రి కాలంబయిన ప్రళయంబగును. ఆ సమయమ్మునందు సృష్టిజాలమ్మంతయు ప్రకృతి

యందు లయమగును. అందువలన దానిని ప్రాకృత ప్రళయమందురు. రాత్రిపోయి పగలు అయిన ప్రధాన పురుషుడు కారణభూతుడై గ్రుడ్డునుండి పుట్టి తమో గుణము గలవాడై బ్రహ్మరూపమున సృష్టించును. సత్వ గుణము గలవాడై విష్ణురూపమున పోషించును. రజో గుణము కలవాడై రుద్రరూపమున లయము జేయు చుండును. యీ విధముగా నొకదానితో వేరొకదానికి సంబంధముగల త్రిగుణములవే త్రిమూర్తి స్వరూపుండైన ప్రధానపురుషుడు జన్మ, స్థితి లయంబులకు కారణుండని తెలియుము.

## యుగ పరిమాణములు

బ్రహ్మకు పరమార్ధాయము నూరు సంవత్సరములు. పది హేను నిమిషములు ఒక కాష్ట, ముప్పది కాష్టలు ఒక కళ, ముప్పది కళలు ముహూర్తము, ముప్పది ముహూ ర్తములు అహోరాత్రము (పగలు, రాత్రి) పదిహేను అహోరాత్రములు పక్షము, రెండు పక్షములు మాసము, ఆరు మాసములు ఆయనము, రెండు ఆయనములు

సంవత్సరము. యిటువంటి సంవత్సరములు నూరు బ్రహ్మకు ఆయువు. ఇటువంటి సంవత్సరములు దేవతలకు ఒక అహోరాత్రము. అందు ఉత్తరాయణము పగలు, దక్షిణాయణము రాత్రి అని పిలువబడును. ఇటువంటి దివ్యసంవత్సరములు పన్నెండువేలు గడచిన కృత, త్రేత, ద్వాపర, కలియుగంబు లను నాలుగు యుగంబులగును. అందులో నాలుగువేల సంవత్సరములు కృతయుగము, మూడువేల సంవత్సరములు త్రేతాయుగము, రెండువేల సంవత్సరములు ద్వాపరయుగము, రెండు వేల సంవత్సరములు కలియుగము. యుగసంధి కృత యుగమునకు ఎనిమిది వందలు. త్రేతాయుగమునకు ఆరు వందలు. ద్వాపరయుగమునకు నాలుగు వందలు, కలి యుగమునకు రెండువందలు, ఈ ప్రకారము యుగసంధి యేర్పడి యుండును. యిది అంతయును కలసి ఒక దివ్య యుగమగును. యీ దివ్యయుగములు వేయిమారులు గడచిన బ్రహ్మకు ఒక పగలు. ఈ పగటికాలమునందు పదునాలుగురు మనువులు పరిపాలనము జేయుదురు. ఆయా మనువులు పరిపాలనము జేయుదురు. ఆయా మనువులు పరిపాలించునప్పుడు దేవతలు, దేవేంద్రులు, సప్తఋషులు పుట్టి జచ్చుచుందురు. పదునాలుగు మన్వంత

రముల కాలము బ్రహ్మకు పగలు. డబ్బది ఒక్క దివ్య యుగములను పదునాలుగుచే గుణించిన కాలము బ్రహ్మకు ఒక్క పగలు అగును. పగటియందు ఎన్ని సంవత్సరములు అగునో బ్రహ్మకు రాత్రియందు అంతకాలము అగును. అటువంటి అహోరాత్రములు మూడువందల అరువది అయిన బ్రహ్మకు ఒక్క సంవత్సరము అగును. ఇటువంటి సంవత్సరములు నూరు అయిన బ్రహ్మకు సంపూర్ణ ఆయుర్దాయమగును. యీ ఆయువకాలము ఏబది సంవత్సరములు పూర్వపదార్ధమనిన్ని, ఏబదిఒకటి మొదలు నూరువరకు ద్వితీయపదార్ధమనిన్ని చెప్పబడును.

ఇప్పుడు జరుగుచున్నది వరాహకల్పము. బ్రహ్మకు రాత్రి కాలమయిన ప్రళయంబగును. ఆ ప్రళయకాలము భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము అను మూడు లోకములును జలమయంబగును. అటుల మునిగిన మహర్లోకవాసులు తాపము పొందలేక జనలోకమున జేరుదురు. ఆ ప్రళయము దినప్రళయమందురు. దీనినే నైమిత్తిక ప్రళయమని జెప్పుదురు. ఆ రాత్రి గడచిన బ్రహ్మ మేల్కాంచి సృష్టిజేయుటకు ఆరంభము జేయును.

# సృష్టి వివరణము

ఉదకమునకు నారంబని పేరు. ఆ యుదకమునందు నివశించి యుండుటచేత భగవంతునకు నారాయణుండని పేరుగలిగినది. మహాకల్పమునందు ప్రపంచక మంతయు జలమయంబై అంధకారమయమై చీకటిగ నుండును. ఆ సమయమునందు భగవంతుడు మఱ్ఱి ఆకున పరుండి యోగనిద్రపోవుచుండును. ఆ సమయమున మహర్లోక వాసులు, సిద్ధులు అనేక విధముల భగవంతుని స్తోత్రములను జేయుదురు. ఆ స్తోత్రములకు భగవంతుడు మేల్కాంచి దయగలవాడై యజ్ఞ వరాహరూపమును దాల్చి జలములో మునిగియున్న భూమిని తన కోరలచే పెరికి నీటి పైభాగమునకు దెచ్చి నిలుపును. ప్రళయ కాలమున ప్రళయాగ్నిచే ముక్కలుగాబడిన పర్వతములను సృష్టించి యథాప్రకారము వుంచును. బ్రహ్మవలన తమోగుణము పుట్టెను. పిమ్మట అవిద్య పుట్టెను. దీనినే మాయ యని యందురు. యీ మాయవలన మహత్స్వర్గము,

భూతస్వర్గము, త్వక్కు, యింద్రియ స్వర్గము అను నాలుగు ప్రాకృత స్వర్గములు పెట్టెను. పిమ్మట స్థావర సర్గము, తిర్యస్సర్గము, దేవసర్గము, వాక్సర్గములు జన్మించినవి. వీటిని వికారిక సర్గంబులని పిలువబడెను. ఇవిగాక కౌమార సర్గమనునది పుట్టెను. యీ విధంబుగ బ్రహ్మ సృష్టియంతయు తొమ్మిది విధములుగ ప్రవర్తిల్లు చున్నది.

## బ్రహ్మ దేహమునుండి [illegible]

తమోగుణముగల బ్రహ[illegible] పుట్టినవి రులు బుట్టిరి. [illegible] యొక్క జఘనంబునుండి అసు అది [illegible]తట బ్రహ్మ ఆ శరీరమును వదలెను. [illegible] త్రిరూపమయ్యెను. వేరు రూపమున సత్వ గుణముగా పుట్టెను. అంతట ముఖంబునుండి దేవతలు పుట్టిరి. ఆ శరీరమును వదలెను. అది పగలు అయ్యెను. అటు తర్వాత సత్వగుణ ప్రధానముగాగల వేరొక రూపము పొందెను. పితృదేవతలు పుట్టిరి. ఆ శరీరము సంధ్యా కాలమయ్యెను. అంతట రజోగుణము గల శరీరము ధరించెను. దానివలన మానవులు పుట్టిరి. ఆ శరీరము

వెన్నెలకాలమయ్యెను. కాబట్టి అసురులకు రాత్రియందును
మానవులకు ప్రాతఃకాలమునందును శత్రుసంహారము
నకు తగిన కాలమైయున్నది. బ్రహ్మ సర్వావయవముల
నుండి యక్ష, కిన్నర, గంధర్వ, అప్సరాదులు; పశు,
పక్షి, మృగాదులును, ఓషధులును, లతలు మొదలగు
సకల చరాచరంబులును పుట్టినవి. బ్రహ్మముఖమున
గాయత్రీ, ఛందస్సు, ఋగ్వేదము, త్రివృత్తు, రథంతర
సామము, యజ్ఞము మొదలగునవియు, దక్షిణముఖమున
[illegible] త్రిష్టుప్, ఛందస్సు, పంచ దశస్తోమము,
[illegible] పుట్టెను. పశ్చిమముఖమున సకల
యజస్సు, [illegible] ఛందస్సు, సప్తదశస్తోమము
బృహత్సామము [illegible]
సామంబులు, జగతీ ఛం[illegible] ఉత్తర ముఖమున
వైరూపము మొదలగునవి పుట్టెను. [illegible] అనుష్టుప్
యిరువది ఒక్క అథర్వణంబులును, ఆప్తోర్యాం
ఛందంబులును, వైరాజము మొదలగునవి పుట్టెను, కావుం
బ్రహ్మ శరీరమునుండియే సకల స్థూల, సూక్ష్మ, స్థావర,
జంగమంబులును, ఆచరణీయ విశేషంబులును బుట్టినవి.
పూర్వకల్పంబువలెనే సౌమ్య, కాఠిన్య, గుణానువర్త
నంబులై వ్యవహరింపబడును. ఈ విధముగా ప్రతికల్పము
నందును ప్రవర్తిల్లుచుండును.

## మానవులు - యుగధర్మములు

మానవ స్వర్గ వివరణంబును, వర్ణాశ్రమ ధర్మంబులను జెప్పుచున్నాను వినుము.

ఓ క్రోష్టికీ! బ్రహ్మయొక్క సకల అవయవముల నుండి కొన్నివేల దంపతులు పుట్టిరి. ఆ దంపతులు రూపముచేతను, యవ్వనముచేతను, సుగుణ సంపదల చేతను విహరించుచుండిరి. ఆ దంపతులు రాగ ద్వేష సంస్కారాదులు లేకయుండిరి. ఆ యుగమునందు స్త్రీలకు రజోత్పత్తి దోషము లేకపోవుటచేత, రాగ ద్వేష సంపర్కాదులు లేకపోవుటచేత, ధ్యానముచేతను స్మరణచేతను సంతాన్నము కలుగుచుండెను. వారు గృహాదులు లేక పర్వతములందును, సరస్సులందును, సముద్రము లందును, ఆశ్రయించుకుని నాలుగువేల సంవత్సరములు ఆయువుగలిగి సంచరించుచుండిరి. యుగాంతమునందు జనిధర్మమును వదిలి ప్రవర్తించుటచేత ఆకాశమునుండి భూమిపై బడిరి. యీ విధముగా త్రేతాయుగంబున భూమి పైన బడినవారు గృహసౌజ్ఞగల వృక్షముల నాశ్రయించి ఫలములను, తేనియలను త్రావుచుండెడివారు.

యీ విధముగా కొంతకాలము జరిగిన పిమ్మట వారికి రాగము, ద్వేషము మొదలగు గుణములు గలిగి పరస్పర విరోధములు పుట్టి గృహసౌఖ్యగల చెట్టులను వరికి ఇండ్లను కట్టుకొనుట, చెట్లనారను దీసి బట్టలుగా ధరించుటకు ప్రారంభము జేసిరి. కాలక్రమమున రాగ ద్వేషాదులు యెక్కువకాగా గ్రామములు, పట్టణములు, కోటలు, అగర్తలు కట్టుటకు ఆరంభముజేసి సంఘ ములుగా యేర్పడిరి.

వేదాదులను, శాస్త్రములను చదువుచు గ్రామ, దేశ, క్షేమమునకున్ను, మృగాది దుర్మార్గులవలన బాధ కలుగ కుండుటకున్ను, వర్షములు కురియుటకు దేవతలను, పంచభూతములను ఆరాధించువారికి బ్రాహ్మణులనియు, గ్రామ దేశములకు శత్రువులవలన, దుష్ట మృగాదులవలన బాధ కలుగకుండునటుల ధనుర్వేదము నభ్యసించి బాణాది సాధనముల ధరించి ప్రజలను రక్షించుచుండెడివారిని క్షత్రియులనియు, ప్రజలకు కావలసిన ఆహార పదార్థము లను యితర తావులనుండి తెచ్చి వర్తకము జేయువారికి వైశ్యులనియు, వేపారులనియు, సార్థవాహులనియు, భూమిని సాగుజేసి తగిన పంటలను పండించుటకు భూమిని దున్ని కావలసిన ఆహారపదార్థములను పండించి,

పరిపాలనా సౌఖ్యమునకు పండిన పంటలో అర్ధభాగము రాజునకు యిచ్చుచు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను సేవించుచు వారి క్షేమమును జూచుచుండెడివారిని శూద్రులు అనియు, ఆవులు, బఱ్ఱెలు, మేకలు, గొఱ్ఱెలు మొదలగు పాలు యిచ్చెడి పశువులను కాపాడుచు, పాలు, పెరుగు, నెయ్యి మొదలగు వాటిని పైవారికి యిచ్చుచు, వారి క్షేమమును గనుగొనువారిని గొల్లలు అనియు, గ్రామమునకు ప్రజలకు ఉపయోగపడు వృత్తిని అవలంబనముజేసి పనులు జేయువారిని ఆయా పేరులతో యేర్పాటులను జేసుకుని, ఒక వృత్తిని జేయువారు మరియొక వృత్తిని జేసిన యెడల రాజు దండించునటుల ధర్మశాస్త్రములను నిర్మించుకుని ఒకరియందు మరియొకరు ప్రేమగలవారై అన్యోన్య స్నేహమున అన్నదమ్ములవలెను, తల్లిదండ్రుల వలెను, గురువులవలెను ప్రవర్తించుచు, గ్రామము లేక పట్టణములను కాపాడుకొనుచు సుఖముగా నివశించుచుండిరి.

యోజన ప్రమాణములను ఈ విధముగా ఏర్పరుచ్చుకొనిరి. ఎనిమిది యవగింజలు గర్భంబుగలతావు ఒక

అంగుళము, పండ్రెండు అంగుళములు జాన, రెండు జానలు మూర, నాలుగు మూరలు దండము, వేయి దండములు ఒక మైలు, రెండువేల దండములు క్రోసు, రెండు క్రోసులు గవ్యూతి, రెండు గవ్యూతులు దూరము యోజనము. ఈ ప్రకారము యేర్పర్చుకొనిరి. ఈ కాలము నందే స్త్రీలకు రజోదర్శనము యేర్పడి, వర్షములు కురియుటకు ప్రారంభము అయ్యెను. వర్షములు కురియుట వలన కొన్ని వృక్షాదులు తమంతటతాము పూయుట, కాయుట, పండుట ప్రారంభము కాగా వాటిని ప్రజలు ఉపయోగము జేసుకొనెడివారు. యీ విధముగా రాగ ద్వేషాదులు హెచ్చుకాగా, వర్షములు కురవక, వృక్షాదులు నశించినవి. ఆ సమయమునందు ప్రజలు భయపడి చింత గలవారై బ్రహ్మనుగూర్చి తపంబు జేసిరి. బ్రహ్మ ప్రత్యక్షమై బీజములను ఉత్పత్తిజేసెను. వాటిని భూమిని దున్ని విత్తనములు జల్లుటచేత వర్షసహాయమున పంటలు పండుటకు యేర్పాటుజేసి అదృశ్యుడాయెను. అప్పుడు గోధుమలు యవలు మొదలగు పదియేడు విధములగు ధాన్యములు పండుటకు ప్రారంభించెను. వీటిని గ్రామ్యౌషదులని పిలువబడుచుండెను. స్త్రీలు రజస్వలగుట, స్త్రీ పురుష సంయోగము, సంతానము గలుగుట ప్రారంభమాయెను.

ఈ యుగమునందే బ్రహ్మ తన అంగముల నుండి పుట్టినవారిని బ్రాహ్మణులని, క్షత్రియులని, వైశ్యులని, శూద్రులని విభజించి వారికి వైదిక కర్మాచరణము, యుద్ధము, వ్యాపారము, వ్యవసాయము మొదలగు వృత్తులని నిర్ణయించెను. బ్రహ్మ నిర్ణయించిన ధర్మములను తప్పకుండా ప్రవర్తించెడి వారికి బ్రహ్మలోకము, స్వర్గలోకము, వాయులోకము, గంధర్వలోకము గలుగుచుండెను. నిజ ధర్మము తప్పని బ్రహ్మచారికి ఋషుల స్థానము, గృహస్థునకు బ్రహ్మలోకము, వనవాసికి సప్తఋషి స్థానము, సన్యాసికి బ్రహ్మపదము, యోగికి ముక్తి గలుగుచుండెను.

## భృగ్వాదుల యుత్పత్తి

శ్లో॥ సంకల్పాద్దర్శనాత్స్పర్శాత్పూర్వేషాం సృష్టిరుచ్యతే
రక్షాత్ప్రచే తసాదూర్ధ్వం సృష్టిర్మైధున సంభవా॥

బ్రహ్మ సృష్టియందు మరీచి, భృగువు, అంగిరసుడు, షనస్థ్యుడు, పులహుడు, క్రతువు, దక్షుడు, అత్రి, వసిష్టుడు అను నవబ్రహ్మలను బుట్టించెను. పిమ్మట కోపమున రుద్రుని పుట్టించెను. శాంతమున, ధర్మమునను

పంకల్పుని పుట్టించెను. సనకసనందన సనాతన సన త్కుమార ఋషులను అయిదుగురు మానసపుత్రులను పుట్టించెను. వారు వైరాగ్యమును పొంది తపంబునకు పోయిరి. బ్రహ్మకు క్రోధము రాగా సగము స్త్రీ రూపము సగము పురుషరూపముగల మహాపురుషుడు పుట్టెను. ఆ అర్థ స్త్రీ పురుష రూపంబున శతరూపిణి యను యోగిని పుట్టినది. యీ అంగనామణిని బ్రహ్మ శరీరమునుండి పుట్టిన స్వాయంభువు అను మనువు వివాహమాడెను. వారికి ప్రియంవ్రతుడు, ఉత్తానపాదుడు అను యిద్దరు పుత్రులు, బుద్ధి, ప్రసూతి అను యిద్దరు కుమార్తెలు పుట్టిరి. వీరిలో బుద్ధిని రుచియు, ప్రసూతిని దక్షుడు వివాహమాడిరి. రుచికి యజ్ఞుండను పుత్రుడు పుట్టెను. వానికి దక్షిణ యను భార్యయందు యామములు అను పేరుగల దేవతలు పన్నెండుగురు పుట్టిరి. దక్షునకు ప్రసూతి యందు శ్రద్ధ, లక్ష్మి, ధృతి, తుష్టి, మేధ, క్రియబుద్ధి, లజ్జ, వపుస్సు, శాంతి, సిద్ధి, కీర్తి, ఖ్యాతి, సత్యసంభూతి, స్మృతి, ప్రీతి, క్షమ, సంపతి, అనసూయ, ఊర్జ, స్వాహా, స్వధ అను యిరువది నలుగురు పుత్రికలు పుట్టిరి. అందు మొదటి ముప్పదను ధర్ముండును, తక్కినవారిని

క్రమముగ భృగువు, మరీచి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, అత్రి, వశిష్ఠుడు, అగ్ని, పితరులును పెండ్లియాడిరి. ధర్మునకుగల ముప్పేరు భార్యలవలన కామము, పుణ్యము, పాపము, సుఖము, దుఃఖము, ధర్మము, అర్థము, మాయ, దారిద్ర్యము, మత్సరము, భయము, నరకము, ఆర్జనము, వ్యాపారము మొదలగు సంతానములు కలిగెను. పిమ్మట బ్రహ్మకు దుస్సహుడు పుట్టెను.

## దు స్స హు డు పుట్టుట

బ్రహ్మవలన పుట్టింపబడిన తమో రూపముగల దుస్సహుడు భయంకరాకారము గలిగి లోకములందుగల జంతు జాలమును మ్రింగుచుండెను. బ్రహ్మ అది జూచి వివారించి "ఓ దుస్సహా ! నీవు లోకములందుగల జంతుజాలమును మ్రింగ దగదు. నీవు నివశించుటకు దుర్మార్గుల యిండ్ల యందు నుండుటకు ఏర్పర్చితిని. దుర్మార్గుల ఇండ్లయందు నివశించుచు నిత్య కర్మానుష్టానములు విఘ్నము జేయుట యను బలము గలిగి సాలెపురుగు నేసిన వస్త్రంబులు ధరింపుచు, సాలెపురుగు పాకిన, కుక్క, పిల్లి, దుష్టస్త్రీలు

ముట్టిన పదార్ధములు, ఎట్టి కుండలయందు నిలవవున్న పదార్ధములు, నోటితో ఊదబడిన పదార్ధములు, నాలికచేత నాకబడిన వస్తువులు, వైశ్వ దేవాది క్రియలులేని అన్నము నీవు ఆహారముగా తీసుకొనుము.

మరియు నో దుస్సహా! నీడయందును, వెన్నెల యందును, ఆరుబయటను, ఉదయ, సాయంత్ర, సంధ్య కాలములయందును భుజించుట, నిద్రించుట, యిటువంటి కార్యములు జేయువారి పుణ్యములు నీకు జెందును.

అశ్రద్ధగా జేయు హోమము, స్నానము జేయక అశుచిగా యిచ్చిన దానము, పదార్ధములు, దూషించి యిచ్చినట్టివిన్ని, స్నానముజేసి నీరు లేకుండగా యిచ్చిన దానములు, ధర్మములు నీకు జెందును. కోపము గలవాడు వ్యాధి గలవాడు యిచ్చిన దానములు నీకు జెందును. పుట్టలు గలవి, రాత్రి దీపములేని, ఉదయము సాయంత్రము శుద్ధిజేసి ముగ్గుపెట్టనివి, నెయ్యి తేనె రాగిపాత్రలు లేని గృహంబులు నీకు ఆధీనములగును.

మూడు ఆవులు, ముగ్గురు విధవస్త్రీలు, అయిదుగురు మతముగల మొగవాళ్లు, ఒక్క గొఱ్ఱె, రెండు గేదెలు, మూడు ఎద్దులు, ఆరు గుఱ్ఱములు, ఏడు ఏనుగులు గల

గృహంబుల నివశించుము. దుర్మార్గులుండు స్థలములందు నీవు సంచరింపుము. సదాచార సంపన్నులను, శ్రీమహాలక్ష్మీ నివాసములు నీవు ప్రవేశించవద్దు" అని చెప్పి బ్రహ్మ అంతర్ధానము పొందెను. ఆ ప్రకారమే దుస్సహుడు సంచరించుచుండెను.

## దుస్సహుని పుత్రాదులు

కలి భార్యయందు ఋతుకాలమున ఛండాలుని జూచుట వలన బుట్టిన నిర్మాష్టి యనుదానిని దుస్సహుడు వివాహమాడెను. దానియందు ౧. దంతాకృషి, ౨. వ్యక్తి, ౩. పరివర్తి, ౪. అంగయుక్కు, ౫. శకుని, ౬. గండప్రాంతకుడు, ౭. గర్భఘ్నుడు, ౮. స్తన్యఘ్నుడు అను యెనమండ్రు కొడుకులు పుట్టిరి. మరియును ౯. నియోజిక, ౧౦. విరోధిని, ౧౧. స్వయంభార, ౧౨. కరిభ్రామిని, ౧౩. ఋతుహారిక, ౧౪. స్మృతిహారిణి, ౧౫. బీజహారిణి, ౧౬. విద్వేషిణి అను ఎనమండ్రు పుత్రికలు పుట్టిరి. యీ పది ఆరుగురులోను—

౧. దంతాకృషి యనువాడు నిద్రించెడి బాలుర యందు జేరి దంతములు పండ్లు కొరుకుట చేయుచుండును. వానికి ఆవాలు బాలురు పరుండు తావులందు, దిరుగు స్థలములందును జల్లుచుండిన శాంతి బొందును. సువర్చ స్సులను ఓషధులు జేర్చిన నీరుయందు స్నానము జేయించవలెను.

౨. వ్యక్తి యనువాడు గృహములందు నివశించి శుభము, అశుభము పలుకుచుండును. గృహస్థులు పలుకు మాటలకు స్థదాస్థు అని పలుకును. కావున జనులు అశు భములు పలుకరాదు. శుభవాక్యములను పలుకుచుండ వలెను. ప్రమాదమున అశుభవాక్యము పలికిన హరినామ స్మరణము జేయవలెను.

౩. పరివర్తకుడు యనువాడు స్త్రీల గర్భముల నుండి పిండములను చెడగొట్టును. గావున గర్భరక్షణ మంత్రములు జెప్పించవలెను.

౪. అంగయుక్కు యనువాడు వాయు రూపమున శరీరమునందు జేరి భుజములు మొదలగు అవయవములను కదల్చి శుభాశుభములను తెలుపును. అటుల కదలినప్పుడు దర్భలచేత తుడిచిన శాంతిని పొందును.

౫. శకుని యనువాడు కాకి, గుడ్లగూబ, బల్లి మొదలగు వాటియందుండి కీడు, మేళ్ళు పలుకుచుండును.

౬. గండప్రాంతకుడు యనువాడు గండాంతమను ముహూర్తమున నుండును. అందువలన బ్రాహ్మణ దేవతలకు వందనముజేసి దీవనలను పొందుచుండవలెను. ఆవు పంచితములో ఆవాల కల్పి జన్మించిన బాలురను స్నానము చేయించవలెను.

౭. గర్భఘ్నుడు యనువాడు పుష్పములద్వారా గర్భములయందు జేరి పిండములను తినుచుండును. ఆచారముగల వారిని దైవభక్తి గలవారిని జేరవు.

౮. సస్యఘ్నుడు యనువాడు సస్యాదులు పాడుజేయును. వాని రక్షణకు పాత జెప్పులు, వికారపు బొమ్మలు సస్యములయందు ఉంచవలెను.

౯. ఆడవాండ్రలో మొదటిది యగు నియోజిక యనునామె పురుషులయందు జేరి పరదార, పరద్రవ్యముల యందు ఆశ పుట్టించును. అందువలన వేదపఠనాదులు, పురాణములు చదివించవలెను.

౧౦. విరోధిని యనునామె దంపతులయందుండి పరస్పర విరోధములు పుట్టించును. దాని శాంతికి దాన ధర్మములను జేయుచుండవలెను.

౧౧. స్వయంభార యనునామె ధాన్యముగల తావులందు, పశువులుండు స్థలములందు, పిడికిస పాల యందు, మూతలేని నేతి గిన్నెలయందు, స్త్రీలుగల తావు లందు, నూనెయందు వుండును. ఆ తావులందు నెమిలి వెండ్రుకలను వ్రేలాడగట్టిన శాంతి బొందును. గృహముల యందు దేవతాసంబంధమగు పటములు వ్రేలాడకట్టవలెను. పాలకలశంబులు, వెలిమిడి భస్మముచేత శుద్ధిజేయవలెను.

౧౨. కరిభ్రామణి యనునామె పురుషులయందు జేరి నిష్కారణముగ స్త్రీలయందు మోహమును పుట్టించును. కావున పురుషులు స్త్రీలోలురు గాకుండుటకు వారు కూర్చుండు, పరుండు, సంచరించు తావులయందు ఆవాలు మెంతులు జల్లుచుండవలెను. భూసూక్తము జెప్పించవలెను.

౧౩. ఋతుహారిణి యనునామె స్త్రీలయందు జేరి రజస్సు హరించును. కావున వారు తీర్థస్నానాదులు

జేయుట, యాత్రలకు వెళ్ళుట, మంత్రవేత్తలచేత యంత్ర ములు కట్టించుట, వైద్యులచేత ఔషధములు యిప్పించుట చేయవలెను.

౧౪. స్మృతిహారిక యను నామె మనుష్యుల స్మృతిని హరించును. అగ్నికార్యము జేయించవలెను.

౧౫. బీజహారిణి యనునామె స్త్రీ పురుష శుక్ల శోణితముల హరించును. వీటి శాంతికొరకు వైశ్యదేవము జేయించుచు సంస్కృతంబగు అన్నమును భుజింపవలెను.

౧౬. విద్వేషిణి యనునామె భార్యాభర్తలకు విరోధము పుట్టించును. గావున శుభములను గోరువారు గృహస్థులు వ్రతాదులను జేయుచు, గృహమునందు లక్ష్మీ పూజాదులను చేయుచు, అతిధి అభ్యాగతులకు భోజ నములు పెట్టుచున్న అశుభములు శాంతిని పొంది సకల శుభములు కలుగుచుండును.

## దుస్సహుని పౌత్ర దౌహిత్రులు

దుస్సహునికి పౌత్రులు, దౌహిత్రులు ముప్పది ఎనమండ్రు గలరు. దుస్సహుని సంతానములో దంతాకృష్టి యను

వానికి వికల్పా, కలహా అను యిద్దరు కన్నియలు గలరు. అందులో ౧. వికల్ప కుటుంబముల నాశ్రయించి అవమానముగల నీచ వాక్కులు పలుకుచుండును. ఆ కల్పను స్మరించిన దోషశమన మగును. విష్ణునామస్మరణ చేసినను శమించును.

౨. కలహ గృహములందు నివశించి కలహములు బుట్టించి కుటుంబములను నాశనము జేయును. తేనె కలిపిన అన్నము, గుమ్మడికాయ మొదలగునవి దానములు చేయుచుండవలెను.

౨. వ్యక్తి యనువానికి కాలజిహ్వుడు పుట్టెను. వాడు దుర్మార్గుల నోటియందు నివశించి యితరులను బాధించుచుండును.

౩. బరవర్తి యనువానికి యిద్దరు కొడుకులు పుట్టిరి. వారు పర్వతములు, వృక్షములు, అగడ్తలు, గోడల యందు నివశించియుండి స్త్రీల గర్భంబులను హరించును. అందువలన గర్భిణీ స్త్రీలు పర్వతములు గోడలు మొదలగునవి ఎక్కుట తగదు.

౪. అంగయుక్కు యనువానికి బుట్టిన పిశాచు ఎముకల నాశ్రయించి పురుషుల బలమును హరించును.

౫. శకునికి డేగ, కాకి, పావురము, గ్రద్ద, గుడ్లగూబ యను అయిదుగురు సుతులు కలిగిరి. మృత్యువు డేగను, కాలుడు కాకిని, నైఋతి గుడ్లగూబను, వ్యాధి గ్రద్దను, యముడు పావురమును చిహ్నములుగా తీసుకొనిరి. అందువలన శుభాశుభములు పలుకుచుండును. ఈ పక్షులు తలను తన్నినను, గృహములందు నివశించినను, స్వప్నములో జూచినను శాంతిని జేసుకొనవలెను.

౬. గండప్రాంతరికుడునకు ఆరుగురు పుత్రులు కలిగిరి. మొదటివాడు స్త్రీలు రజస్వలయినప్పుడు నాల్గు దినములవరకు ఆశ్రయించి వుండును. రెండవవాడు పదమూడవరోజునందును, మూడవవాడు పదునొకండవ దినమునందును, నాలుగవవాడు బేసిదినములందును, అయిదవవాడు శ్రార్ధ దినములందును, ఆరవవాడు పర్వ దినములందును ఆశ్రయించి యుండును. పురుషులు ఆ దినములందు స్త్రీ సంభోగము జేయరాదు.

౭. గర్భఘ్నునకు విఘ్నుడును, మోహన యను కన్యకయు బుట్టిరి. విఘ్నుడు గర్భపిండమును నాశనము జేయును. మోహన గర్భిణీ స్త్రీలు భుజించు పదార్థములను

నీరుగా జేయును. కుక్షియందు క్రిములను బుట్టించును. రాత్రులందు చెట్లనీడలయందును, నాలుగు దారులు కలసిన తావులందు, స్మశానములందు నివశించి పైని రెండవ వస్త్రము లేక తిరుగువారిని, యేడ్చుచు తిరుగువారిని ఆశ్రయించును.

౮. సస్యఘ్నునకు క్షుద్రముండు బుట్టెను. అతడు గృహములు శుద్ధిజేయని దినములందుగాని, దినసంధు లందుగాని విత్తనములు జల్లిన తావులందుగాని తిరుగు చుండును. అందువలన మంచిరోజున విత్తనములు జల్లు చుండవలెను.

౯. నియోజికకు మత్త, ఉన్మత్త, ప్రహృష్ట, నారి అను పుత్రికలు పుట్టిరి. వీరు నక్షత్ర సంధులందును, లగ్న సంధులందును, కాల సంధులందును నివశించియుందురు. అర్థ, ధర్మ కామములను పాడుజేయుదురు. గాన వైశ్య దేవాదులు జేయుట, హరినామస్మరణ జేయుటచే శాంతి బొందును.

౧౦. విరోధికి గ్రాహక, తమః, ప్రచ్ఛాదకులు బుట్టిరి. వీరు దీపము చమురు జారిన స్థలములందును,

గృహోపకరణములందును, గోమయముగాని, పసుపుగాని వేసి శుద్ధిజేయని తావులందును, శూన్య గ్రహములు, పిడకతో నిప్పుదెచ్చివుంచిన స్థలములందును తిరుగుచుందురు.

౧౧. స్వయంభార స్త్రీల పురుషుల నోటియందు నివసించి అబద్ధములు పల్కించును.

౧౨. కరిభ్రామిణి చెవులయందు నివసించి కలహ వచనములు వినునట్లు జేయును. తమః ప్రచ్ఛాదకులు మనస్సులను ఆశ్రయించి క్రోధమును పుట్టించుచుండును. స్వయంహారికి జారత్వమువలన స్వయంహారి, అర్ధహారి, వీర్యహారి అను ముగ్గురు బుట్టిరి. వీరు ఆచారములేని స్థలములను, పాదప్రక్షాళనము లేనివారియందును నివశించి యుండును. మరిన్ని పీటలయందును, రోలు, రోకలి, పశువులదొడ్డి, హోమముజేయు స్థలములందును నివశించును. అనాచారపరులను ఆశ్రయించి కాలక్రమమున దారిద్ర్యయ పరులగాజేసి నశింపజేయును. భ్రామణికి, కాకజంఘ పుట్టెను. అది ఆడుచు, పాడుచు, గంతులు వైచుచు, నడచుచు, తినెడివారిని, సంధికాలములందు పగటియందు సంభోగము జేయువారిని ఆశ్రయించి పక్ష వాత వ్యాధిని, మనోవిచారమును బుట్టించును.

౧౩. ఋతుహారికి గుణహారిణి, కుచద్వయహారిణి, జాతహారిణిలు పుట్టిరి. వీరు ముప్వురును ఉపనయన వివాహములందు నందిమోహన స్థాళీపాకాదులు జేయనివారిని ఆశ్రయించియుండి వారికి అరిష్టములను కలుగజేయుచుండును. కుచద్వయహారిణి, జాతహారిణిలు నిప్పునుండి కారు నీరును, ధూపదీపంబులు, ఆయుధంబులు, రోకలి, భస్మము, ఆవాలులేని సూతికా గృహములు ఆశ్రయించి అపాయములు కలుగజేయుచుండును.

౧౪. స్మృతిహారిణికి ప్రచండుడు పుట్టి పాడు గృహములందు తిరుగుచు అందు సంచరించెడివారికి బుద్ధిని నశింపజేయును.

౧౫. బీజహారిణికి వాతరూపుడు, అపరూపుడు అను యిద్దరు పుత్రికలు పుట్టిరి. వాతరూప అనాచారపరుల నాశ్రయించి వాతరోగము పుట్టించును.

౧౬. విద్వేషిణికి యపకర్ష, ప్రకాశ అనువారలు కల్గిరి. వారు దుర్మార్గులను, కొండెములను జెప్పువారిని ఆశ్రయించి తల్లి దండ్రులు, సోదరులు, పుత్రులు, బంధువులు, స్నేహితులు మొదలగు వారితో కలహములు

పుట్టించును. కావున మనుష్యులు సత్సహవాసము, సదా చారము, దైవభక్తి, దేవతా పూజలు, వ్రతాదులను జేయు చుండవలెను" అని మార్కండేయుడు జెప్పెను.

## నీలలోహిత రుద్రుడు పుట్టుట

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"ఓ క్రోష్టికీ! ఇంత వరకు తమోసృష్టిని జెప్పితిని. యిప్పుడు రుద్ర సృష్టిని జెప్పుచున్నాను సావధానముగా వినుము! సృష్టికి ఆది యందు బ్రహ్మ తనకు తగినటువంటి కుమారుడు కలుగు నట్లు ధ్యానించుచుండగా నీలలోహితుడను పుత్రుడు పుట్టెను. అతడు అష్టమూర్తియై ఎనమండ్రు భార్యలు, ఎనమండ్రు పుత్రులు గలవాడు అయ్యెను. ఆ నీలలోహి తుడు పుట్టి యేడ్వదొడగెను. బ్రహ్మ అతనిని జూచి— "నీవు యేడ్చుటకు కారణమును జెప్పుమని" అడిగెను.

అందు కతడు—"తండ్రీ! పేరుపెట్టని కార ణమున యేడ్చుచున్నాను" అని జెప్పెను.

ఆ మాటలకు బ్రహ్మ—“ రుద్రుడు అని పేరు పెట్టి తిని ” అని జెప్పెను.

నీలలోహితుడు తిరుగా యేడు పర్యాయములు రోదనము జేసెను.

ఆ రోదనము విని బ్రహ్మ—“ భవ, శర్వ, ఈశాన, పశుపతి, భీమ, ఉగ్ర, మహాదేవులు ” అని పేరులను కల్పించెను. ఆ రుద్రునకు సూర్య, చంద్ర, మహీ, వహ్ని, వాయువ, ఆకాశ, దీక్షిత, జలముల నివసింపుమని జెప్పెను. ఈ యనమంద్రకు క్రమముగ సువర్చల, ఉమ, వికేశి, స్వధ, స్వాహా, దిక్కు, దీక్ష, రోహిణి యను భార్యలను సృజించెను. ఆ భార్యలయందు శనైశ్వర, శుక్ర, లోహిత, మనోజన, స్కంధ, సర్గ, సంతోష, బుధులను యెనమంద్రు పుత్రులు పుట్టిరి. ఆ రుద్రుడు మొదట దక్షుని కుమార్తె సతీదేవిని వివాహమాడెను. ఆమె తండ్రిపై కోపము గలిగి దేహము విడచి హిమవంతునకు మేనక యను భార్యయందు పార్వతియై పుట్టెను. రుద్రుడు ఆ పార్వతిని వివాహము జేసుకుని సుఖంబుగా నుండెను. ఆ గౌరికి సోదరుడు మైనాకుడు. ఆ మైనాకుడు సముద్రునకు ప్రాణమిత్రుడై యుండెను.

## భృగువు సంతతి

"భృగువునకు ఖ్యాతియందు ధాత, విధాత యను యిద్దరు కుమారులును లక్ష్మి యను కుమార్తెయును బుట్టెను. లక్ష్మిని శ్రీ నారాయణుడు వివాహము జేసుకొనెను. ధాత విధాతలు మేరుపర్వత కుమార్తెలు నాయతి, నియతి యను కన్యల వివాహమాడిరి. ధాతకు నాతియందు బ్రాహ్మణుడును, విధాతకు నియతియందు మృకుండును పుట్టిరి. మృకుండునకు మనస్విని యను భార్యయందు మార్కండేయుడనైన నేను పుట్టితిని. నాకు ధూమ్రావతియను భార్యయందు వేదశిరుండను పుత్రుడు గలిగెను. మరీచికి పూర్ణిమ, అమావాస్యయు, అంగిరసునకు సినీవాలీ మొదలగు కన్నియలును, నత్రికి సోమ, దత్తాత్రేయ, దూర్వాసులును, బులస్త్యునకు పూర్వజన్మంబున నగస్త్యుండై యుండిన రంతుడును, పులహునకు గద్దమ, ప్రజాపతి మొదలగువారలును, క్రతువునకు వాలఖిల్యులును, వసిష్టునకు సప్తఋషులును, నగ్నికి త్రేతాగ్నులును, చిత్రునకు మేన, వైతరిణులును బుట్టిరి" అని జెప్పి మార్కండేయుడు క్రోష్టికితో యిట్లని జెప్పుచున్నాడు—

## మన్వంతరము

"మన్వంతరములను జెప్పుచున్నాను శ్రద్ధగా వినుము! ౧. స్వాయంభువ, ౨. స్వారోచి, ౩. ఉత్తమ, ౪. తామస, ౫. రైవత, ౬. చాక్షుషులను మనువుల పరిపాలన గతించినది. ఇప్పుడు వైవస్వత మన్వంతరము జరుగుచున్నది. సూర్య సావర్ణి మొదలగు మన్వంతరములు, రౌచ్య, బౌత్యుల మన్వంతరములు రాబోవుచున్నవి. స్వాయంభువ పుత్రుండగు ప్రియంవ్రతునకు బదుగురు కొడుకులు గల్గిరి.

వారిలో నాగ్నీంధ్రుని జంబూద్వీపమునకు, మేధావిని ప్లక్షద్వీపమునకును, వపుష్మంతుని శాల్మలీ ద్వీపమునకును, జ్యోతిష్మంతుని కుశద్వీపమునకును, ద్యుతిమంతుని క్రౌంచ ద్వీపమునకును, భవుని శాకద్వీపమునకును, సవనుని పుష్కర ద్వీపమునకును, రాజులుగ యేర్పాటుచేసి తండ్రి వారికి ఆ యేడు ద్వీపములు పంచి పెట్టెను. పుష్కర ద్వీపమును పాలించు సవ్యునకు జలద, సుకుమార, మణీచక, కుశోత్తర, మేధావి, మహాద్రుమల అను యేడుగురు పుత్రులు పుట్టిరి. క్రౌంచ ద్వీపము నేలు ద్యుతిమంతునకు శల, మనోనుగోష్ఠ,

ప్రధాన, అర్ధకార, మునింద్రు, దుందుభి అను యేడుగురు పుత్రులు పుట్టిరి. కుశద్వీపాతి యగు జ్యోతిష్మంతునకు ఉద్భిద, వైణవ, సురధ, లంభన, ధృతి, ప్రభాకర, పిలుల అను యేడుగురు పుత్రులు పుట్టిరి. శాల్మలీ ద్వీపము నేలు వపుష్మంతునకు శ్వేతహరిత, జీమూత, రోహిత, వైద్యుత, మానస, మహిధులను, యేడుగురు పుత్రులు కలిగిరి. ప్లక్షద్వీపాధిపతి మేధావికి శాంత, భవ, శిశిర, సుఖోదయ, దయానంద, శివ, క్షేమక, ధ్రువులు పుట్టిరి. జంబూద్వీపము నేలు నాగ్నీంధ్రునను నాభి, కింపురుష, హరి, ఇళావృత, రమ్య, హిరణ్య, కురు, భద్రాశ్వ, కేతుమూల అను తొమ్మిది మంది పుత్రులు పుట్టిరి. యీ సప్త ద్వీపములు నేలు రాజులు తమ ద్వీపములను ఖండములుగ విడదీసి తమ కుమారులకు పంచిపెట్టిరి. వారు యేలిన ఖండములను వారివారి పేరులతో పిలువబడుచుండెను.

వాటిలో శాక, క్రౌంచ, కుశ, శాల్మలీ, ప్లక్షములను అయిదు ద్వీపములందును సుఖ, ఆయు, ఉలూప, జల ధర్మములు అయిదును నడచుచున్నవి.

జంబూ ద్వీపాధిపతియగు నాగ్నీంధ్రునకు ఋషభుడను కొడుకు పుట్టెను. అతనికి భరతుడను కుమారుడు

కల్గెను ఆ భరతునకు జంబూద్వీపము వచ్చెను. ఆ కార ణమున యీ జంబూద్వీపమునకు భరతఖండమని పేరు కలిగెను. యీ జంబూద్వీపము తప్ప తక్కిన ద్వీపము లందు ముసలితనము, మరణము, ధర్మము, అధర్మము, మంచి చెడ్డలు, యుగములు, ఋతువులు లేవు. అందువలన వారికి సకలసిద్ధులు గలిగియున్నవి" అని మార్కండే యుడు జెప్పెను.

## జంబూద్వీప వివరణము

మార్కండేయ మహామునిని జూచి క్రోష్టికి యిట్లని ప్రశ్నించెను—"అయ్యా! మార్కండేయ మునీంద్రా! ద్వీపములు ఎన్ని? పర్వతములు, సముద్రములు, వర్షములు, నదులు ఎన్ని గలవు? భూమి పరిమాణ మెంత గలదు? లోకాలోకముల ప్రమాణములు, వర్షములు, సూర్య చంద్రుల గతి యేవిధమున జరుగుచున్నది? ఈ వృత్తాంత మును జెప్పవలసినది" అని యడిగెను.

ఆ మాటలకు మార్కండేయ మహాముని జెప్పు చున్నాడు—"ఓ క్రోష్టికీ! ఈ భూమండలము అంతయు

యేబదికోట్ల యోజనములు గలిగియున్నది. జంబూ ద్వీపము మొదలు ఏడు ద్వీపములును ఒకటికంటె ఒకటి రెండింతలు పరిమాణముగలిగి యున్నవి. యీ ద్వీపము లన్నియు లవణ సముద్రముచేత ఆవరింపబడియున్నవి. ఈ జంబూద్వీపము లక్షయోజనములు విశాలముగలిగి హిమవంతము మొదలగు సప్తకులపర్వతములు గలిగి యున్నది. ఈ భూమండలము దక్షిణ, ఉత్తర కోణములు తగ్గియున్నవి. మధ్య భాగము ఎత్తుగలిగి యున్నది. ఆ మధ్యభాగమునకు ఉత్తరమున మూడు వర్షములును, తూర్పు పడమరలయందు ఒక్కొక్కటి గలవు. ఆ మధ్య ప్రదేశము ఇలావృతమని పిలువబడును. అచ్చట ఆకాశము మూకుడువలె కనబడును. మేరుపర్వతముయొక్క క్రింది భాగము ఎనుబదినాలుగువేల యోజనములు. ఉపరిభాగము రెండువేల యోజనములు వున్నది. ఆ పర్వతముయొక్క పైభాగమునందు ఎనిమిది దిక్కులయందును ఇంద్రుడు, అగ్ని, యమ, నైఋతి, వరుణ, వాయువు, కుబేర, ఈశాన్య అను యెనిమిది పట్టణములు గలవు. వాటిమధ్య భాగమునందు పదునాలుగువేల యోజనములు విస్తీర్ణము గల బ్రహ్మసభయున్నది. మేరువునకు తూర్పున మందర పర్వతమును, దక్షిణమున హిమాలయ పర్వతమును, కైలాస పర్వతమును గలవు. పశ్చిమమున నిషదాదులును

ఉత్తరమున శృంగవంతాదులును గలవు. యీ పర్వతము నకు నాలుగు దిక్కులయందును గల పర్వతములలో తూర్పున గంధమాదన పర్వతమునందు జంబూ వృక్షము గలదు. దాని ఫలములు ఏనుగంతలావు గలిగియుండును. ఆ ఫలరసము నేలపైబడిన బంగారమగును. ఆ ఫలరసము నదిరూపమున మేరుపర్వతమును జుట్టి ప్రవహించుచున్నది. అందువల్ల ఈ ద్వీపమునకు జంబూద్వీపమని పేరు గలిగినది. యీ ద్వీపమున మహావిష్ణువు తెల్లని రూపము ధరించి హయగ్రీవుడై నివశించి యుండును.

భారతవర్షమున కూర్మరూప ధరుండును, కేతుమ వర్షంబున వరాహరూపుండును, దానికి ఉత్తరదిక్కున మృత్యుంజయుండును అని పూజింపబడుచుండెను.

యీ మేరు పర్వతమునకు నాలుగుదిక్కులయందును చైత్రరధము మొదలగు నాలుగు వనంబులు గలవు. ఇవిగాక అనేక పర్వతములు, వానియందు చిత్రవిచిత్రములగు వనంబులు, సరస్సులు, బంగారము, మణులు మొదలగు వానిచేత గట్టబడిన రమ్యమైన అనేక గృహంబులుగలవు. ఆ పర్వతములయందు పుణ్యపురుషులు, యక్షులు, కిన్నరులు, గరుడులు మొదలగువారు జరా దుఃఖములు లేక సర్వసుఖంబులు పొందుచుందురు.

హిమవంతమునకు దక్షిణముననున్న భూమిని కర్మభూమి అని పిలుతురు. అచ్చట నివశించు జనులు సుఖదుఃఖములను పొందుచు, తెగలు తెగలుగ నుందురు. ధృవమండలమున శ్రీమన్నారాయణుని పాదపద్మము నందు బుట్టిన గంగ మొదట మూడు పాయలుగా మేరు పర్వతమునందుబడి అక్కడ నాలుగు ప్రవాహములుగ చీలికలుగ వీడి నాలుగు దిక్కులయందు గల పర్వతములు మీద ప్రవహించి దక్షిణమున కైలాసగిరిమీద ప్రవహించి యీశ్వరుని జటాజూటమున ప్రవేశించెను. అంతట భగీరధుడు తన పితృదేవతలకు పుణ్యలోకములను కలుగ జేయుటకు యీశ్వరుని ప్రార్థించిన యీశ్వరుడు గంగను విడచెను. అదియే మూడు విధములుగ ప్రవహించెను. హిమవంతమునుండి దక్షిణమునకు ప్రవహించిన నదిని గంగ యనియు, భగీరధి యనియు పిలువబడుచుండెను. ఆ గంగ భగీరధుని రధమువెంట ప్రవహించుచువచ్చి భారతవర్షమున గల కురుదేశములందు ప్రవహించి సముద్రమునందు గలియుచున్నది. తక్కిన ప్రవాహములు సింధు, బ్రహ్మపుత్ర, గంగ యను మూడు పాయలును పర్వతగర్భములోగా ప్రవహించి గోదావరి, కృష్ణ, కావేరి మహానదులుగ వ్యవహరింపబడుచున్నవి.

## భారతవర్షమునగల ద్వీపములు, నదులు

యీ భారతవర్షము ఇంద్ర, సేతు, తామ్రపర్ణ, అభస్తి, అన్నామక, సౌమ్య, గాంధర్వ, వారుణ, జంబువు యను తొమ్మిది ద్వీపములచేత యేర్పడియున్నది. జంబూద్వీపము వేయి యోజనములు నిడుపుగలది అయి తూర్పున కిరాతకులచేతను, పశ్చిమమున మ్లేచ్ఛులచేతను, మధ్యమమున బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులచేతను నిండియుండి పుణ్యము, పాపము, స్వర్గము, నరకము మొదలగు వాటిచేత మోక్షపదంబై ప్రకాశించుచున్నది. యీ ద్వీపమునందు వింధ్యాది సప్తకుల పర్వతములచేతను కోలాహలము మొదలగు అనేక ఉపపర్వతములచేతను నిండియున్నది.

హిమాచల పర్వతమునందును దీని ఉపపర్వతములు మొదలగువానినుండియు పుట్టిన గంగానది మొదలగు యిరువది నదులున్ను, పారియాత్ర పర్వతమునుండి

పుట్టిన వేదస్మృతి మొదలగు నదులును, ఋక్ష పర్వ
తమును దాని ప్రత్యంత పర్వతములు మొదలగు వాని
నుండి పుట్టిన శోణ, రుక్మ మొదలగు నదులును, వింధ్య
పర్వతమునుండి పుట్టిన సువాహి మొదలగు నదులున్ను,
సహ్యాపర్వతమును, దాని ఉపపర్వతముల నుండియు
బుట్టిన కృష్ణా, గోదావరి నదులును, మలయ పర్వతము
మొదలగు వానినుండి బుట్టిన కృతమాలాది నదులును,
మహేంద్ర పర్వతమునుండిపుట్టిన పిత్రుకుల్యాదినదులును
శుక్తి పర్వతమునుండి బుట్టిన ఋషికుల్యాది నదులును,
ఈ విధముగా అనేక నదులు గలవు.

యీ ద్వీపమున గల దేశంబులను జెప్పెదను
వినుము : మత్స్య, అశ్వకూట, కుల్య, కుంతల, కాశి,
కోసల, అథర్వ, కళింగ, మశక, వృకంబులును, వీటిని
మధ్యదేశములని జెప్పుదురు. వీటికి ఉత్తరమున బాహ్లీక
వాటధానములు, ఆభీరములు, గాలితోయకములు, నవ
రోగములు, శూద్రపకములు, పల్లవములు, చర్మఖండములు,
గాంధారములు, యవనములు, సింధువులు, సౌవీరములు,
మద్రకములు గలవు. పూర్వున ఆంధ్రములు, శాక్యములు,
ముదకరములు, నంతర్గిరులు, బహిర్గిరులు, ప్లవంగములు,
వంగేయములు, మలదములు, బ్రహ్మోత్తరములు, ప్రవి
జయములు గలవు. దక్షిణమున పాండ్య, కేరళ, చోళ,

కుల్య, పేతుక, మూషిక, కుమారాది దేశములు గలవు. పశ్చిమమున సూర్యారకములు, కాళివనములు దుర్గములు, తాళసఖములు, పుళిందములు గలవు, మనోజ్ఞక రూళ మేఃక, చేలకాది దేశంబులు గలవు. వింధ్యపర్వతమున సిర్వారి, హంసమార్గ, కుపదాధి దేశములు అనేకములు గలవు.

యీ భారత వర్షమునకు ప్రాగ్దక్షిణ, పశ్చిమము లందు సముద్రంబును, ఉత్తరమున హిమవంత పర్వతమును గలదు. అందువలన యిది ధనురాకారముగా నున్నది. ఈ వర్షంబున నివశించు జనులు పుణ్యఫలముచేత బ్రహ్మ, యింద్ర, శివపదంబులు గలుగును. కర్మఫలము యిచ్చునట్టి చతుర్ముఖ బ్రహ్మ ఈ భారతవర్షంబున నివశించి యుండును.

దేవతలు తమతమ పుణ్యఫలములను బట్టి మనుష్య జన్మంబుల బుట్టి పుణ్యకర్మలను జేయవచ్చునని తలంచుచుందురు. మనుష్యులు జేయు పుణ్య పాప కర్మఫలములను నివారించుటకు బ్రహ్మాది దేవతలకు శక్యముకాద "ని మార్కండేయుడు జెప్పెను.

## కూర్మ స్థానము

మార్కండేయుడు ఇలా జెప్పుచున్నాడు—" ఓ క్రోష్టికీ! యీ భారతఖండము తొమ్మిది విధములగు భేదములను గలిగి యున్నది.

యీ భారతవర్షమున శ్రీ మహావిష్ణువు కూర్మ రూపము ధరించియుండెను. నాలుగు పాదములును, రెండు కుక్షులును, ఒక పృచ్ఛము, ఒక శిరస్సు, ఒక పృష్టము గలసి తొమ్మిది స్థానంబులుగల తాబేటిరూపమున నుండెను. అందువలన ఈ భరతఖండమునందు నివశించు జనులకు ఒక్కొక్క స్థానమున నక్షత్రములు, గ్రహములు సంచరించునప్పుడు శుభాశుభ ఫలములను యిచ్చు చుండును. అవి యే ప్రకారము ఫలముల నిచ్చునో వివరించి జెప్పుచున్నాను వినుము!

౧. మ్లేచ్ఛ, మద్ర, విమల, అవ్య, నీపశ, శుక, ఉజ్జయని, వత్స, ఘోషయాన, సారస్వత, మత్స్య, శూరసేన, మధుర మొదలగు దేశంబులు పృష్ఠ భాగము

నందు నున్నవి. కావున అచ్చట నివశించు జనులకు కృత్తిక, రోహిణి, మృగశిర నక్షత్రములు ఫలముల నిచ్చును.

౨. వృషధ్వజ మొదలగు పర్వతములును, మైథిలి, సాంద్ర, సిదన, తంతుర, ప్రాగ్జ్యోతిషాది దేశములు ముఖమున నుండును. అచ్చటనుండు జనులకు ఆరుద్ర పునర్వసు, పుష్యమి నక్షత్రములు ఫలముల నిచ్చును.

౩. కళింగ, వంగ, సరవ, కోసల, మూషికాది దేశంబులు ఆగ్నేయ పాదమునందును. అచ్చట నివశించు జనులకు ఆశ్రేష, మఖ, పుబ్బలు సుఖదుఃఖముల నిచ్చును.

౪. అజ, కాలాజన, పైలికాది దేశంబులును, మహేంద్ర మలయాది పర్వతములును, దక్షిణకుక్షి ఆశ్రయించి వున్నవి. అచ్చట నుండువారికి ఉత్తర, హస్త, చిత్తలు ఫలములిచ్చును.

౫. కాంభోజ, పల్లవ, అటవీముఖాది దేశంబులు నైరుతి పాదంబున నున్నవి. కావున నచ్చటివారికి స్వాతి, విశాఖ, అనూరాధలు ఫలము లిచ్చును.

౬. మణి, మేఖల, పర్వతంబులును, పరాంతిక హైహయాది దేశంబులును పుచ్ఛంబున నుండును. అందు వలన అచ్చటివారలకు జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢలు ఫల మిచ్చును.

౭. పాండ్య, తుషారాది దేశంబులు వాయవ్య పాదమందు గలవు. అందువలన నచ్చట నివశించువారికి ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్టలు ఫలముల నిచ్చును.

౮. కైలాసాది పర్వతములు, వసంత, కేకయ మొదలగు దేశంబులు ఉత్తరకుక్షి నున్నవి. అందువలన నచ్చటివారికి శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్రలు ఫలముల నిచ్చును.

౯. నైమిశారణ్య, నవరాజ్య, పశుల, పంచ, కీచక, కాశ్మీరాది దేశంబులు ఈశాన్య పాదమునందు గలవు. కావున నచ్చటి జనులకు రేవతి, అశ్వని, భరణి, నక్షత్రములు శుభాశుభ ఫలముల నిచ్చుచుండును.

యీ కూర్మమునకు

౧. పృష్టమున మేష, వృషభ, మిథునములున్ను

౨. ముఖమున మిథున, కర్కాటకములున్ను

౩. ఆగ్నేయ పాదమున కర్కాటక సింహములున్ను
౪. దక్షిణ కుక్షియందు సింహ, కన్యాదులున్ను
౫. నైరుతి పాదంబున తులా వృశ్చికమున్ను
౬. పృచ్ఛమున వృశ్చిక, ధనస్సులున్ను
౭. వాయవ్యపాదమున ధనస్సు మకర కుంభములున్ను
౮. ఉత్తర కుక్షియందు కుంభ, మీనములున్ను
౯. యీశాన్య పాదంబున మీన, మేషంబులున్ను
నివశించియుండును.

యీ రాసులయందు పాపగ్రహములు నివశించునప్పుడు ఆ దేశంబులకున్ను, అందు నివశించు జనులకున్ను, ఆయా రాశుల నక్షత్రములు గలవారికిన్ని, రాసులు గలవారికిన్ని. అరిష్టములు, అపమృత్యువులు గలుగుచుండును. కావున వాటి శాంతికొరకు జపహోమ, దాన ధర్మంబులు జేయించుకొనుట ముఖ్యము అటుల చేయించిన అరిష్టములు శాంతించును.

దేవదత్తంబునకు తూర్పున భద్రాశ్వ వర్షంబు గలదు. అది శ్వేతవర్ణాది పంచపర్వత యుక్తంబై శీత, శంఘావతి మొదలగు నదులచే నిండియున్నది. అచట నివసించు జనులు పదివేల సంవత్సరములు జీవించెదరు.

ఉత్తమ, అధమ, మధ్యమ అను భేదము లేక సుఖింతురు శ్రీ హయగ్రీవ రూపమునందు శ్రీ మహావిష్ణువును పూజింపుచుందురు. ఈ ద్వీపము గుఱ్ఱపుతలవలె ఆకారము గలిగియుండును. శిరము, హృదయము, శేషము, పాద, హస్త, నేత్రములను జేరి తొమ్మిది స్థానములయందు గలిగియున్నది. ఆయాస్థానములయందు జనులకు క్రమంబుగా కృత్తికాది నక్షత్రములున్ను, మేషాదిరాసులున్ను గలవు.

కేతుమాలవర్షము పశ్చిమమున విశాలాది సప్త పర్వతములతోడను, మాసస్తోమ, మహేశాది దేశంబుల తోడను, చక్షుశ్శ్యామాది నదీనదముల తోటిన్ని ప్రకాశించుచుండును. అచ్చట నుండువారు వరాహిరూపియగు విష్ణువును పూజింపుచుందురు. ఉత్తర కురువర్షంబున నుండు జనులు మత్స్యరూపి యగు శ్రీ మహావిష్ణువును ఆరాధింపుచుందురు. వీరికందరకు నక్షత్రరాశి ఫలంబులు, భరతఖండమునందువలెనే శుభాశుభ ఫలంబులు అనుభవింతురు.

## కింపురుషులు

ఓ క్రోష్టికీ! కింపురుష ఖండమునందు నివశించు జనులు పదివేల సంవత్సరములు ఆయుర్దాయము గలిగియుందురు. వీరు జువ్వి పండ్లను ఆహారముగా తిందురు. స్త్రీలు, పురుషులు, బాల్య యవ్వన కౌమారములులేక ఎల్లప్పుడును ముప్పది సంవత్సరములు వయస్సు గలవారై వ్యాధులు లేక సుఖంబుగ నుందురు.

## హరివర్షము

యీ కింపురుష లోకమునకు పైభాగమునందు హరి వర్షము గలదు. స్వర్గమున నుండువారికి పుణ్యము నశించిన యెడల ఈ హరివర్షమున పుట్టుదురు. వీరు పచ్చటి దేహకాంతి గలవారై చెరుకు రసమును త్రాగు చుందురు.

## ఏలావృతవర్షము

ఏలావృతవర్షము మేరుపర్వతావృతమైన మేరువర్షమని పిలువబడును. ఇచ్చట నివసించు జనులకు సూర్యరశ్మి

గాని, చీకటిగాని లేక సదా చంద్రకిరణ ఆవృతమయి వుండును. వీరికి ముదిమిలేక నేరేడుపండ్లను తినుచు పదమూడువేల సంవత్సరములు జీవించుచుందురు.

## రమ్యకవర్షము

ఈ నీలావృత వర్షమునకు పైభాగమునందు రమ్యక వర్షము గలదు. ఇచ్చటనుండువారు మఱ్ఱిపండ్లను తినుచు సురత సుఖంబులు అనుభవించుచు పదివేల సంవత్సరములు సుఖంబుగ నుందురు.

## హిరణ్మయవర్షము

ఈ రమ్యక వర్షమున కుత్తరభాగమునందు హిరణ్మయ వర్షము గలదు. అచ్చట బంగార మయమగు తామర పుష్పములచేత నిండియున్న ఒక్క సరోవరంబుగలదు. అచ్చటనుండు జనులు బలముగలవారై యక్షరూపమున నుందురు.

## స్వారోచిషమనువు

ఓ క్రోష్టికీ! మన్వంతరములను జెప్పుచున్నాను శ్రద్ధగా వినుము! భూతలోకములను, నక్షత్రములు, రాసులు

క్రమమును జెప్పితిని. ఇప్పుడు స్వారోచిషాది మన్వంతరములను, యింద్రులను, సప్తఋషులను, మనుపుత్రులను జెప్పుచున్నాను.

వరుణానదీ తీరమునందు అరుణాస్పదమను పట్టణము గలదు. ఆ పట్టణమున వేదవేదాంగ పారంగుడున్ను, సదాచార సంపన్నుడున్ను అయిన ప్రవరుడను బ్రాహ్మణుడు గలడు. ఆ బ్రాహ్మణునకు భూమియందు తిరుగవలెనని బుద్ధిగలిగి ఒకనాడు దైవయోగమున మంత్ర తంత్ర ఓషధుల మహాత్మ్యమును దెలసిన సిద్ధుడు ఒకడు రాగా ప్రవరుడు " ఆ సిద్ధుని పూజించి సుఖంబుగా కూర్చుండబెట్టి భూమియందుగల చిత్రములను జెప్పవలసినది " అని కోరెను.

ఆ సిద్ధుడు నదీ నద, వన పర్వతంబులును, పుణ్యక్షేత్ర, దివ్యక్షేత్ర మహిమలును దెలిపెను.

ఆ మాటలకు ప్రవరుడు ఆశ్చర్యమును పొంది సంతోషించి—" మహాత్మా ! నీవు పిన్నవయస్కుడవు గదా, నీవు యిన్ని దేశములను, యిన్ని వింతలను జూచుట జాడగలిగితివి ? " అని ప్రశ్నించెను.

సిద్ధుడు జెప్పుచున్నాడు—"ఓ బ్రాహ్మణశ్రేష్టుడా! మంత్ర తంత్రము, ఓషధుల మహాత్మ్యము తెలిసిన నేను కామగమనము గలవాడనై, అర్ధదినంబుననే అనేక వేల యోజనముల దూరమును పోగలిగితిని" అని జెప్పెను.

ఆ మాటలను ప్రవరుడు విని చాలా సంతోషమును పొంది—"అయ్యా, సిద్ధివర్యా! నీ మంత్ర ఓషధుల ప్రభావమును నాకు జెప్పుము. యీ భూమండల మంతయు జూడవలయుననీ నాకు కోరిక గలదు" అని యడిగెను.

సిద్ధుడు ప్రవరునకు పాదలేపన ఔషధమును జెప్పి మంత్రమును ఉపదేశము జేసెను. అంతట ఆ బ్రాహ్మణుడు ఆ ఔషధంబును పాదంబులకు బూసుకుని మంత్రమును జపించి పోవునప్పుడు అర్ధదినమున వేయి యోజనములు దూరము పోవుటకు తలంచెను. ఆ సంకల్పము ప్రకారము అర్ధదినమునకు హిమవంత పర్వతమునకు పైభాగమునందు దిగెను.

ప్రవరుడు అచ్చట దిగి ఆ పర్వతమునందుగల చిత్ర విచిత్రములను జూచుచుండెను. ఆ ప్రకారము దిరుగుచు అందములగు గుహాలను జూచుచుండెను.

ఆ గుహలు సిద్ధులచేతను, గంధర్వాదులచేతను సేవింప బడుచుండెను. దేవతలు అప్సరసలు తిరుగు స్థలములను జూచుచు తృప్తినిబొందక నీరు ప్రవహించుచున్న గుహలను జూచుచుండెను. అచ్చట నెమళ్ళు మొదలగు పక్షుల సంచారమును, కలకలంబులను విని ఆనందమును పొందుచు మనస్సు తృప్తిగానక రేపకడ రావచ్చునని తలంచి తన మనంబున తన గృహంబునకు వెళ్ళుటకు తలంచెను. గాని పాదలేపనము నీటియందు తిరుగుట చేతను, మంచుచేతను కరగిపోయి కామ గమనము తగ్గిపోయెను. అది ప్రవరుడు తెలుసుకుని—"అయ్యో! నేను యేమి చేయుదును. ఈ పర్వతము చాలా పెద్దది. దిగుటకు చాలా ప్రయాసను కలుగజేయును. చాలా దూరము వచ్చితిని. అగ్ని శుశ్రూషాది నిత్యకర్మలు చెడును. నేను యిచ్చట యేమి చేయగలను? ఔషధమా నావద్ద లేకపోయెను" అని విచారించుచు తిరుగుచుండెను.

ఆ కొండ గుహలయందుగల 'వరూధిని' యను గంధర్వకాంత ప్రవరాఖ్యుని జూచి మోహపరవశయై ఆతని సమీపమునకు వెళ్లెను.

ఆ విప్రుడు ఆమెను గౌరవముగ జూచి సమీపము నకు వెళ్ళి—"ఓ తరుణీ! నీవు యెవతెవు? యిచ్చటకు వచ్చుటకు కారణమేమి? నేను బ్రాహ్మణుడను. అరుణాస్పదమను పట్టణమునుండి వచ్చితిని, నా పాదలేపనము కరగిపోయినది, యిప్పుడు నేను పోవుటకు సామర్ధ్యము లేనివాడనైతిని" యని మధురవాక్యములను జెప్పెను.

ఆ మాటలు వరూధిని విని—"ఓ విప్రవర్యా! నేను మేనకయను దేవాంగన పుత్రికను. నన్ను వరూధిని అని పిలచెదరు. నేను నిన్ను జూచినది మొదలు నా మనస్సు నీయందు తగులముపొంది మోహమును పొందియున్నాను. భూలోకమునందు గల సుఖములకంటె దేవతా సుఖములు యెక్కువగదా? ఎన్ని యజ్ఞ యాగాదులను జేసినను దేవాంగనల సౌఖ్యమునకే గదా! అటువంటి నీవు భూలోక సుఖములను వదలి నన్ను పొంది దేవతాసుఖంబు ననుభవింపుము" అని ప్రవరాఖ్యుని కౌగలించుకొనెను.

ప్రవరాఖ్యుడు పరాఙ్ముఖుడై వరూధినను త్రోచి వైచి దూరమునకు పోయి నేను సర్వకాలములందు పర ద్రవ్యములను, పరస్త్రీలను గోరనివాడనైతినేని, దేవతా పితృకార్యములందు శ్రద్ధగలవాడనైతినేని, విత్యాగ్ని

హోత్రమును జేయువాడనైతినేని సూర్యాస్తమయమునకు ముందుగనే నన్ను నా గృహంబునకు జేర్చుమని అగ్నిహోత్రుని ప్రార్థించెను.

ఆ ప్రకారము ప్రవరాఖ్యుడు అగ్నిహోత్రుని ప్రార్థించగానే సత్యసంపన్నుడైన ప్రవరాఖ్యుని కోరిక ప్రకారము అగ్నిహోత్రుడు సశరీరుండై వచ్చి ప్రవరాఖ్యుని తన భుజమునందు కూర్చుండ బెట్టుకొని అంతరిక్ష మార్గమున తీసుకునివచ్చి ప్రవరాఖ్యుని స్వగృహమునందు నిలిపి అగ్నిహోత్రుడు అదృశ్యుడాయెను.

వరూధిని ప్రవరాఖ్యుని గానక మోహపరవశయై విచారించుచుండగా కలి యను గంధర్వుడు కపటముగ ప్రవరాఖ్యుని రూపమును ధరించి గంధర్వమాయను కల్పించి వరూధిని సమీపమునకు వచ్చెను.

## కలి యను గంధర్వుడు కపట ప్రవరాఖ్యుడై వరూధినిని వివాహమాడుట

కపట రూపమున నున్న గంధర్వుడు వరూధినిని సమీపించి వనమునందు సంచరించుచు యిట్టులని తలంచు

చుండెను—"నేను చాలా కాలమునుండి యీమెను ప్రేమించియుండి అనేక విధముల ప్రార్థించుచుంటిని గాని నా ప్రయత్నము నెరవేరలేదు. యీమె యిప్పుడు ప్రవరాఖ్యుడను బ్రాహ్మణుని మోహించియున్నది. ఆ బ్రాహ్మణుడు వేదజ్ఞుడు గాన త్రిలోక సౌందర్యము గల యీ వరూధినిని విడచి వెళ్ళిపోయెను. నేను యే విధముగానైనను యీ తరుణీమణిని పొందెదనుగాక" అని తలంచుచు తిరుగుచుండెను.

తన సమీపమునందు తిరుగుచున్న కపట ప్రవరాఖ్యుని జూచి వరూధిని మహానందము పొంది వాని సమీపమునకు వచ్చి అనేక విధముల బ్రతిమాలజొచ్చెను.

ఆ మాటలు కపట బ్రాహ్మణుడు విని—"ఓ వరూధినీ! నేను నీకొరకు అగ్నిహోత్రాదులను వదలి నీ మనోరథమును నెరవేర్చెదను. అయినను నేను చెప్పెడి నియమము ప్రకారము జేయుదునని నీవు శపథము జేసిన యెడల నీ పొందును నేను జేయుదును. లేనియెడల యిచ్చటనే తపంబు జేయుదును" అని జెప్పెను.

ఆ మాటలను వరూధిని విని సంతోషముపొంది— "నీవు జెప్పెడి కోరికలను జెప్పుము?" అని యడిగెను.

"వరూధినీ! నీవు సంభోగ సమయమునందు నన్ను జూడక రెండుకన్నులను మూసుకుందునని శపథము జేసిన యెడల నీకోరిక నెరవేర్చి నిన్ను పొందుదు" నని కపట ప్రవరాఖ్యుడు జెప్పెను.

వరూధిని అటుల సమ్మతించగా వారుభయులును అన్యోన్య ప్రేమ గలవారై మన్మధ క్రీడల సర్వసుఖములను అనుభవించుచుండిరి.

వరూధిని కన్నులు మూసుకొనియున్నను ప్రవరాఖ్య రూపమును స్మరించుచుండెను.

యీ విధముగా చాలాకాలము జరిగిన పిమ్మట వరూధిని గర్భము దాల్చెను. కలియను గంధర్వుడు వరూధినితో జెప్పి వెడలిపోయెను. పిమ్మట కొంత కాలమునకు వరూధిని కోటిసూర్య ప్రకాశమానముగల కుమారుని గనెను. ఆ బాలుని దేహకాంతిచేత దశదిక్కులు ప్రకాశించు చుండెను అందువలన శరీరవాక్కున ఆ బాలుడు స్వారోచియను పేరున పిలువబడెను

అది మొదలు ఆ బాలుడు బాలచంద్రుని బోలి దిన దిన ప్రవర్ధమానుడై, అనేక మంచి గుణములు గలిగి,

ధనుర్వేదంబును సమగ్రముగా నభ్యసించి, సకల విద్యా పారంగతుడై ప్రఖ్యాతి గలిగి, ఇందీవరాక్షుని వలన ఆయుర్వేదంబును, అధర్వణ వేదంబును బుచ్చుకుని, యిందీవరాక్షుని కుమార్తె యగు మనోరమను వివాహ మాడెను. పిమ్మట మనోరమ చెలికత్తెలగు విభావరి అను కన్యను వివాహమయి ఆమె వలన సర్వజంతు ధ్వనివేదిని అను విద్యను గ్రహించెను. పిమ్మట కళావతి యను కన్యను వివాహమయి నవనిధులు వశంబులగు పద్మిని యను విద్యను గ్రహించెను. ఆ సమయమునందు ఆకాశమునందు దేవదుందుభులు మ్రోగెను.

స్వారోచి మనోరమ, విభావరి, కళావతి యను ముగ్గురు భార్యలయందు అన్యోన్య ప్రేమానురాగంబులు గలవాడై సర్వసుఖములు పొందుచుండెను.

ఇటుల నుండగా కొంతకాలమునకు లేడిరూపము ధరించి వచ్చిన వనదేవతను, దేవతల అనుమతి ప్రకారము వివాహమాడెను. ఆమె యందు మనువు జన్మించెను. ఆ సమయమునందు గంధర్వులు పాడిరి. దేవదుందుభులు మ్రోగినవి. ఆ బాలునకు ద్యుతిమంతుడని పేరును పెట్టిరి. స్వారోచికి ద్యుతిమంతుడు పుత్రుడు గావున స్వారోచితుండని ప్రసిద్ధిగలిగెను.

ఇటుల నుండగా స్వారోచి ఒకనాడు హంస దంపతులు సంసారమందు విరక్తి గలుగు వాక్యములను మాట్లాడు కొనుచుండగా విని తాను సంసారమునందు విరక్తి గలవాడై తాను భార్యల సహితముగా సకల సుఖంబులను విసర్జించి తపోవనంబునకు పోయి పాప రహితుండై బ్రహ్మలోకమునకు పోయెను. పిమ్మట స్వారోచితుని మనువుగా బ్రహ్మ నియమించెను.

## స్వారోచి మనువు కాలమున ఇంద్రాదులు

ఈ ప్రకారము స్వారోచి విరక్తుడై బ్రహ్మలోకమునకు రాగా బ్రహ్మ స్వారోచిషుని మనువుగా జేసి ఈ విధముగా నిర్ణయించెను. దేవతలు పారావతులనియు, దుషితులనియు రెండు విధములుగ నుండిరి. విపశ్చిత్తు అనువాడు యింద్రుడు. ఉర్జస్థంబ ప్రాణదత్తోకి, ఋషధిని, వారాధ్వర వంతు లనువారు సప్తఋషులు. చైత్రాది సుతులు ఏడు గురు పుట్టి ఆ మనువు కాలమునందు భూమిని పాలించిరి" అని మార్కండేయుడు జెప్పగా క్రోష్టికి ప్రశ్నించు చున్నాడు.

## నిధుల మహిమను వర్ణించుట

“అయ్యా, మార్కండేయా! స్వారోచిష మన్వంతరమును జెప్పితివి. పద్మిని యను విద్యా ప్రభావమును కూడా జెప్పవలసినది” అని కోరెను.

ఆ మాటలకు మార్కండేయుడు జెప్పుచున్నాడు—
“క్రోష్టికీ! పద్మిని యను విద్యకు శ్రీమహాలక్ష్మి అధిదేవత. నిధులు అన్నియు ఆమె అధీనమునందు వుండును. వాటిలో ౧. పద్మ, ౨. మహాపద్మ, ౩. మకర, ౪. కచ్ఛప, ౫. ముకుంద, ౬. కుంద, ౭. నీల, ౮. శంఖములని ఎనిమిది విధములగు నిధులుగలవు వాటి వృద్ధిక్షయములను జెప్పుచున్నాను వినుము!

౧. పద్మంబను నిధి సత్వగుణము ప్రధానము గలది. ఈ ధనము పుత్రపౌత్ర పారంపర్యముగా వృద్ధి యగుచుండును. ఈ ధనము దాన ధర్మములకు, యజ్ఞ యాగాదులకు ఉపయోగపడును.

౨. మహాపద్మంబను నిధి సత్త్వగుణము గలది. ఈ నిధి సత్పురుషులకు దాన ధర్మములు జేయుటకు, గృహదానములు జేయించుటకు వినియోగపడుచు ఏడు పురుషాంతములు వరకు వుండును.

౩. మకరమను నిధి గలవారు జ్ఞానములేక ఒకరితో ఒకరు పోరువారికిన్ని, పరుషవాక్యములు జెప్పువారికిన్ని యిచ్చునటుల జేయుచు వారి జీవితాంతమువరకు నిలచును.

౪. కచ్ఛప అను నిధి గలవారు అనేక విధములుగా ధనమును సంపాదించుచు స్వధర్మమును వదిలి తాను తినక యితరులకు పెట్టక దాచియుంచెదరు. ఇది స్వల్ప కాలము మాత్రమే వుండును.

౫. ముకుంద అను నిధిగలవారు రజోగుణము గలవారై శృంగార విలాసములను వెలుగుచు తామమాత్రమే భుజించుచు యితరులను పోషణ జేయించుచుందురు. యీ ధనము స్వల్పకాలము మాత్రమే నిలచును.

౬. కుంద అను నిధి గలవారు రజస్సత్త్వము గల వారై ధాన్యాదులను విక్రయించుచు, ధనమును సంపా

ధించుచు, బంధుపోషణము చేయుచు, అతిథి అభ్యాగతులను పోషించుచు, స్తోత్రప్రియులై స్త్రీలోలురై యుందురు. ఈ ధనము యేడు పురుషాంతరముల వరకు వుండును. ఆయురారోగ్యములు గలవారై యుందురు.

౭. నీల అను నిధి గలవారు సత్వ తమోగుణములు గలవారై జ్ఞానములేని మూర్ఖులుగ నుండి బట్టలు, ధాన్య, పుష్ప, మాంసాదులను విక్రయించి సంపాదించెదరు. ఈ ధనము మూడు పురుషాంతముల వరకు వుండును.

౮. శంఖము అను నిధి గలవారు తాను తినుచు పుత్రమిత్ర కళత్రములకు బెట్టక రజోగుణము గలవారై యుందురు. యీ ధనము స్వల్పకాలమే యుండును.

## ఉత్తమ మన్వంతరము

బ్రహ్మా క్రోష్టికీ! మూడవది యగు ఉత్తమ మన్వంతరమును జెప్పుచున్నాను వినుము!

స్వాయంభువ మనువుయొక్క వంశమునందు ఉత్తానపాదునకు ఉత్తముడను పుత్రుడు గలిగెను.

ఆ యుత్తముడు ధార్మికుడై పరాక్రమమున శ్రీ సూర్యుని కైవడి దుష్టనిగ్రహము శిష్టపాలనము జేయుచు బభ్రు కుమార్తె బహుళ యను కన్యను వివాహమైయుండెను. గాని ఆమె యెల్లప్పుడును భర్తను అవమాన పర్చు చుండగా ఆ రాజు కోపముగలిగి ఆ భార్యను అడవికి పంపించివేసెను. ఆమె సంతోషముగా అడవియందు తిరుగు చుండెను. రాజు మాత్రము విచారము గలవాడై యుండెను.

యీ విధముగా నుండగా ఒకనాడు సుశర్మ యను బ్రాహ్మణుడు రాజువద్దకు వచ్చి—"ఓ రాజోత్తమా ! నేను నిద్రించుచున్న సమయమునందు యెవ్వడో నా భార్యను అపహరించెను. నీవు రాజువుగాన నా భార్యను దెచ్చి యివ్వవలసినది" అని జెప్పెను.

అందులకు రాజు—"ఓ బ్రాహ్మణుడా ! నీ భార్యను నేను యెరుగను. ఆమె రూపమును జెప్పుము దెచ్చి యిచ్చెదను" అనెను.

ఆ మాటలకు సుశర్మ యిటా జెప్పుచున్నాడు—

"నా భార్యకు భయమును కలుగజేయునట్టి కన్నులును,

కురుచ చేతులును, చిక్కియున్న ముఖమును గలిగి కఠినమైన మాటలను పలుకునట్టిదై యున్నది" అని జెప్పెను.

రాజు విని—"ఓ బ్రాహ్మణుడా! అట్టి కురూపి యగు భార్య నీకు యెందుకు? యవ్వనవతియు, రూప వతియు, మంచికులమునందు బుట్టి సుగుణములు గలిగి యున్న కన్యను నీకు దెచ్చియిచ్చెదను. అటువంటి కన్యను పరిగ్రహింపుము" అని జెప్పెను.

ఆ మాటలు సుశర్మవిని—"రాజశ్రేష్ఠా! నా భార్య యెటువంటిది అయినను విడువతగదు. నా భార్యను నేను కాపాడుట ధర్మము. భార్యను విడచినవాడు కులమును సంకరము జేసినవాడగును. అందువలన నరకము సంభ వించును. భార్య లేనివాడు నిత్యకర్మలు జేసినను నిష్ప్ర యోజనములు అగును. కావున నా భార్యను నాకు దెచ్చి యిమ్ము" అనెను.

ఆ మాటలను విని రాజు ఇలా జెప్పుచున్నాడు—"ఓ బ్రాహ్మణుడా! నేను నీ భార్యను తీసుకొని వచ్చెడు పర్యంతము యిచ్చట నుండుము" అని జెప్పి రథంబు నెక్కి అరణ్యంబులు, గుట్టలు, మెట్టలు మొదలగు

ప్రదేశంబులు తిరిగి ఎచ్చటను గానక కడకు ఒక గృహావద్ద పద్మాసీనుడై తపంబుజేయుచున్న ఋషిని జూచి సమీపమునకు వెళ్ళి వినయమున నమస్కరించెను.

ముని సన్మానముజేసి అర్ఘ్యమును, పాద్యాదులను యివ్వక—"ఓ రాజేంద్రా ! నీవు వచ్చుటకు కారణమును జెప్పుము" అని యడిగెను.

ఆ మాటలు విని రాజు—"మునికుల సంభవా ! సుశర్మ యను బ్రాహ్మణుని భార్యను ఎవ్వరో అపహరించెను. ఆమెను వెదకుచు యిచ్చోటునకు వచ్చితిని. అభ్యాగతినగు నాకు అర్ఘ్యాదులను యివ్వకుండుటకు కారణమేమి ?" అని అడిగెను.

"రాజా ! నీవు స్వాయంభువ మనువు వంశమునందు బుట్టియు భార్యను విడచితివి. భార్య లేనివాడు వైదిక కృత్యములకు పనికిరాడు. భార్య రూపవతి అయినను కాకపోయినను, దుర్మార్గురాలు అయినను విడువరాదు. యిది పురుష ధర్మము. పత్నీసమేతుడై కర్మలను జేయవలెను. లోకధర్మములను కాపాడునట్టి నీవే అధర్మమును జేయుచుంటివి. కావున నీకు

అర్ఘ్యమును యిచ్చుట న్యాయముకాదని నిన్ను పూజించుట మానితిని " అని ముని జెప్పెను.

ఆ మాటలకు రాజు—" మునిపుంగవా ! అది అటుల నుండనిమ్ము. బ్రాహ్మణుని భార్యను ఎవ్వడు అపహరించెనో, యెచ్చట నున్నదో జెప్పుము " అని కోరెను.

ముని జెప్పుచున్నాడు—" ఓ రాజా ! సుశర్మయను బ్రాహ్మణుని భార్యను నద్రి సుతుండగు బలాకుండను రక్కసుడు తీసుకొనిపోయి త్పలాకంబను వనంబున నుంచెను. అచ్చటకు పొమ్ము " అని జెప్పి, " ఆ విప్రుని భార్యను దెచ్చి బ్రాహ్మణునకు యిచ్చితివేని నీ పాపంబులు అన్నియు నశించిపోవును " అని జెప్పెను.

ఉత్తానపాదుని పుత్రుడు రథంబును యెక్కి ముని జెప్పిన ప్రకారము త్పలాక వనంబునకు వెళ్ళి వెదకుచు మారేడు పండ్లను తినుచున్న యువతిం జూచి-" మగువా ! యీ వనంబునకు ఎటుల వచ్చితివి ? నీ భర్త సుశర్మగాదా ? నీ సంగతి జెప్పుము ? " అని యడిగెను.

ఆమె యిటులని జెప్పుచున్నది—"ఓ రాజా! నేను అతిరాత్రుండని పిలువబడు బ్రాహ్మణుని పుత్రికను. విశాల నేత్రుండును, సదాచార సంపన్నుడును అయిన సుశర్మ యను బ్రాహ్మణుని భార్యను. నేను నిద్రించు చుండగా బలాకుండను రాక్షసుడు నన్ను యిచ్చట దెచ్చి నాడు" అని జెప్పెను.

ఆ మాటలకు రాజు—"అమ్మా! నిన్ను తీసుకుని వచ్చిన రాక్షసుడు ఎక్కడ నున్నాడు? వాని సంగతి జెప్పుము! నీ భర్త నన్ను ప్రార్థించుటచే నిన్ను తీసుకుని వెళ్ళుటకు వచ్చితిని" అని జెప్పెను.

అంతట ఆమె—"రాజా! వాడు యీ అడవి మధ్యమునందు సంచరించుచుండును" అని జెప్పెను.

రాజశేఖరుడు ఆ మాటలను విని రాక్షసుడుండు చోవునకు వెళ్ళుచుండగా ఆ రక్కసుడు యెదురుగావచ్చి నమస్కారంబులు సల్పుచు అనేక విధముల ప్రార్థించుచు దగ్గరకు వచ్చి—"నన్ను అనుగ్రహింపుము. నీకు సేవకుడనై యుందును. నేను యిచ్చెడు అర్ఘ్యపాద్యాదు లను స్వీకరింపుము. యీ ఆసనంబున కూర్చుండుము" అని కోరెను.

ఆ మాటలు విని రాజు సంతోషించి యిట్లని జెప్పెను—"రాక్షసోత్తమా ! నీవు సుశర్మ భార్యను ఆహారముగా దెచ్చితివా ? అటులయిన యేల ఆమెను భక్షించి యుండలేదు ?" అని యడిగెను.

ఆ మాటలకు రాక్షసుడు—"ఓ రాజశ్రేష్టా ! నేను మనుష్యులను భక్షించువాడనుగాను మానవులు జేయు పుణ్య పాపములను భక్షించెదను. పుణ్యమును హరించిన మనుష్యులు దుర్మార్గులగుదురు. దుష్కృతమును హరించిన సుగుణ సంపత్తి గలవారలగుదురు కామంబునకు ఈమెను తీసుకునిరాలేదు. నాకు త్రిలోక సుందరులయిన భార్యలు అనేకులు గలరు. అయినను సుశర్మ యజ్ఞంబులందు ఋత్విజుడై రక్షాకరంబులయిన మంత్రంబులచే రాక్షసులను సంహరించుచున్నాడు. వాని కళత్రమును హరించిన గర్మ భ్రష్టుడగును అని తలంచి ఈమెను తెచ్చితిని" అని జెప్పెను.

రాజేంద్రుడు—"రాక్షసోత్తమా ! యీ విప్రస్త్రీకి గల దుశ్శీలతను భక్షించి భర్తకు వప్పగించి రావలసినది" అని జెప్పెను.

ఆ ప్రకారము రాక్షసు డామెను బ్రాహ్మణునకు వప్పగించి వచ్చి—“ రాజేంద్రా ! మీ ఆజ్ఞను నెరవేర్చితిని. యింక యేమి ఆజ్ఞాపించెదవో ఆజ్ఞాపించుము ” అని జెప్పెను.

ఆ మాటలను రాజువిని—“ రక్కసోత్తమా ! నేను దలంచినప్పుడు రమ్ము ” అని జెప్పి తాను త్రికాలజ్ఞుండను మునికడకు వచ్చి సుశర్మభార్య వృత్తాంతమును సర్వము జెప్పెను.

ఆ మాటలను మునివిని—“ రాజోత్తమా ! నీ మనో గత విషయంబు లన్నిటిని తెలుసుకుంటిని. భూలోకము నందు ధర్మ, అర్ధ, కామ, మోక్షములను సంపాదించుటకు భార్య కారణము. భార్యలేనివాడు కర్మహీనుడగును. భర్తలేని స్త్రీ విధవస్త్రీయై నిరర్ధకతను పొందును. భార్యను భర్తయు, భర్తను భార్యయు సదా రక్షించుకొనుచు విడచి యుండక నుండవలెను ” అని జెప్పెను.

అంతట రాజు—“ మునికులోత్తమా ! నా యందు యే మాత్రమును తప్పు లేకుండగనే నా భార్య అతి పరుష వాక్యములచేత నన్ను తూలనాడుచుండును. ఆ కఠిన వాక్యములను వినజాలక నేను నా భార్యను అడవికి

పంపించివేసితిని. ఆమెను విడనాడి విరహమును భరించ లేక పిచ్చివానివలె యిటుల సంచరించుచున్నాను. ఆమెను అడవియందు మృగంబులు భక్షించియుండును " అని జెప్పెను.

ముని జెప్పుచున్నాడు—" రాజేంద్రా ! నీవు అటుల బలుకకుము. నీ భార్య పాతాళలోకమున నున్నది. నీకు తెలియక అటుల పలుకుచున్నావు " అని జెప్పెను.

ఆ మాటలకు రాజు ఆశ్చర్యమును పొంది— " మునికులోత్తమా ! నా భార్య పాతాళలోకమునకు పోవుటకు యేమి కారణమున్నది ? ఆ తావున పాతివ్రత్యంబు తప్పకుండా నడచుచున్నదా ? ఆ వృత్తాంతమును విపులముగా జెప్పవలసినది " అని యడిగెను.

ముని జెప్పుచున్నాడు—" ఓ రాజేంద్రా ! పాతాళ లోకమునందు సాలపోతకుండు అను నాగరాజు గలడు. అతడు భూలోకమునకువచ్చి అడవియందు సంచరించుచు నీ భార్యను జూచి పాతాళమునకు గొనిపోయెను. అతనికి మనోరమ యను భార్యయు, నంద యను కుమార్తెయు

గలరు. నాగరాజు నీ భార్యను కుమార్తెకు వప్పగించి తనకు స్వాధీనమయి, భార్య యగునటుల జేయుము" అని జెప్పెను.

ఆ మాటలు కుమార్తె విని—"తండ్రీ! నీకు పరకాంతలను గోరు బుద్ధి తగదు. మహా పాపము సంభవించును" అని జెప్పెను.

ఆ మాటలకు తండ్రికి కోపమువచ్చి "నీవు నాకు బుద్ధి జెప్పితివి గాన నీవు మూగదానివి కమ్మని శాపమును బెట్టెను. అది మొదలు నీ భార్యకు నంద చెలికత్తెయై తిరుగుచున్నది" అని జెప్పెను.

ఆ మాటలకు రాజు సంతోషమును పొంది— "మునిపుంగవా! నేను నా భార్యయందు అనురాగము గలిగియుండగా ఆమెకు నాయందు మోహము లేక పోవుటకు కారణమేమి?" అని అడిగెను.

అందులకు ముని—"రాజేంద్రా! నీ వివాహ కాలమునందు సూర్యుడు, కుజుడు, శని అను మూడు క్రూరమృగములు నీ తనుస్థానమును జూచుచుండుటచేతను శుక్రుడు, గురుడు నీ కళత్రస్థానమును జూచుచుండుట

చేతను, నీ జన్మలగ్నమున కుజుడున్న, నీ భార్య జన్మ లగ్నమునందు చంద్రుడును యుండి ఒకరినొకరు చూచు చుండుటచేతను మీ భార్యాభర్తలకు యిటువంటి భేదములు కలుగుచున్నవి. అయినను నీ భార్య నిన్ను జేరును. ధర్మ యుక్తంబుగ రాజ్యపాలనము జేయుము" అని చెప్పి "రాజేంద్రా! వివాహ ముహూర్తంబులను బలా బలము లను విచారించి దైవజ్ఞులు ముహూర్తము లుంచుచుండ వలెను. ఆ శాస్త్రములను విమర్శించక ముహూర్తము లుంచుటచే యిటువంటి అన్యోన్యాధి ప్రేమలు లేక యుండుట కలుగుచున్నది. ప్రతి దైవజ్ఞులు యీ నియ మములను ముఖ్యముగా గమనించవలయును.

శ్లో॥ లగ్నాష్టమం ద్వాదశ బాణ సూర్యే।
చంద్రాష్టమం ద్వాదశ లగ్నచంద్రే।
భౌమే చతుసప్త శరాంకరంధ్రే।
షష్టత్రయం ద్వాదశ మష్టజీవే।
శుక్రేచ షష్టాష్టమ ద్వాదశేవా।
లగ్నాష్టమ ద్వాదశ పంచమంచే।
ద్వాదశ్య లగ్నే యతిరష్ట రాహుః।
వివాహకాలే యతిలగ్న కేతుః।
పాణిగ్రహే భర్తృరి మృత్యుదం స్యాత్॥

అని శాస్త్రంబులు జెప్పుచున్నవి " మునిసత్తముడు జెప్ప గానే రాజశ్రేష్టుడు త్రికాలజ్ఞమునికి నమస్కరించి రథంబు నెక్కి తన పురంబునకువచ్చి సుశర్మ యను బ్రాహ్మణుడు భార్యాయుక్తుడై యుండుటను జూచి సంతోషమును పొంది నమస్కరించి నిలుచుండెను.

సుశర్మ రాజును జూచి మహానందమును పొంది— "ఓ రాజోత్తమా! నీ పరిపాలనా సామర్థ్యమున నా భార్యను దెచ్చి నాకు యిచ్చితివి. అందువలన నా నిత్య వైదిక కర్మలు శాస్త్రోక్తముగా జరుగుచున్నవి. అందువలన కృతార్థుడనైతిని " అని స్తోత్రములను జేసి-" రాజేంద్రా! నీ భార్య నీ సన్నిధిని లేకుండుట ధర్మముకాదు. నీ భార్యను అరణ్యమునకు పంపించివేసితివి. అందువలన ఆమెను అడవి మృగములు తినియుండునని లోకులును నీవును అనుకొనుచుందురు. అటుల జరుగుటయే యదార్థమయిన వేరొక భార్యను వివాహము జేసుకుని గృహస్థ ధర్మము కాపాడుము. నీవు విరక్తి గలిగియుండుట న్యాయము గాదు. పురుషులకు నిత్యకర్మలకు లోపము రాకుండునటుల రెండవ వివాహము యేర్పడియున్నవి. నీవు భార్య

లేకుండుటవలన ధర్మశాస్త్రములను తిరస్కరించినవాడ వగుదువు. స్త్రీలకు అగ్నిహోత్రాది నిత్యకర్మలు లేకుండుట వలన రెండవ వివాహము నిషేధింపబడియున్నది. పురుషుల కటులగాదు. ముఖ్యముగా భార్య సాన్నిధ్యము నందు నుండగా అగ్నిహోత్రాదులను జేయవలెనని అనేక విధములుగా శాస్త్రములు జెప్పుచున్నవి. రాజా! నీవు గృహస్థ ధర్మమును గాపాడుము" అని అనేక విధములుగా సుశర్మ జెప్పెను.

ఆ మాటలువిని రాజు-"ఓ విప్రపుంగవా! నా భార్య అరణ్యమునందు మృతిని పొందలేదు. పాతాళ లోకము నందు పాతివ్రత్య నియమమును జరుపుచున్నదని త్రికాలజ్ఞ మునిపుంగవుడు జెప్పియున్నాడు. ఆమె నాయందు అనుకూలముగా లేకుండుటచేతనే గదా ఈ విధముగా జరిగినది" అని జెప్పెను.

బ్రాహ్మణుడు—"రాజా! నీవు విచారమును పొందకుము. మిత్రవింద యను ఇష్టిని నీవు జేయుము. అటుల జేసిన నీ భార్య నీయందు అనురాగము గలిగి యుండును. యిష్టికి తగిన సంభారములను దెప్పింపుము. ఆలస్యము వలదు" అని జెప్పెను.

ఆ మాటలు రాజువిని మంత్రి పురోహితులను జూచి—"కావలసిన పదార్థములను దెప్పించవలసినది" అని జెప్పెను.

అంతట పదార్థములు రాగా సుశర్మ రాజేంద్రునిచే మిత్రవింద యను యిష్టిని యేడు పర్యాయములు జేయించెను. ఆ విధముగా యిష్టిని పూర్తిచేయించి—"రాజేంద్రా! యింక నీ భార్య నీ యందు యనురాగము గలిగి యుండును రప్పింపుము" అని జెప్పెను.

ఆ మాటలకు రాజు సంతోషించి బలాకుండను రాక్షసుని పిలిచి—"నా భార్య పాతాళలోకమునందు పాల పోతకుండను నాగరాజు గృహంబున నున్నది. నీవు వెంటనే వెళ్ళి ఆమె నిటకు తీసుకుని రమ్ము" అని జెప్పి రాక్షసుని పంపించెను.

బలాకుడు రాజు ఆజ్ఞను పొంది వాయువేగమున పాతాళలోకమునకు వెళ్ళి రాజు భార్యను తీసుకునివచ్చి రాజుముందు నిలిపెను.

ఆ ప్రకారము తన ముందున్న భార్యను రాజు జూచి సంతోషము పొంది—"ఓ మనోహరీ! నన్ను

పరిగ్రహింపుము. నీ వియోగమువలన నిత్యము పరితపించుచున్నాను " అని పలికెను.

ఆ మాటలను రాజు భార్య విని మహానందము పొంది—" రాజేంద్రా ! నీ యనుగ్రహము ఎప్పుడు కలుగునా యని నిత్యము శ్రీ మహాలక్ష్మీ నారాయణులను ప్రార్థించుచున్నాను. నా తప్పులను మన్నించి నన్ను అనుగ్రహింపుము " అని ప్రార్థించెను.

రాజేంద్రుడు మహానందము పొంది అన్యోన్య ప్రేమానురాగములు గలవారై గాఢాలింగనము జేసుకొనిరి. అంతట రాజుభార్య రాజుం జూచి—" రాజేంద్రా ! నాయందు నీకు ప్రేమగలిగియున్న, నా కొరకు దంద్రిచే శాపమును బొంది మూకభావము గలిగియున్న నందయను నాగకన్యకకు మూకత్వము పోవునటుల జేయవలసినది " అని కోరెను.

ఆ మాటలకు రాజు సంతోషమును పొంది సుశర్మచే సారస్వత యిష్టిని చేయించెను. అందువలన పాతాళలోకముననున్న నందయొక్క మూకత్వము పోయి మాట్లాడ దొడగెను. అచ్చట నున్నవారందరును ఆశ్చర్యమును పొందిరి.

నందకన్యక కర్ణుండను మునివలన, రాజు భార్య వలన తనకు మూకత్వము పోయినదని తెలుసుకుని భూలోకమునకు వచ్చి రాజును, రాజు భార్యను చూచి ప్రియవాక్యములను బలికి సంతోషముతో కౌగలించు కుని—" రాజేంద్రా! మీ యుభయులకు భూమండల మంతయు పరిపాలన జేయు బలపరాక్రమ సంపన్నుడైన కుమారుడు గలుగును. మీరు చాలా కాలము చిరంజీవు లయి సకల సౌఖ్యములను అనుభవించెదరు" అని ఆశీర్వదించి సర్వారిష్ట పరిహారమగు మాణిక్యమునిచ్చి పాతాళ లోకమునకు పోయెను.

రాజదంపతులు అన్యోన్య ప్రేమ గలవారై సకల సుఖంబులను యనుభవించుచుండగా కొంత కాలమునకు వృశ్చిక లగ్నమునందు అయిదు గ్రహములు ఉచ్ఛ స్థానములను పొంది గ్రహమాలికా యోగమునందు కుమారుడు గలిగెను. ఆ ప్రకారము పుట్టిన పుత్రునకు పుత్రోత్సవమును జేసి గోదాన, భూదాన, ద్రవ్యదానంబుల నిచ్చి బ్రాహ్మణులను పూజించి ఉత్తముడను నామధేయము జేయించెను. ఆ సమయమునందు గంధర్వులు ఆడిరి. దేవదుందుభులు మ్రోగెను. పుష్పవర్షము కురిసెను.

ఋషులు ఆశీర్వదించిరి. ఆ బాలుడు శుక్లపక్ష చంద్రుని విధముగా షోడశ కళాపూర్ణుండై సకల విద్యలను అభ్యశించి యవ్వనవంతుడు కాగా తల్లిదండ్రులు ఆనందము పొంది కుమారునకు పట్టాభిషేకము యధావిధిగా జరిగించి తాను భార్యాయుక్తముగా తపోవనంబునకు జనెను. ఉత్తముడు తల్లిదండ్రులవలన రాజ్యభారమును వహించి ధర్మమును నాలుగు పాదంబుల నడపుచు ప్రజలను సకల విధముల కాపాడుచు పాపులను శిక్షింపుచు రాజ్యమును పాలించుచుండెను. ఈ పరిపాలనము 'ఉత్తమ మన్వంతర' మని పిలువబడుచున్నది" అని మార్కండేయుడు జెప్పెను.

## ఉత్తమ మన్వంతరమున యింద్రాదులు

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"ఉత్తమ మన్వంతరమునందు సుధర్ములు, సత్యులు, శివులు, ప్రతర్ధనులు, వశవర్తులు అనువారు దేవతలు నూరు క్రతువులు జేసిన సుశాంతి అనువాడు యింద్రుడు, సుశాంతి మిగుల ధర్మబుద్ధి గలవాడు.

శ్లో॥ సుశాంతి దేవపాట్యాంతో న స్సుశాంతిం ప్రయచ్ఛతు
సహిత శ్శివసత్యా ద్యైస్త దైవవశ వర్తిభిః॥

అను శ్లోకమును జపించుచున్న ప్రజలకు కలిగెడు సకల అనర్థములు, అరిష్టములు నశించి సుఖమును పొందు చుండెడివారు. ఉత్తమునకు అజస్ర, పరిది, వ్యాదులను యేడుగురు పుత్రులు గలిగిరి. వారు తపోమహిమచేతను సుగుణములచేతను, సప్త ఋషులుగ నుండిరి. భూమండలమును పరిపాలించి మహాఖ్యాతిని పొందిరి.

## తామస మనువు పరిపాలనము

" అయ్యా క్రోష్టికీ ! నాలుగవదగు తామస మన్వంతరమును జెప్పుచున్నాను వినుము !

పూర్వము సురాష్ట్రుండను రాజు గలడు. అతడు అనేక యజ్ఞయాగాదులను జేసి యుద్ధములందు మహా శూరుడని ప్రఖ్యాతిని పొందియుండెను. అతని అమాత్యుడు నరసింహశర్మ యను పేరుగలవాడై, రాజభక్తి గలవాడై రాజునకు సకల విధముల కుడిభుజమువలె సహాయము జేయుచు తృప్తిని జెందక సూర్యుని ఆరాధించి తపంబు జేయగా సూర్యుడు ప్రత్యక్షమై 'వరమును కోరవలసినది' అని జెప్పెను.

మంత్రి సంతోషించి సూర్యుని అనేక విధములుగా స్తోత్రములను జేసి—" మహాత్మా ! మా రాజునకు అమిత ఆయువును యివ్వవలసినది " అని కోరెను.

సూర్యుడు ఆ వరమును యిచ్చి అదృశ్యుడయ్యెను. మంత్రి రాజువద్దకు వచ్చి జరిగిన సంగతి తెల్పెను.

ఆ రాజు మంత్రివలన వరమును తెలుసుకుని ధర్మ యుక్తముగా ప్రజాపాలనము జేయుచుండెను. ఆ రాజునకు అమిత ఆయువ గలిగి, భార్యలకు లేకపోవుటచేత ఆ రాజునకు అనేక వందలమంది కళత్రములు గతించి పోయినవి. అందువలన రాజునకు రాజ్యమునందు విరక్తి గలిగి రాజ్యమును మంత్రి సత్తమునకు వప్పగించి అడవికిపోయి గ్రీష్మకాలమునందు పంచాగ్నియందును, వర్షాకాలమునందు వెల్లడి ప్రదేశమునందును, శీతాకాలము నందు కంఠగతజలమునందును నిలుచుండి తపంబు జేయుచుండెను.

ఆ ప్రకారము తపము జేయుచుండగా కొంత కాలమునకు వర్షాకాలము వచ్చెను. ఆకాశము మేఘా వృతమై ఝంఝూనిలముతో కూడుకొని వర్షము కురియ దొడగెను. అందువలన భూమి అంతయు జలమయమయి

ప్రవహింప దొడగెను. ఆ జలప్రవాహమువలన రాజు కొట్టుకొని పోవుచుండెను.

ఆ విధముగా జలప్రవాహమున కొట్టుకొనిపోవు రాజునకు ఒడ్డునకు జేరుటకు ఆధారము యేమియు లేక పోవుచుండగా ఆ ప్రవాహమునందు యీదుకొని పోవు చున్న లేడి ఆధారముగా రాజు చేతికి దొరకెను. రాజు ఆ లేడి సహాయమున సమీపమునందు గల అడవికి జేరుకుని ఆ లేడిని తన చేతితో దువ్వుచు ఆడలేడి అని తెలిసియుండియు, దానియందు మోహముగలవాడై — "ఓ మృగరాజమా ! నా మనము నీయందు మోహమును గలుగ జేయుటకు కారణము తెలియుటలేదు" అని పలికెను.

ఆ మాటలకు రాజును జూచి లేడి పలుకుచున్నది. "ఓ రాజా ! నేను దృఢధన్వుడను రాజు కుమార్తెను. నీ గతించిన అనేక మంది భార్యలలోను నేను మొదటి భార్యను. నా పేరు ఉత్పలమాల యందురు" అని జెప్పెను.

అంతట రాజు— "ఓ తరుణీ ! నీకు ఈ మృగ జన్మ వచ్చుటకు కారణమేమి ?" అని యడిగెను.

" రాజా! నేను ఆ ధృఢధన్వుని వంశమునందు పుట్టి పూర్వజన్మ జ్ఞానము గలదాననై చెలికత్తెలతో వనమునందు తిరుగుచుండగా ఒక మునికుమారుడువచ్చి- " ఓ రాజకన్యకా! నన్ను వివాహమాడుమ "ని కోరెను.

అందులకు నేను—" మునిపుత్రా! నేను రాజకుమార్తెను. నీవు మునిపుత్రుడవు, గావున నీ వంశమువందు జన్మించిన బ్రాహ్మణ కన్యను వివాహమాడి సుఖింపుము " అని పలికితిని.

ఆ మాటలు మునిపుత్రుడు విని కోపముగలిగి— " నీవు ఆడ లేడివై తిరిగెదవుగాక " అని శాపవాక్యములను పలికెను.

ఆ మాటలకు మేము భయముజెంది—" ఓ మునిపుత్రా! మా అజ్ఞానమును క్షమించి శాపవిముక్తిని జెప్పవలసినది " అని ప్రార్థించితిమి.

ఆ మాటలకు మునిపుత్రుడు దయగలిగి—" ఓ రాజకన్యకామణీ! నీవు మృగమై తిరుగుచుండగా అవాంతర ప్రళయమున నీవు నీటి ప్రవాహమునందు కొట్టుకొని పోవుచుండగా, నీకు పూర్వజన్మమునందు భర్త అయిన

సురాష్ట్రుండును ఆ ప్రవాహమునందే కొట్టుకొని వచ్చుచు న్నన్ను ఆధారముగా బట్టుకొని ఈదుచు యిరువురు గట్టునకు చేరుదురు. ఆ సమయమున నీకు పూర్వస్మృతిగలిగి రాజు యందు నీకును, నీయందు రాజునకును మోహములు గలుగును. అప్పుడు రాజు నీ కంఠమును కౌగలించుకొనిన నీవు మానవ రూపమును పొంది ఆ రాజును వివాహమాడి సర్వసుఖంబులను పొందుదువు. కొంతకాలమునకు నీ గర్భంబున తామసుండను మనువు జన్మించును " అని చెప్పెను. కావున రాజా! నీవు నా కంఠమును కౌగలించు కొనుము " అని పలికెను.

రాజు ఆ మాటలను విని సంతోషమును పొంది లేడి కంఠమును కౌగలించుకొనగా ఆమె లేడిరూపమును వదిలి మానవతియై ప్రకాశించుచుండెను. ఆ రాజు క్రిందటి జన్మమునందు తన భార్య అయిన ఉత్పలమాల యని తెలుసుకుని ఆమెను తీసుకుని తన రాజధానికివచ్చి జరిగిన సర్వవృత్తాంతమును మంత్రులు మొదలగువారికి జెప్పి భార్యతో కూడా సర్వసుఖములను పొందుచుండెను.

యీ విధముగా చాలాకాలము జరిగిన పిమ్మట రాజు భార్య గర్భవతియై మంచి లగ్నమునందు పుత్రుని

గనెను. రాజు పుత్రోత్సవాదులను జేసి కుమారుని అతి గారాబముగా పెంచుచుండగా ఆకాశవాణి—"ఓ రాజా! నీ పుత్రుడు తామసుండను మనువు నామమును పొంది గొప్ప ప్రఖ్యాతిని గాంచున "ని పలికెను. నాటినుండియు తామస మనువని పిలువబడుచుండెను. తామసుడు సకల విద్యలను అచిరకాలముననే అభ్యసించి శ్రీ సూర్య నారాధించి సకల అస్త్రశస్త్రములను బడసెను. తల్లిదండ్రులు ఈ వరమును కుమారునివలన తెలుసుకుని పుత్రునకు రాజ్యమును వప్పగించి తాము తపోవనంబునకు జనిరి. అనంతరమునందు తామసుడు సకల ప్రపంచకమును జయించి తామస మనువని ప్రఖ్యాతిని పొందెను.

## తామస మన్వంతరమున యింద్రాదులు

తామస మన్వంతరమునందు రాసాహులు, హరులు, సత్యులు, స్వరూపహృదయులు ననువారు దేవతలు నూరు యజ్ఞములను జేసిన శిబిచక్రవర్తి యింద్రుడు, జ్యోతిర్ధాముడు, పృథుడు, కావ్యుడు, చైత్రుడు, అగ్ని, వనకుడు, పీవరుడు ననువారు సప్తఋషులు నర, ఖ్యాతి, శాంతి, క్షయ, జాను, జంఘాదులు మనుపుత్రులుగ ప్రసిద్ధిని పొందిరి " అని జెప్పెను.

# రైవత మన్వంతరము

మార్కండేయుడు క్రోష్టికికి రైవత మన్వంతరమును జెప్పుచున్నాడు—

" పూర్వము ఋతవాక్కను మునిపుత్రుడు తనకు చాలాకాలము వరకు సంతానము గలుగనందున విచారమును పొంది సూర్యునారాధించగా సూర్యుని వరము వలన రేవతీ నక్షత్రము నాలుగవ పాదమున ఒక్క కుమారుడు పుట్టెను. ఆ బాలునకు జాతకర్మాదులుజేసి విద్యాభ్యాసమును చేయించుచుండెను. గాని ఆ కుమారుడు జ్ఞానములేక వెఱ్ఱివానివలె తిరుగుచుండెను. తల్లిదండ్రులు వ్యాధిగ్రస్తులయి బాధలను పొందుచుండిరి. ఒకనాడు తల్లిదండ్రులు కుమారుని జూచి అనేక విధములుగా నీతులను జెప్పినను వినక తిరుగుచుండుటను జూచి తండ్రి యిటులని విచారింప దొడగెను—" పుత్రః శత్రుః అపండితః " అనునట్లు చదువులేని కుమారుడు తండ్రికి శత్రువేగదా? సుగుణ సంపత్తిగల పుత్రునివలన తల్లిదండ్రులకు పుణ్యలోకములు కలుగునుగాని, దుర్మార్గ

గుణములుగల పుత్రునివలన నరకమే సంభవించును ” అని విచారించి ఒకనాడు గర్గమునివద్దకు వెళ్ళి—“ ఓ గర్గ ముని శ్రేష్ఠా! నేను బ్రహ్మచర్యాశ్రమమునందు వేద వేదాంగముల నభ్యసించి గృహస్థాశ్రమము పొందితిని. పిమ్మట సూర్యు నారాధించి పుత్రుని బడసితిని. వాడు రేవతీ నక్షత్ర నాలుగవ పాదమున బుట్టెను. గాని తల్లి దండ్రుల పాపముచేతనో, బంధుజనుల పాపముచేతనో వాడు మూర్ఖుడయి తిరుగుచున్నాడు. మేము వ్యాధిగ్రస్తుల మైతిమి. దానికి కారణ మేమిగలదో జెప్పవలసినది ” అని అడిగెను.

గర్గుడు జెప్పుచున్నాడు—“ మునిపుంగవా! రేవతీ నక్షత్ర నాలుగవ పాదమున నీకు పుత్రుడు కలిగెను. పుట్టిన నక్షత్రదోషమున వాడు మూర్ఖుడు అయ్యెను. అది నక్షత్ర దోషముగాని వేరుగాదు ” అని జెప్పెను.

ఋతవాక్కు ఆ మాటలను విని కోపముగలిగి— “రేవతీ నక్షత్రము ఆకాశమునందు నుండి వీడి భూమి మీద బడిపోవుగాక ” యని శపించెను.

అంతట ఆ నక్షత్రము అందరును జూచుచుండగా తెగి భూమిమీద పడిపోయెను. ఆ ప్రదేశము గుముద పర్వతము. ఆ కారణమున ఆ పర్వతమునకు రైవతక పర్వతమని పేరు గలిగెను. ఆ పర్వతమునందు పద్మములచే నిండియున్న కొలను గలదు. ఆ కొలనుయందు గల పద్మములలో ఒక పద్మమునందు రేవతీ నక్షత్రము కన్యక అయి పుట్టెను. ఆ కన్యను ప్రముచుఁడను ముని జూచి తన ఆశ్రమమునకు తీసుకొనివచ్చి పెంచుచుండెను. ఆమె పేరు రేవతి యని పేరుపెట్టి పిలుచుచుండెను.

యిటులుండగా కన్యకకు వివాహయోగ్య కాలము రాగా పిల్లకు దగిన వరుడు ఎచ్చట గలడని విచారించి అగ్నిని ప్రార్థించెను.

అగ్నిదేవుడు—" దుద్ధముడను రాజు నీ ఆశ్రమమునకు వచ్చి నీ రేవతి కన్యను వివాహము ఆడును" అని జెప్పెను.

యిటుల నుండగా కొంతకాలమునకు ప్రియంవద వంశ సంభూతుడైన దుద్ధముడను రాజు ప్రముచు నాశ్రమమునకు వచ్చి అచ్చటనున్న కన్యను జూచి-" నీ తండ్రికి నమస్కరించుటకు వచ్చితిని. నేను దుద్ధముడను రాజును" అని జెప్పెను.

ఆ మాటలను అగ్నిశాలయందున్న ప్రముచ ముని విని బయటకువచ్చి—" ప్రియంవద వంశోద్భవా ! నిన్ను జూచి చాలాకాలము అయినది. నీవు నాకు అల్లుడవు" అని జెప్పి రాజునకు అర్ఘ్యమును యిచ్చెను.

అర్ఘ్యమును పుచ్చుకుని రాజు—" అయ్యా ! ప్రముచ ముని ! నేను నీకు ఎటుల అల్లుడనైతిని ?" అని యడిగెను.

ఆ మాటలకు ప్రముచముని జెప్పుచున్నాడు— " అయ్యా ! రాజోత్తమా ! త్రిలోకసౌందర్యముగల రేవతీ కన్యను నీకు భార్యగా వివాహము జేయదలచితిని" అని జెప్పెను.

ఆ మాటలు విని రాజు—" మునివర్యా ! సుభద్ర, శాంత తనయ, కావేరీ తనయా, సురాష్ట్రజ, సుజాత, కదంబ, వరూధిని, విరూధిని, విశాల, నందిని అను పది మంది నాకు భార్యలు గలరు. రేవతి యను కన్యను నేను జూచి యెరుగను " అని జెప్పెను.

" రాజా ! నీవు నా ఆశ్రమమునకు వచ్చి ప్రశ్నించిన కన్యకయే రేవతి. ఆ రేవతిని నీకు యిచ్చి వివాహము జేయ వలపినదని అగ్నిదేవుడు జెప్పియున్నాడు" అని జెప్పెను.

ఆ మాటలను రేవతికన్యక విని—" తండ్రీ ! నన్ను యీ రాజునకు యిచ్చి వివాహము జేయునెడల రేవతీ నక్షత్రమునందే వివాహము జేయవలసినద "ని జెప్పెను.

మునిపుంగవుడు కన్యావరుల కోరిక ప్రకారము రేవతీ నక్షత్రమును తన తపోమహిమచేత ఆకాశ మార్గమున నిలిపి రేవతీ నక్షత్రమునందు మంచి లగ్నమున రేవతీ దుర్గమ వధూవరులకు వివాహముజేసి అల్లుని జూచి " ఓ జామాతా ! నీకు కావలసిన వరమును కోరుము " అని జెప్పెను.

ఆ మాటలకు రాజు సంతోషమును పొంది—" ముని చంద్రమా ! నేను స్వాయంభువు మనువుయొక్క వంశము నందు బుట్టితిని. కావున ఈ మన్వంతరమున అధిపతి కాగల పుత్రుడు ఈ రేవతియందు బుట్టునటుల ఆశీర్వ దించవలసినది " అని కోరెను.

## రైవత మనువు జననము

మార్కండేయుడు ఇలా జెప్పుచున్నాడు —" క్రోష్టికీ ! ప్రముచ మునిపుంగవుడు తన జామాత దుర్గమ భూపతి కోరిన ప్రకారము—" ఓ రాజా ! నీకు ఈ రేవతీ గర్భము

నందు శౌర్య, ఔదార్య, బల, సుగుణ సంపన్నుడును, సకలవిద్యా పారంగతుడున్ను, సకల ధర్మశాస్త్ర పరిజ్ఞానము గలవాడున్ను, భూమండలమును పరిపాలనము జేయగల రైవతమనువు అను ప్రఖ్యాతి పొందగల కుమారుడు పుట్టును " అని ఆశీర్వదించెను.

ఆ ఆశీర్వచనమును దుద్ధమరాజపుంగవుడు పొంది మహానందము నొంది రాజు తన భార్య రేవతిని తీసుకుని తన రాజధానికి వచ్చి సర్వసుఖములను పొందుచుండెను. పిమ్మట కొంత కాలమునకు రేవతియందు రైవతుడు పుట్టెను. రాజు పుత్రజననమును విని మహానందమును పొంది పుత్రోత్సవాదులను జేయించి, జాతకర్మను జేయించి 'రైవతుడు' అను పేరును పెట్టెను. ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడై సకల శాస్త్రములను అభ్యసించి అఖిల విద్యా పారంగతుడని ప్రఖ్యాతినిపొంది సకల జన సమ్మతముగా సంచరించుచుండెను. అటుల సంచరించు పుత్రుని తల్లిదండ్రులు జూచి సంతోషమును పొంది కుమారునకు రాజ్యము పట్టాభిషేకము జేయించి తాము తపంబునకు బోయిరి. రైవతుడు ధర్మయుక్తముగా వసుంధరా పరిపాలనము జేయుచు శత్రురాజుల మదముల నణచి 'రైవత మనువు ' అని ప్రఖ్యాతిని పొందియుండెను.

## రైవతమను కాలమునందు యింద్రాదులు

క్రోష్టికీ: ఆ కాలమునందు సుమేధస్సులు, భూత రజస్సులు, వైకుంఠులు, సమితాభులు అను నాలుగు గణముల దేవతలు ప్రసిద్ధిని పొందియుండిరి. నూరు యజ్ఞములను జేసిన విగుడు అనువాడు ఇంద్రుడు. హిరణ్యరోముడు, దేవరి, యూర్ధ్వబాహుడు, వేదబాహుడు, సుధామ, పర్జన్యుడు, వశిష్టుడు అనువారు సప్తఋషులుగ నుండిరి. బలబంధు, మహావీర్యుడు, సుయష్టవ్యుడు, కావ్యుడు, సత్యకుడు మొదలగు పుత్రులు భూమిని పరిపాలనము జేయుచుండిరి. స్వారోచిషుడుగాక తక్కినవారు స్వాయంభువ వంశమువారు.

## చాక్షుష మన్వంతరము

క్రోష్టికీ: ఆరవదియగు చాక్షుష మన్వంతరమును జెప్పుచున్నాను వినుము:

పూర్వము అనమిత్రుండను రాజు గలడు. అతడు గొప్ప వంశమునందు పుట్టినవాడు. అతనికి గిరి భద్ర యను భార్య గలదు. అనమిత్రునకు తన భార్య గిరి భద్రయందు కుమారుడు గలిగెను. ఆ పుత్రునివైపు తల్లి జూడగానే పుత్రుడు పకపక నవ్వుటకు ప్రారంభము జేసెను. అదిచూసి తల్లి—"పుత్రా! నీవు నవ్వుటకు కారణమేమి? నిన్ను జూచిన నాకు భయము గలుగుచున్నది" అని యడిగెను.

ఆ మాటలకు బాలుడు యిలా జెప్పుచున్నాడు—"అమ్మా! నన్ను తీసుటకు మృత్యువు పొంచియున్నది. నీవు ఆ సంగతి తెలుసుకొనక నన్ను ముద్దులాడు చున్నావు" అనెను.

తల్లి ఆ మాటలను విని ఆశ్చర్యమును పొంది సూతికా గృహమును వదలి వెడలిపోయి ఈ వింత రాజునకు వర్తమానము జేసెను.

వెంటనే ఆ బాలుని జాతహారిణి ఎత్తుకొనిపోయి విక్రాంతుడను రాజు భార్య ప్రసవించియుండగా ఆ శయ్య యందు యీ బాలుని ఉంచి ఆ శయ్యయందువున్న బాలుని భక్షించి వెడలిపోయెను. విక్రాంతుడు ఆ బాలునికి

పుత్రోత్సవాదులను జేసి పెంచుచుండెను. ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడై తల్లి దండ్రులను జూచి—" మీరు నాకు తల్లిదండ్రులుగారు. నేను అనమిత్రుండను రాజునకు గిరిభద్రయను భార్యకు జన్మించితిని. నన్ను జాతహారిణి యను మృత్యుదేవత దెచ్చి యిచ్చట నుంచి మీ బాలుని తిని వెడలిపోయెను. గాన నేను తపంబునకు పోవుదును" అని జెప్పి అడవికి తపంబుజేయుటకు వెడలిపోయెను.

ఆ బాలుని తపంబునకు బ్రహ్మ మెచ్చి ప్రత్యక్షమై వరంబులను కోరవలసినదని జెప్పెను.

అంతట బాలుడు—" ఓ చతురాననా ! నాకు ఆత్మ శుద్ధి గలుగునటుల వరములను యివ్వవలసినది " అని కోరెను.

ఆ మాటలకు బ్రహ్మ యిటులని జెప్పెను— " ఓ రాజపుత్రా ! నీవు ఆరవ మన్వంతరమున అధిపతివి కాగలవు. నీవు పూర్వము నా నేత్రమునుండి పుట్టితివి. అందువలన చాక్షుషమనువని ప్రఖ్యాతిగలవాడవై భూ పరి పాలనంబుజేసి ముక్తిని పొందుదువు " అని వరంబుల విచ్చి అదృశ్యుడాయెను.

రాజపుత్రుడు బ్రహ్మవలన వరంబులను పొంది, తల్లిదండ్రులయిన అనమిత్ర గిరిభద్రలవద్దకు వచ్చి సాష్టాంగ నమస్కారములను జేసి తన జనన వృత్తాంతమును, బ్రహ్మ యిచ్చిన వరంబులను జెప్పెను. ఆ మాటలకు తల్లిదండ్రులు సంతోషమును పొంది రాజ్య భారమును కుమారునకు వప్పగించి తపంబునకు పోయిరి.

చాక్షుసుండు తల్లిదండ్రులవలన రాజ్యభారమును పొంది యుగ్రుండను రాజపుత్రికను వివాహమాడి ఆమె యందు బలశౌర్యాదులుగల అయిదుగురు పుత్రులం బడసి 'చాక్షుసమను' వని ప్రసిద్ధిని పొందెను.

## చాక్షుష మన్వంతరమున యింద్రాదులు

ఆప్యులు, ప్రభూతులు, భవ్యులు, పృథగులు, లేఖులు ననువారు దేవతలు నూరు యజ్ఞములు జేసిన మనోజవుండు ఇంద్రుడు. సుమేధస్సు, విరజస్సు, హవిష్మంతుడు ఉన్నతుడు, మధువు, అతిసహిష్ణువు అనువారు సప్త ఋషులు. నూరువు మొదలగువారు మనుపుత్రులు భూమిని పాలించిరి.

క్రోష్టికీ! యీ ఆరవ మనువు వృత్తాంతమును జెప్పితిని. ముందు జరుగవలసిన వైవస్వత మన్వంతర వృత్తాంతమును జెప్పుచున్నాను" అని మార్కండేయుడు జెప్పెను.

ఆ మాటలకు క్రోష్టికి—"మహాత్మా! నేను సంతోషమును పొందితిని. జరుగవలసిన మన్వంతరములను కూడా జెప్పవలసినది" అని కోరెను.

గద్య : ఇతి శ్రీ వేమూరి సూర్యనారాయణ సిద్ధాంతివర్య
గురుకటాక్ష లబ్ధ శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వర వర
ప్రసాద యజుర్వేద తైత్తిరీయ శాఖాధ్వర అపస్తంబ
సూత్ర గౌతమగోత్ర పవిత్ర వోలేటి వంశ పయః
పారావార రాకాసుధాకర సంజీవరాయామాత్య
పౌత్ర రామయామాత్య తృతీయ పుత్ర
బుధజన విధేయ వెంకట లక్ష్మీ
నృసింహశర్మ ప్రణీత ఇతిహాస
గ్రంథమున మార్కండేయ
పురాణ మను తెలుగు
వచన కావ్యమున
ద్వితీయాశ్వాసము
శ్రీ రాజరాజేశ్వరీ సోమలింగేశ్వరార్పణమస్తు.



శ్రీ ర స్తు

శ్రీ రాజరాజేశ్వరాయనమః

# మార్కండేయ పురాణము

## వచనం - తృతీయాశ్వాసము

క్రోష్టికి మార్కండేయ మహామునిని జూచి—" మహాత్మా, మార్కండేయా! నీవలన భూత స్వర్గమును, చాక్షుస మన్వంతరములను విని సంతోషమును బొందితిని. జరుగు చున్న జరుగవలసిన వైవస్వతాది మన్వంతరములను గూర్చి జెప్పవలసినది " అని కోరెను.

ఆ మాటలు మార్కండేయుడు విని—" క్రోష్టికీ! యీ మన్వంతరములను గూర్చి వినుట ముఖ్యము. ఈ ఉపాఖ్యానము ప్రమాణ గ్రంధము. అందువలననే

శ్రీ వ్యాసమహాఋషి పురాణములను వ్రాయు నపుడు ఇటుల ప్రతినబూని జెప్పియున్నాడు.

సీ॥ ఆయురర్థులకు దీర్ఘాయవాప్తియు నర్థార్థులకు విపులార్థములును ధర్మార్థులకు నిత్యధర్మ సంప్రాప్తియు వినయార్థులకు మహావినయమతియు బుత్రార్థులకు బహు పుత్ర సమృద్ధియు సంపదర్థుల కిష్ట సంపదలును గావించు నెప్పుడు భావించి వినుచుండు వారికి నిమ్మహా భారతంబు భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ వల్లభుండు భక్త వత్స లుండు భవభయంబులెల్ల బాపి యిష్టార్థ సంసిద్ధి గరుణ తోడ జేయుచుండు॥

అని జెప్పియున్నాడు. కావున "ఓ క్రోష్టికీ! ఈ పురాణమును యెవరు భక్తిగలిగి పఠించెదరో వారికి మనోరథంబులు నెరవేరును. వారికి కలిదోషము దగ్గరకు రాదు. అందువలన మనువుల వృత్తాంతమును జెప్పు చున్నాను శ్రద్ధగా వినుము!"

## శ్రీ సూర్యదేవుని వృత్తాంతము

క్రోష్టికీ! శ్రీ సూర్యదేవునకు విశ్వకర్మ కుమార్తెయగు సంజ్ఞాదేవి యను భార్యయందు వైవస్వతుండను

యముండును, యమున యను కుమార్తెయు బుట్టిరి. తరువాత సంజ్ఞాదేవి సూర్యుని వేడిమిని భరింపజాలక తన ఛాయను కాంతగా నిర్మించి—"తరుణీ! నీవు నావలెనే నా మగని ఆరాధింపుచుండుము" యని నియమించి తాను ఆడగుఱ్ఱము రూపమును ధరించి ఘోరమగు తపంబు జేయుచుండెను.

ఛాయాదేవియు పతి శుశ్రూషను జేయుచుండగా కాలక్రమమున పుత్రులం గనెను. తన సంతానమును, సంజ్ఞాదేవి సంతానమును వ్యత్యాసముగా జూచుచుండెను. యముడు యీ భేదభావమును గనుగొని కోపముగలవాడై తల్లిని పాదముతో తన్నెను. అంతట ఛాయకు కోపము వచ్చి—"దుర్మార్గా! నన్ను తన్నితివి గావున నీ పాదము కృశించిపోవునుగాక" యని శాపమును యిచ్చెను.

అంతట యముడు భయము గలవాడై తండ్రి వద్దకువెళ్ళి—"తండ్రీ! ఈమె మా తల్లికాదు. మా తల్లి అయిన కొడుకులను ఇటుల శపించునా?" యని పలికెను.

సూర్యుడు ఆ మాటలను విని కుమారుల నూరార్చి తన జ్ఞానదృష్టిని సర్వమును దెలుసుకుని మహావేగమున త్వష్టప్రజాపతివద్దకు వెళ్ళి జరిగిన వృత్తాంతమంతయును

తెలిపి—"ఓ దేవోత్తమా! నా తేజంబు చూచుటకు శక్యముగాకయున్నది. గాన తగ్గింపుమ"ని కోరెను.

ఆ విశ్వకర్మ సమ్మతించి శాకద్వీపమునకు జని సూర్యుని తేజంబులో పదునైదు భాగములు వేడిమి సాన బట్టి తగ్గించివేసెను. సానబెట్టినప్పుడు పుట్టిన రజంబువలన విష్ణువునకు చక్రంబును, శివునకు త్రిశూలంబును, వసువులకు శంఖంబులను, ఆయుధంబులను, అగ్నికి, దేవికీ, కుబేరునకు రథంబులను, దేవతలకు ఆయుధంబులను నిర్మించి యిచ్చెను.

సూర్యునియందు వేడిమి పదియారవ భాగము మాత్రమే నిలచియుండెను. సూర్యుడు తన తేజంబును తగ్గించుకొని తాను అశ్వరూపమును పొంది బడబా రూపమున దపంబు జేయుచున్న సంజ్ఞాదేవికడకు వెళ్ళి దాని ముఖమును అఘ్రాణము జేసెను. ఆ ముఖంబున అశ్వినీ దేవతలు పుట్టిరి. పిదప రేతః పతనము కాగానే రేవతుండనువాడు పుట్టి శస్త్రాస్త్రములను ధరించి అశ్వము నెక్కి తల్లితండ్రులకు నమస్కరించి నిలుచుండెను. అంతట సంజ్ఞాదేవియు, సూర్యుడును నిజ స్వరూపములను దాల్చి కుమారుని దీవించి వెంటబెట్టుకుని స్వస్థానమునకు వెళ్ళిరి.

కొన్ని దినంబులకు సూర్యుడు తన కుమారులను, కుమార్తెలను పిలచి ప్రథమ పుత్రునకు వైవస్వతమనువని పేరుపెట్టెను. యముని పిలిచి నీవు దక్షిణదిక్కునకు అధిపతివై యుండుమని జెప్పెను. యమున యను కూతురును జూచి నీవు నదీరూపమున ప్రవహించుచు గాళిందీ నదితో కలయుచుండుమని జెప్పెను. అశ్వనీ దేవతలను జూచి మీరు దేవతలకు వైద్యులుగ నుండుడని జెప్పెను. రేవతుని జూచి నీవు గుహ్యక గుణములకు రాజుగ నుండుమని జెప్పెను. ఛాయా ప్రథమపుత్రుని సావర్ణి మనువుగను, రెండవ పుత్రుడు శనైశ్చరుని గ్రహ మధ్యవర్తిగను, త్రపతియను కన్య సంవరణుండను రాజును పరిణయమగునటుల నియమించెను.

## వైవస్వత మన్వంతరమున యింద్రాదులు

ఈ వైవస్వత మనువు కాలమున ఆదిత్యులు, వసువులు, రుద్రులు, సాధ్యులు, విశ్వులు, మరుత్తులు, భృగువులు, అంగీరస్సులు అను పదునెనిమిది గణములు దేవత లగుదురు. ఆదిత్యులు వసువులు రుద్రులు కశ్యపుని సంతతి వారు. సాధ్యులు మరుత్తులు విశ్వులు ధర్మపుత్రులు.

భృగువులు భృగుపుత్రులు అంగీరస్సులు అంగీరసపుత్రులు. ఓజస్వియను మహాత్ముడింద్రుడు. అత్రి, వశిష్ట, కస్యప, గౌతమ, భరద్వాజ, విశ్వామిత్ర, జమదగ్నులు సప్తఋషులు. ఇక్ష్వాకు, నాభాగ, దృష్ట, శర్యాతి, కరూష, వృషధ్రు, వసుమంతు అనువారు మనుపుత్రులు భూమిని పాలించెదరు " అని మార్కండేయులు జెప్పెను.

ఆ మాటలను క్రోష్టికి విని మహానందమునుపొంది "మహాత్మా! మార్కండేయా! సావర్ణాది మన్వంతరముల జరుగు విషయంబులను జెప్పవలసినది " అని కోరెను.

## సావర్ణి మన్వంతరము

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"క్రోష్టికీ! మహామాయా ప్రభావములచేత మన్వంతరమున అధిపుండగు సావర్ణి స్వారోచిష మన్వంతరమున, చైత్రవంశమునందు పుట్టిన సురథుండను రాజు కోసల రాజ్యమును పాలించెను. కొంతకాలమునకు రాజ్యమును గోలుపోయి రహస్యముగా యేకాకియై తపోవనమునకు జనెను. అచ్చట మేధస్సు అనువానిం జూచి వానితోగలసి సమీపమునందు తపంబు జేయుచున్న మునిపద్దకు వెళ్ళి—" మహాత్మా! నేను

క్షత్రియుడను, యితడు వైశ్యుడు. నేను రాజ్యమును జేయుచు రాజ్యమును భార్యాపుత్రాదులను విడిచి వచ్చినను నాకు మోహము మాత్రము విడచుటలేదు. అందులకు కారణమును జెప్పుడు! అదియుంగాక యీ వైశ్యుడు బంధువులచేతను, భార్యాపుత్రాదులచేతను వెడలగొట్టబడియు వారియందు ఈ వైశ్యునకు మోహము మాత్రము విడువ లేక విచారించుచున్నాడు. అందులకు కారణమేమి గలదు?" అని అడిగెను.

మునీంద్రుడు ఇలా జెప్పుచున్నాడు—"ఓ రాజా! లోకమునందు అనేక విధములగు జంతువులు గలవు. వాటిలో కొన్నిటికి పగటియందును, కొన్నిటికి రాత్రి యందును, కొన్నిటికి సంధ్యాకాలమును సమముగ దృష్టి గలిగి యుండును. మనుష్యులు సమదృష్టిగలిగి అధిక మగు జ్ఞానమును గలిగియుండియు విష్ణుమాయచే మోహము పొంది సంసారమునందును, దారాపుత్రాదు లందును భ్రాంతి గలిగియుందురు. బొమ్మలను ఆడించు సూత్రకారకుడు ప్రతి విషయమునందును బొమ్మలను మార్చుచుండునటుల ఈ జగము అంతయును ప్రకృతి యను మహామాయచేత ఆడింపబడుచుండును" అని జెప్పెను.

అంతట రాజు-"మహాత్మా! మాయాశక్తి ఎవ్వరు? ఆ దేవి వృత్తాంతమును జెప్పవలసినది" అని అడిగెను.

ముని జెప్పుచున్నాడు—"రాజేంద్రా! ఆ దేవి నిత్యమై ప్రపంచకమునంతను ఆవరించి యుండును. అయినను దేవతలకు హాని కలుగజేయు దుర్మార్గులు అధిక మగునప్పుడు దుష్టసంహారమునకు పుట్టుచుండును. ఆ విషయమును జెప్పుచున్నాను. ఒకప్పుడు శ్రీ మహా విష్ణువు ప్రపంచకమంతయు జలార్ణవమయియున్న సమయమునందు మఱ్ఱి ఆకున పరుండి యోగనిద్రను చెందుచుండెను. అతని చెవులనుండి మధుడు, కైటభుడు అను యిద్దరు రాక్షసులు పుట్టిరి. నాభికమలమునందు నివశించి యున్న బ్రహ్మను జూచి వారు—"నీ వెవరవు" అని అడిగిరి.

ఆ మాటలకు బ్రహ్మ—"నేను బ్రహ్మను. యీ ప్రపంచకమంతయు పుట్టించు సృష్టికర్తను. నేను విష్ణు పుత్రుడను" అని జెప్పెను.

ఆ వాక్యములను మధుకైటభులు విని—"మేము విష్ణుపుత్రులముగాని నీవు కావు. నిన్ను మ్రింగెదము" అని పలికిరి.

ఆ మధుకైటభుల మాటలను బ్రహ్మవిని భయము గలవాడై శ్రీ విష్ణుదేవుని నేత్రములను ఆవరించియున్న యోగనిద్రను ప్రార్థించెను. అప్పుడు శ్రీ విష్ణుని ముఖము నేత్రములు, నాశిక, బాహువులు, హృదయములనుండి మాయాశక్తి పుట్టి ప్రపంచకమంతయు ఆవరించి బ్రహ్మ యెదుట నిలుచుండెను. అంతట మహావిష్ణువు యోగ నిద్రను జాలించి బ్రహ్మను మ్రింగుటకు యత్నించుచున్న మధుకైటభులను నివారించి యిది తగదని చెప్పెను. ఆ మాటలను మధుకైటభులు విని విష్ణునిమీదకు యుద్ధమునకు వచ్చిరి. శ్రీ మహావిష్ణువు మధుకైటభులతో యుద్ధము జేయుటకు ప్రారంభము జేసెను.

యీ విధముగా అయిదువేల సంవత్సరములు శ్రీ మహావిష్ణువు మధుకైటభులతో యుద్ధమును జేసియు జయించలేక సంతోషము గలవాడై—"ఓ మధుకైటభులారా! మీ బలశౌర్యాదులకు సంతోషమును పొందితిని. మీకు కావలసిన వరంబులను కోరుడు" అని పలికెను.

ఆ మాటలు దుర్మార్గులయిన రాక్షసులువిని విషపు నవ్వు నవ్వి—"ఓ విష్ణూ! నీవు మాతో యుద్ధముజేసి

జయించ లేక యోడిపోయినవాడవు. నీవు మాకు వరము లను నిచ్చుటా? చాలు-చాలు. నీకే మేము వరములను నిచ్చెదము కోరుకొనుము " అని పలికిరి.

ఆ మాటలు విష్ణువువిని సంతోషించి—" ఓ మధు కైటభులారా! మీరు యిద్దరును నాచేత జచ్చునట్లు వరమును యివ్వవలసినది " అని చెప్పెను.

## శ్రీ మహావిష్ణువు మధుకైటభులను సంహరించుట

మధుకైటభులు ఆ మాటలు విని—" ఓ విష్ణూ! మేము నీ కోరిక నెరవేర్చుటకు సందియము లేదుగాని, నీవు మమ్ములను నీరుగాని, భూమిగాని లేని స్థలమునందు వధింపుము " అని జెప్పిరి.

ఆ మాటలను శ్రీ నారాయణుండు విని సంతోషమును పొంది వారి శిరంబులను తన కక్షముల సంధుల బట్టుకొని చక్రముచే వారి శిరంబుల ఖండించివేసెను. ఆ శిరంబులను మేదినిగా నిలిపి బ్రహ్మను సృష్టించుటకు ప్రారంభము జేయుమని జెప్పెను.

ఓ రాజా ! నాటినుండియు భూమికి 'మేదిని' యని ప్రఖ్యాతి గలిగెను. అని—"రాజా ! ఆ మాయాదేవి వృత్తాంతమును జెప్పుచున్నాను వినుము" అని ముని జెప్పెను.

## మహిషాసుర చరిత్ర

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"క్రోష్టికీ ! దేవీ మహాత్మ్యమును జెప్పుచున్నాను వినుము !

పూర్వము దేవాసుర యుద్ధమునందు రాక్షసులు అందరు నశించగా ఆ రాక్షసుల తల్లి విచారమును బొంది తన తల్లివద్దకు వెళ్ళి—"అమ్మా ! నా పుత్రుల నందరను దేవతలు నశింపజేసిరి. నాకు దిక్కు ఎవ్వరు !" అని జెప్పి బిగ్గరగా యేడువసాగెను.

అంతట తల్లి కుమార్తెను ఆదరించి—"పుత్రికా ! దైవయోగమునకు విచారించినను ప్రయోజనములేదు. నీవు తపంబు జేయుము. అందువలన నీకు ప్రఖ్యాతి పొందగల కుమారుడు పుట్టగలడు" అని చెప్పెను.

తల్లి చెప్పిన మాటలను రాక్షసుల తల్లి దితి విని సుపార్శ్వుడను ముని ఆశ్రమమునకు వెళ్ళి అనేక మృగ రూపముల దాల్చుచు తపంబు జేయుచు ఒకనాడు మహిష రూపమును దాల్చి పంచాగ్ని మధ్యమమున నిలుచుండి తపంబు జేయుచుండెను.

అటుల ఘోరరూపముదాల్చి ఘోర తపస్సు జేయుచున్న దితిని జూచి మహాముని అసహ్యమును జెంది—"ఓ దితీ! నీకు మహిష రూపముగల పుత్రుడు పుట్టుగాక!" యని శాపమును పెట్టెను.

కొంత కాలమునకు చతుర్ముఖుడు వచ్చి— "నీవు తపంబును చాలింపుము. నీకు అర్ధరూపము నరా కృతి, అర్ధభాగము మహిషాకృతి గల పుత్రుడు పుట్టును. వాడు దేవతలను జయించి స్వర్గమును పరిపాలనము జేయును" అని జెప్పి అదృశ్యుడాయెను.

అంతట దితి గర్భమును దాల్చి మహిషాసురుని కనెను. రాక్షసులు ఈ సంగతి తెలుసుకుని మహిషాసురుని వద్దకు వచ్చి—"మనము స్వర్గపట్టణమును జయించుటకు బయలుదేరి వెళ్ళవలయును" అని జెప్పి ఉద్రేకమును కలుగజేసిరి.

ఆ మాటలకు మహిషాసురుడు సంతోషమును పొంది దేవతల మీదకు యుద్ధమునకు బయలుదేరి వెళ్ళి దేవతలను జయించి స్వర్గపట్టణమును ఆక్రమించుకొని పాలించుచుండిరి.

రాక్షసులు దేవతలను బాధింపుచుండిరి. దేవతలు రాక్షసులు పెట్టెడు బాధలను పడలేక బ్రహ్మవద్దకు వెళ్ళి- "ఓ సృష్టికర్తా! రాక్షసులు మమ్ము స్వర్గపట్టణమునుండి పారదోలి మమ్ములను బాధింపుచున్నారు" అని జెప్పుకొనిరి.

ఆ మాటలు బ్రహ్మవిని దేవతలను తీసుకుని ఈశ్వరుని సన్నిధికిని, శ్రీమహావిష్ణువు సన్నిధికిని వెళ్ళి అనేక విధములుగా వారిని ప్రార్థించి—" మహిషాసురుడు దేవతలను బాధలు పెట్టుచున్నాడు" అని జెప్పెను.

రుద్రుడు కోపమువచ్చి 'హుం' అని హుంకారము జేయగానే పరమేశ్వరుని ముఖమునుండి మహాతేజము బయలు దేరెను.

ఆ ప్రకారము బ్రహ్మ, విష్ణు, దేవతా సమూహములనుండి మహాతేజము బయలుదేరి వివిధాంగములుగ యేర్పడి మహాదేవి స్వరూపముగా ప్రకాశించుచుండెను. ఆ విధముగా యేర్పడిన శ్రీ మహాదేవీ స్వరూపమును

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు జూచి సంతోషమునుపొంది తమతమ ఆయుధములను ఆ మహాదేవికి యిచ్చిరి. హిమవంతుడు సింహమును వాహనముగా యిచ్చెను.

అంతట రుద్రుడు మహాదేవిని జూచి—"ఓ మహాదేవీ! నీవు యీ సింహమును వాహనముగా జేసుకుని, దేవతలను సహాయముగా జేసుకుని మహిషాసురాది రాక్షసులను సంహరించి స్వర్గపట్టణమును దేవతలకు యివ్వవలసినది" అని జెప్పెను.

ఆ మాటలను దేవి విని సంతోషమును పొంది రణభేరీ వేయించి సింహనాదమును జేసెను. ఆ శబ్దమునకు సకల లోకములు గజగజ వణకజొచ్చెను. సముద్రములు అల్లకల్లోలము లయ్యెను. దిశలు ప్రతిధ్వనించెను. యీ విధముగా శ్రీ మహాదేవి దేవతా సమూహములను తీసుకుని రాక్షసాక్రాంత మయిన స్వర్గ పట్టణమును ముట్టడించెను.

శ్రీ మహాదేవి దేవతా సమూహములతో స్వర్గ పట్టణమును ముట్టడివేసిన సంగతి మహిషాసురుడు చారుల వలన తెలుసుకుని రౌద్రాకారుడై అట్టహాసముజేసి చతురంగ

బలములను సిద్ధము జేసుకుని మహాదేవితో యుద్ధమునకు తలబడెను. అంతట శ్రీమహాదేవి రాక్షసులు యుద్ధమునకు ఢీకొనుటను జూచి మహా కోపముగలదై విశ్వ రూపమును దాల్చి దేవీగణముల సృజించి ఎవరు ఏ రూపమున నశించెదరో ఆయా రూపముల సృజించి రాక్షస మూకలను క్షణకాలములో నాశనమును జేసి తాను మహిషాసురుని మీదకు దూకి శూలమును దీసుకుని వక్షము జీల్చి శిరంబు ఖండించివేసెను. అంతట రాక్షసమూకలు భయము కలవారై చెల్లాచెదరై పారిపోయిరి.

మహిషాసురుడు చావగానే ఆకాశమునుండి పుష్ప వర్షము కురిసెను. దేవదుందుభులు మ్రోగెను. దేవతలు సంతోషమును పొందెను.

పిమ్మట దేవేంద్రాది దేవతలు మహాదేవిని జూచి- "ఓ తల్లీ ! నీవు మమ్ములను రాక్షస బాధలనుండి రక్షించితివి. నీవు లోకమాతవు. నిన్ను ఎవరు స్మరించెదరో, ఎవరు పూజించెదరో వారికి నెరవేరని కోరికలు వుండవు. మమ్ములను యెల్లప్పుడును కాపాడుచుండుము తల్లీ" అని ప్రార్థించిరి.

ఆ మాటలకు దేవి సంతోషమును పొంది—" దేవత లారా! మీరు స్వర్గపట్టణమునకు వెళ్ళి స్వర్గసుఖములను పొందుడు" అని జెప్పి దేవేంద్రాదుల స్వర్గ పట్టణమునకు పంపించి వేసెను.

తాను దేవీగణములతో పరివేష్టింప బడుచు కైలాస పర్వతమునకు వచ్చి అందు ఉత్తరస్థానమునందు స్థావరముగ యేర్పర్చుకుని ప్రపంచకమంతయు తాను అయి విహరించుచు భక్తులను రక్షించుచు, దుర్మార్గులను సంహరించుచుండెను" అని శ్రీమహాదేవి మహాత్మ్యమును మార్కండేయుడు క్రోష్టికికి జెప్పెను.

## శుంభనిశుంభుల చరిత్ర

క్రోష్టికి విని సంతోషమును పొంది యిట్లని ప్రశ్నించెను. " మార్కండేయ మహామునీ! శుంభ నిశుంభుల చరిత్రను కూడా జెప్పవలసినది " అని కోరెను.

" క్రోష్టికీ! పైవిధముగా మహాముని రాజునకున్ను, వైశ్యునకున్ను దేవీ మహాత్మ్యమును జెప్పి తిరుగా దేవీ మహాత్మ్యమును యిటులని జెప్పుచున్నాడు—

పూర్వము సుందోపసుందులకు కుమారులగు శుంభ నిశుంభులను రాక్షసులు దేవతలను జయింపవలయునను కోరిక గలిగి పుష్కరక్షేత్రమునకు పోయి ఆహారాదులను వదిలి ఘోరమగు తపస్సును జేయసాగిరి. ఆ ఘోర తపంబునకు చతుర్ముఖుడు సంతోషమును పొంది ప్రత్యక్షమయి "వరంబులను కోరవలసినది" అని జెప్పెను.

ఆ మాటలను దనుజులువిని సంతోషమును పొంది "మేము దేవతలను జయించునటులను, మాకు పురుషుల చేత మృతిని లేకుండునటులను వరంబుల నొసంగవలయును" అని ప్రార్థించిరి.

బ్రహ్మ ఆ వరముల నిచ్చి—"రాక్షసోత్తములారా! మీరు సాధువుల హింసించునప్పుడు అయోనిజయు, కన్యకయు అగు మాయాశక్తిచే మీరు మృతిని పొందుదురు" అని జెప్పి అదృశ్యుడాయెను.

ఆ రాక్షసులు వరగర్వము గలవారయి సర్వలోకములను బాధించుచు స్వర్గపట్టణమును ఆక్రమించుకుని మహా ఋషులను బాధించుచు యజ్ఞయాగాదులయందు అవిర్భాగములను తాము హరించుచుండిరి.

యీ విధముగా దేవతలను, మహాఋషులను బాధించుచుండగా దేవేంద్రుడు శచీదేవి సహితముగా కైలాసమునకు జని పార్వతీ పరమేశ్వరులను పూజించి అనేక విధములుగా స్తోత్రములను జేసిరి.

"ఓ పార్వతీ ! నీవు లోకమాతవు. పరమేశ్వరుని అర్ధశరీరమును పొంది భక్తులను పరిపాలింపుచుందువు. నీవు శక్తిరూపమున తృణము మొదలు బ్రహ్మవరకు గల పదార్థములయందు నిలచి భక్తులను రక్షింపుచుందువు. శుంభ నిశుంభులు అను రాక్షసులు చతుర్ముఖునివలన వరంబులను పొంది మమ్ములను, మహాఋషులను బాధింపుచున్నారు. మా గృహములను, రాజ్యమును ఆక్రమించుకుని మమ్ములను వెడలగొట్టి బాధింపుచున్నారు. మమ్ములను నీవు దప్ప యితరులు రక్షింపజాలరు. అయోనిజయు, కన్యకయు నగు దేవివలనగాని వారికి చావులేనట్లు బ్రహ్మవలన వరములను బొందియున్నారు. కనుక నీవు మమ్ములను కాపాడవలెను" అని ప్రార్థించిరి.

ఆ మాటలను పార్వతీదేవి విని కోపము గలదియై కన్నులు అగ్నికణములవలె ప్రకాశింప జేసి 'హుం' అని హుంకారము జేసెను. ఆ హుంకారమువలన కోటిసూర్య ప్రకాశమానముగల మాయాశక్తి పుట్టి యెదుట నిలచి

భయభక్తి వినయంబులతో పార్వతికి నమస్కరించి— "అమ్మా! నన్ను పుట్టించుటకు కారణమేమి" యని అడిగెను.

శ్రీ పార్వతీదేవి ఆ మాటలను విని ప్రేమాలింగనము జేసుకుని— "ఓ బాలాత్రిపుర సుందరీ, వత్సా! నీవు హిమాలయ దక్షిణ శిఖరమునందు నివశించియుండి నీ నేర్పువలన శుంభ నిశుంభులను, దుర్మార్గులగు రాక్షసులను సంహరించి స్వర్గపట్టణమును దేవతలకు యిచ్చి లోకములను రక్షించవలసినది" అనిజెప్పి పంపించెను.

ఆ మాటలను మాయాదేవి యగు బాలాత్రిపుర సుందరి విని మాతృగణములను సహాయముగా వెంట దీసుకుని హిమవంతమున దక్షిణ శృంగమునందు గల గృహయందు నివాసముగా యేర్పర్చుకుని బాలా త్రిపుర సుందరీ రూపమును దాల్చి మూడులోకములను మోహింపజాలునటుల శృంగారమును జేసుకుని తన మాతృ గణములతో సంగీతమును పాడుచు స్వేచ్ఛగా విహరింపుచుండెను.

యీ వర్తమానమును శుంభ నిశుంభులు తమ దూతలవలన తెలిసుకుని ఆ రూపవతిని తాము గైకొనుటకు

నిశ్చయించుకుని సముచిత పరివారములను వెంటబెట్టుకుని ఆ కన్యకామణి వద్దకు వచ్చి ఆమె రూపాది శృంగారములను జూచి మోహ పరవశులై—"ఓ బాలామణీ! మేము శుంభ నిశుంభులము. మధుకైటభులను రాక్షస వీరుల పుత్రులము. మేము త్రిలోకాధి పతులము. అణి మాది శాంబవీ మహావిద్యా సంభూతులము. అటువంటి మహావీరుల మయిన మమ్మును, అన్నదమ్ములమైన మమ్మును నీవు త్రిలోకములను మోహింపజేయగల బాలా మణివి గావున మమ్ములను వివాహము ఆడి సర్వసుఖంబు లనుభవింపుము" అని జెప్పిరి.

ఆ మాటలను శ్రీ బాలా త్రిపురసుందరీదేవి విని—"రాక్షస వీరులారా! మీరు జెప్పిన వాక్యములు యదార్థ ములు గాని నా బలశౌర్యాదులకు తగిన వీరుదెవడైనా నాతో యుద్ధముచేసి ఆ యుద్ధమునందు గెలిచినచో వారిని వివాహము జేసుకొందునని ప్రతిన జేసియున్నాను. కావున మీకు నన్ను వివాహము జేసుకొనవలెనని కోరిక యున్న యెడల మీ చతురంగబలములతో వచ్చి యుద్ధమునందు నన్ను జయింపుడు. మీకు నాయందు కోరిక లేకయున్నను మీకు బలశౌర్యాదులు లేక యున్నను గృహంబులకు పొండు" అని పలికెను.

ఆ ప్రకారం శ్రీ బాలా త్రిపురసుందరీమణి పలుకగా ఆ రాక్షస వీరులు విని మండిపడి తోకత్రొక్కిన కరాళ సర్పమువలె ఆగ్రహావేశము గలిగి—"ఆడదానికి ఇంత గర్వమా ?" అని కేకలు వేయుచు చతురంగబల సమాయుక్తముగా వచ్చి బంధుర వ్యూహమును పన్ని రణభేరీ వేయించి యుద్ధమునకు ప్రారంభము జేసిరి.

శుంభ నిశుంభులు జేయు యుద్ధ ప్రారంభమును శ్రీ బాలా త్రిపురసుందరీదేవి జూచి మహానందముపొంది బ్రహ్మాండము పగులునటుల సింహమువలె గర్జించి ఒక్క కేక వేసెను. ఆ శబ్దముతో భూమండలము అంతయు నది, గిరులు సహితముగా వణికిపోగా కోటానకోట్లు దేవీ గణములు పుట్టి రాక్షస మూకలను సంహరింపుచు, రక్తమును పీల్చుచు, మాంసమును తినుచు, నృత్యములను జేయుచుండిరి. ఆ సమయమునందు ఆ మహాదేవి రౌద్రాకారము దాల్చి శుంభ నిశుంభులను క్రింద పడవేసి వక్షస్థలంబుల బాదంబుల ద్రొక్కి త్రిశూలంబున శిరంబులను ఖండించి రక్తమును ద్రాగుచు, నృత్యమును జేయుచు రాక్షసస్వరూపమును సర్వశూన్యముగా వశింపజేసెను.

అంతట శ్రీ బాలా త్రిపురసుందరీదేవి దేవీ గణములతో గలసి భయంకరముగా నృత్యమును జేయుచుండగా దేవేంద్రాది దేవతా సమూహములున్ను, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులున్ను, యక్ష, కిన్నర, గరుడ, గంధర్వులున్ను, మహానందమును పొంది పుష్ప వర్షమును కురిపించి నృత్యములను జేయుచు దేవదుందుభులను మ్రోగించసాగిరి. పిమ్మట బ్రహ్మ దేవి ఎదుట నిలుచుండి- " ఓ మహాదేవీ! నీవలన శుంభనిశుంభులును, రాక్షసులును సంహరింపబడిరి. దేవతా సమూహములకున్ను, ఋష్యాదులకున్ను బాధలు నివారింపజేసి సుఖింపజేసితివి. నీవు మాయను ఉపసంహరించి నిజరూపమును దాల్చి ప్రసన్నమయి మమ్ములను కాపాడవలసినది " అని ప్రార్థించెను.

యీ విధముగా విష్ణు, మహేశ్వర, దేవేంద్రాదులు ప్రార్థించగా మహాదేవి సంతోషమును పొంది సౌమ్య రూపమును దాల్చి పార్వతీ దేవికి నమస్కరించి నిలుచుండెను.

పిమ్మట శ్రీ బాలా త్రిపురసుందరీదేవి దేవాది దేవతలను జూచి యీ విధముగా పలికెను— " ఓ దేవాది దేవతలారా! నీ శుంభ నిశుంభులు వైవస్వత మన్వంత

రమున యిరువది ఎనిమిదవ మహాయుగమున తిరుగా పుట్టుదురు. ఆ కాలమునందు నేను నందుడను గొల్లయింటి యందు బుట్టి శ్రీకృష్ణుడని వ్యవహరింపబడుచుందును. శ్రీ మహావిష్ణువునకు సహాయముగా వింధ్యపర్వతము నందు నివశించియుండి ఆ క్రూర రాక్షసులను సంహ రించెదను. అప్పుడు ప్రమత్తులును, విప్రజిత్తులును అగు అనేక విధములగు రాక్షసులను సంహరించి రక్తదంతి నామమును పొందుదును. ఆ కాలమునందు నూరు సంవత్స రములు వర్షములు కురువక మనుజులు బాధలను పొందు దురు. నేను నూరు నేత్రములను దాల్చి మనుష్యులను కాపాడుచుందును. అందువలన నన్ను 'శతాక్షి' యని పూజించెదరు. ఆ కాలమునందు మనుష్యాదులకు ఆహా రాదులు లేక బాధలను పొందుదురు. నేను నా శరీరము నుండి ఆహారమునకు కావలసిన శాకాది ధాన్యములు మొదలగు వాటిని పుట్టించి కాపాడుచుందును. ఆ కారణముచేత నన్ను 'శాకంబరీదేవి' యని పూజింపుచుందురు. అనేక రూపములను దాల్చి లోకములను బాధింపుచుండెడి రాక్షసులను, దుర్మార్గులగు మానవులందు ఆవేశించి ధర్మమును ధర్మమార్గానువర్తులగు ప్రజలను బాధింపు

చుండెడివారిని నేను అనేక రూపములను దాల్చి దుర్మార్గ
మును, దుర్మార్గులను సంహరించి, నన్ను స్మరించువారిని
పూజించువారిని దేవబ్రాహ్మణ గురు పితృ మాతృ భక్తి
గలవారిని రక్షింపుచుందును.

ఉభయాష్టములందు నవమి, చతుర్దశి అను తిధులయందును

శ్లో॥ కృష్ణాష్టమి చతుర్దశ్యాం అమావాస్యాచ
పూర్ణిమా సంక్రాంతయః పర్వతిథయః॥

అను పంచ పర్వములందును, శుక్ర గురువారములందును
నన్ను పూజింపు చుండెడివారిని, స్మరింపు చుండెడివారిని,
మధుకైటభ, మహిషాసుర, శుంభ నిశుంభులను నేను
సంహరించిన చరిత్రను పఠించువారికిన్ని, నేను అట్టి
భక్తులకు సర్వ అరిష్టములు, అపమృత్యువులు, క్రూరగ్రహ
దోషములు, శరీరవ్యాధులు పోగొట్టి ఆరోగ్యవంతులుగను,
శతాయుర్దాయ వంతులుగను, పుత్రపౌత్రాభి వంతులుగను,
అష్టఐశ్వర్య వంతులుగను, ధన, ధాన్య, పశు సమృద్ధి
గలవారినిగను జేసి రక్షింపుచుందును. వారికి సకల
కోరికలను, స్మరణమాత్రము చేతనే నెరవేరుచుందును"
అని చెప్పగానే దేవతలు ఎవరి తావులకు వారు వెళ్ళి
సుఖంబుగా నుండిరి.

అని సుమేధ మహాముని సురథుండను రాజున కున్ను, సమాధి అను వైశ్యనకున్ను జెప్పి యిటులనెను- "ఆ దేవిని ప్రార్థింపుడు" అని జెప్పెను.

సుమేధ మహాముని ఆ రాజునకున్ను, వైశ్యన కున్ను శ్రీ బాలా త్రిపురసుందరీ మంత్రము నుపదేశించగా వారు ఆ తపోవనమునందే ఆరు మాసములు జపానిష్ఠతో జపము జేయగా దేవి ప్రత్యక్షమై—"ఓ రాజా! నీవు చక్రవర్తివై భూపరిపాలనము జేసి పిమ్మట సూర్యునకు పుత్రుడవై పుట్టి సూర్యసావర్ణి అను ఎనిమిదవ మనువు అను ప్రఖ్యాతిని బొందెదవు" అని జెప్పి, వైశ్యనకు— "నీవు అయిశ్వర్యమును పొంది సుఖించెదవు" అని వరంబుల నిచ్చి అదృశ్యురాలైనది" అని సుమేధస్సను ముని రాజునకున్ను, వైశ్యనకున్ను జెప్పిన ఇతిహాసమును మార్కండేయుడు క్రోష్టికికి జెప్పెను.

## సావర్ణి మన్వంతరమున యింద్రాదులు

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"క్రోష్టికీ! సావర్ణి మన్వంతరమున రాముడు, వ్యాసుడు, గాలవుడు, దీప్తిమంతుడు, కృపుడు, ఋష్యశృంగుడు, అశ్వత్థామ అను

వారలు సప్తఋషులు. సుతపులు, నమితాభులు, ముఖ్యులు నగువారు దేవతలు. బలిచక్రవర్తి, యింద్రుడు, విరజస్సు, వరిష్ఠుడు, నిర్మోహుడు, సత్యవాక్కు, స్మృతి, విశ్యుడు ననువారు మనుపుత్రులు" అని ప్రసిద్ధిపొందుదురు.

## దక్షసావర్ణి

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"ఓ క్రోష్టికీ! దక్ష పుత్రుడగు దక్షసావర్ణి మన్వంతరమును జెప్పుచున్నాను వినుము! దక్షసావర్ణి మన్వంతరమునందు బాలురు, మరీచి గర్భులు, సుధర్ములు అను దేవతలు మూడు విధములుగ నుందురు. యప్పటి దేవసేనాని యింద్రుడగును. అద్భుడు అను పేరుతో ఇంద్రుడగును. మేథాతిధి, వసువు, సత్యుడు, జ్యోతిష్మంతుడు, ద్యుతిమంతుడు, సవనుడు, హవ్య వాహనుడు అను వారలు సప్తఋషులు అయ్యెదరు. ధృత కేతువు, ధృష్టకేతువు, పంచహస్తుడు, నిరామయుడు, పృథుశ్రవస్సు, అర్చిష్మంతుడు, బూరిద్యుమ్నుడు, బృహ ద్భయుడు, వృష్టిమయుడు నను తొమ్మిదిమంది మను పుత్రులుగ నుండెదరు" అని జెప్పెను.

## బ్రహ్మసావర్ణి మనువు

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"బ్రహ్మపుత్రుడు బ్రహ్మసావర్ణి మన్వంతరము వ్యవహరింపబడును. ఆ బ్రహ్మసావర్ణి మన్వంతరమున సుఖాశీనులు, ననిరుద్ధులు, ద్విప్రకారులు అనువారు దేవతలు. శాంతి యనువాడు యింద్రుడగును. ఆపోమూర్తి, హవిష్మంతుడు, సుకృతి, సత్యుడు, నాభాగుడు, అప్రతిముడు, వాసిష్ఠుడు అనువారు సప్తఋషులు. సుక్షేత్రుడు, నుత్తమోజస్సు, భూరిసైన్యుడు వీర్యవంతుడు, శతానీకుడు, వృషభుడు, ననమిత్రుడు, జయద్రధుడు, బూరిద్యుమ్నుడు, సువర్చుడు ననువారు మనుపుత్రులు పరిపాలనము జేయుదురు" అని జెప్పెను.

## ధర్మసావర్ణి మనువు

"క్రోష్టికీ! పదునొకండవది యగు ధర్మపుత్ర సావర్ణి మన్వంతరము ప్రవర్తిల్లును. ఆ మన్వంతరమున విహంగములు, కామగులు, నిర్మాణరతులు అనువారు దేవతలు,

వృషుండు యింద్రుడగును. హవిష్మంతుడు, ఋష్టి, అరుణి నిస్స్వరుడు, అనముడు, వృష్టి, అగ్ని, తేజస్సు ననువారు సప్తఋషులు, సర్వాంతగుడు, సుశర్మ, దేవానీకుడు, పురూద్వహుడు, హేమధన్వి, దృఢాయువు, విజనుడు ననువారు మనుపుత్రులు ధరణి పాలించెదరు" అని మార్కండేయుడు జెప్పెను.

## రుద్రసావర్ణి మనువు

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"ఓ క్రోష్టికీ! రుద్ర పుత్రుడు రుద్రసావర్ణి మనువు పరిపాలనము జేయును. అందు సుకర్మాణులు, సుమస్సులు, హరితులు, రోహితులు, సుగారులు ననువారు దేవతలు. ఋతుధాముడు యింద్రుడగును. ద్యుతి, తపస్వి, సుతస్వి, తపోమూర్తి, తపోనిధి, తపోధనుడు, తపోధృతి యను మహాత్ములు సప్తఋషులు అగుదురు. దేవగురుడు సువదేవుడు, దేవశ్రేష్ఠుడు, విధూరధుడు, మిత్రవంతుడు, మిత్రహస్తుడు ననువారు భూమిని పాలించెదరు"

## రౌచ్య మన్వంతరము

క్రోష్టికీ! పదమూడవది యగు రౌచ్య మన్వంతరము వ్యవహరించబడును. సుధర్మలు, సుకర్మలు, సుశర్మలు అనువారు దేవతలు. బృహస్పతి యింద్రుడగును. ధృతిమంతుడు, నవ్యయుడు, దర్శి, నిరుత్సకుడు, విరోహుడు, సుతపుడు, నిష్ప్రకంపుడు అనువారు సప్తఋషులు. చిత్రసేనుడు, విచిత్రుడు, నయధృత్తు, నిర్భయుడు, దృఢుడు, సునేత్రుడు, క్షత్రబుద్ధి, సువ్రతుడు అనువారు మనుపుత్రులు ప్రసిద్ధి పొందియుందురు.

## ఋషి - పితృ సంవాదము

క్రోష్టికీ! ఈ మన్వంతరమునకు అధికుడగు రుచి, నవబ్రహ్మలలో ఒకడు. యీ రుచి మొదట ఆహారాదులను విసర్జించి భార్యాస్వీకరణము జేయక నిస్సంగుడై యుండెను. అతని పితరులు అతనిని జూచి—"పుత్రోత్తమా! నీవు గృహస్థ ధర్మమును నెరవేర్చకయున్న దోషమును పొందుదువు. అందువలన నరకంబును పొందగలవు" అని జెప్పిరి.

ఆ మాటలను రుచి విని—"పిత్రుదేవతలారా! గృహస్థాశ్రమము అన్నివిధముల దుఃఖహేతువు. దాని వలన అధోగతి గలుగును. అందువలననే నిస్సంగుడనై పాపరహితుండనై యుండెదను. ఇదియుగాక ఈ కర్మాచరణమే అవిద్యయని వేదములు పలుకుచున్నవి.

యీ కర్మ యను బురదలోబడి మలినము పొందుట కన్న జ్ఞానమార్గమను జలమువలన చిత్తమును పరిశుద్ధము జేసి మోక్షమునకు వెళ్లుదును" అని జెప్పెను.

ఆ మాటలను పితరులు విని—"పుత్రా! రుచీ! నీకు మేము ఒక్క విషయమును జెప్పెదము శ్రద్ధగా వినుము! పర్వతమును యెక్కుటకు ఆలోచనమును జేయువాడు ఒక్క పర్యాయముగా పర్వతమును ఎక్కలేక క్రమక్రమముగా ప్రయత్నమును జేసి పర్వతమును యెక్కునటుల, మోక్షాపేక్షగల మానవుడు గృహస్థ ధర్మము లనుభవించి దేవ, పిత్రు, అతిధి, అభ్యాగతులను తృప్తిపరచి క్రమక్రమముగా సాంగత్య రహితమునుజేసి జ్ఞానమును పొంది మోక్షమును పొందవలెను. కర్మాచరణము ఎన్నటికిని దుఃఖకారణము కానేరదు. విషము ఒకొక్కప్పుడు ప్రాణమును దీయును. ఒక్కొక్కప్పుడు ప్రాణమును రక్షించును. ఆ విధముగానే కర్మలను

జేయుటవలన సుఖమును దుఃఖమును కలుగుచుండును. ఇదియునుగాక పూర్వజన్మానుసారముగ వచ్చు ఆగామి సంచితములను పుణ్య పాపములను అనుభవించక తప్పదు. నీవు యీ జన్మమునందు గృహస్థు జేయవలసిన కర్మలను జేయనియెడల రాబోవు జన్మములయందు సుఖములను పొందనేరవు. హితవునుబట్టి విషమును సేవించి ప్రాణమును రక్షించుకొనునటులనే మితముగా గృహస్థు ధర్మములను నెరవేర్చుచు సుఖములను పొందవలెను" అని అనేక విధములుగా జెప్పిరి.

పితరుల వాక్యములను రుచి విని—"పితరులారా! నాకు గృహస్థాశ్రమము పొందవలయునను కోరిక లేదు. అయినను మీ అనుజ్ఞ ప్రకారము గృహస్థాశ్రమమును పొందెదనన్న ముసలివాడనగు నాకు కన్యను యెవ్వరు యిచ్చెదరు? కావున నాకు వివాహము అగుట చాలా కష్టము" అని పలికెను.

ఆ మాటలకు పితృదేవతలు యిటులని పలికిరి— "పుత్రా! యిటువంటి మాటలువలన ప్రయోజనములేదు. నీకు యేవిధముగానైనను వివాహము అగుట ముఖ్యము. నీవు వివాహము జేసుకొనని యెడల మాకు అధోగతి తప్పదు. నీకును నరకము తప్పదు" అని అదృశ్యులైరి.

రుచియు పితృవాక్య పరిపాలనము జేయదలచి అనేక గ్రామములను, పట్టణములను తిరిగి బ్రాహ్మణులను ఋషులను తనకు కన్యాకాదానమును జేయవలసినదని కోరెను. ఆ మాటలను విని యెవ్వరును కన్యకను యిచ్చుటకు సమ్మతించలేదు. తుదకు రుచి విచారమును పొంది బ్రహ్మనుగూర్చి నూరు దివ్యసంవత్సరములు తపంబు జేసెను.

ఆ తపంబునకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై— "ఓ రుచీ! నీ తపంబునకు మెచ్చితిని. నీకు కావలసిన వరమును కోరుము" అని పలికెను.

రుచి బ్రహ్మకు నమస్కరించి తనకు తగిన కన్యకామణి భార్య కావలెను" అని కోరెను.

ఆ మాటలు బ్రహ్మ విని— "ఓ బ్రాహ్మణుడా! నీవు విచారించకుము. నీ పితరులు జెప్పిన విధముగా పరిణయమైన నీ పితరులు సంతోషమును పొందుదురు. పితరులు సంతసించిన నీకు సకల కోరికలు నెరవేరును" అని జెప్పి అదృశ్యుడాయెను.

పిమ్మట రుచి పరిశుభ్రమయిన ప్రదేశమునకువెళ్ళి పితరులను గూర్చి తపంబు జేయగా పితరులు ప్రత్యక్షమై "పుత్రరత్నమా! నీవు విచారమును పొందకుము. సకల లక్షణ సంపత్తుగల కన్యక నీకు లభించగలదు. దాని యందు ఉత్తమ లక్షణములు గల కుమారుడు కలుగును. అతను రౌచ్యుండని ప్రసిద్ధిపొంది మనువుగా పరిపాలనము జేయును" అని జెప్పి అదృశ్యులైరి.

క్రోష్టికీ! ఈ పితృ స్తోత్రమును ఎవరు పఠించెదరో వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాదులు గలిగి సుఖములను పొందుదురు. శ్రద్ధగా జేసిన శ్రాద్ధముగూడ పవిత్రవంతము గలుగును. అందువలన పితరులు సంతసించెదరు. పితరులు సంతసించిన కర్తకు అధికమైన ఫలము గలుగును.

పిమ్మట అచ్చటనున్న నదీ మధ్యమునుండి అప్సరస వెడలివచ్చి రుచిం జూచి—"నీవు భార్యను గోరుచున్నవాడవు. నాకు వరుణుని కుమారుడు పుష్కరుని వలన ఒక కుమార్తె గలిగినది. దానిని నీకు వివాహము జేసెదను. దానియందు నీకు ఒక్క పుత్రుడు పుట్టును" అని జెప్పి అచ్చర తన కుమార్తె చంపకమాలిని దెచ్చి రుచికి యిచ్చెను.

అంతట రుచి సంతోషించి తన ఆశ్రమమునకు దోడ్కొనివెళ్ళి మంచి ముహూర్తమున మహా ఋషుల రప్పించి యధావిధిగా వివాహమయి రుచి భార్యతో గూడా సర్వసుఖములను పొందుచుండెను.

యిటులు నుండగా కొంత కాలమునకు ఒక్క పుత్రుడు పుట్టెను. రుచి పుత్రోత్సవాదులను జేయించి రౌచ్యుడని నామకరణము జేయించెను" అని మార్కండేయుడు జెప్పెను.

## భౌత్య మన్వంతరము

క్రోష్టికి మార్కండేయుని జూచి—"అయ్యా! మార్కండేయా! మన్వంతరములు పదునాల్గని వినుచున్నాము. నీవు పదిముప్పూరు మనువులను గూర్చి జెప్పితివి, కనుక పదునాల్గవ మన్వంతరమును గూడా వినిపించవలసినది" అని కోరెను.

ఆ మాటలకు మార్కండేయుడు జెప్పుచున్నాడు—"క్రోష్టికీ! నీ అభీష్టమును నెరవేర్చెదను శ్రద్ధగావినుము! అంగీరసునకు భూతి యను సుతుడు పుట్టెను. అతడు

పరమ తపశ్శాలి అని ప్రసిద్ధిని పొందియుండెను. అతడు మహా కోపి. అందువలన అతని పేరు వినగానే అందరును భయపడెడువారు. సూర్యుడు అతనికి భయపడి అతని ఆశ్రమమున మిక్కిలి ఎండగాయుటగాని, వేడిగాడ్పు వీచుటకుగాని వెరచుచుండెడివారు. చంద్రుడు కూడా మిక్కిలి చల్లని కిరణములు జూపుటకు భయపడు చుండెడివారు.

ఈ విధముగా నుండగా ఆ మునికి చాలాకాలము వరకు సంతానము లేకుండెను. అందువలన మునికి విచారము కలిగెను. ఘోర తపమునుజేసి సంతానమును పొందుటకు ఆలోచించి తనను జూచి పంచభూతములు వెరచుచుండెను. గాన తపంబువలన ఫలితములేదని విచారించుచుండెను.

యిటుల నుండగా భూతి అన్నయగు సువర్చస్సను ముని యజ్ఞమును జేయుచు భూతిని బ్రహ్మగాగోరి రావలసినదని కోరెను. భూతి యజ్ఞమును జేయించుటకు వెళ్ళుచు శిష్యుని జూచి—"శాంతీ! నీవు నేను వచ్చు పర్యంతము అగ్నిహోత్రమును కాపాడుచుండవలసినది" అని జెప్పి వెళ్లెను.

ఒకనాడు శిష్యుడు శాంతి పూజార్ధము పుష్పములను దెచ్చుటకు అడవికివెళ్ళి మరలి వచ్చులోపల అగ్ని గుండము శాంతిపొంది యుండెను అటుల శాంతిపొందిన అగ్నిగుండమును జూచి దిగులుపడి యిటులని విచారించెను—"అయ్యయ్యో! నేను యెంత దుష్టపనిని జేసితిని. నా గురువును జూచిన పంచభూతములు, దేవతలు గూడ భయమును పొందుదురు. అటువంటి గురుడు యీ విషయమునందు నన్ను యేమి జేయునో?" అని దిగులుపడి విచారించుచు ఇటులని తలంచెను—"ఈ అగ్ని శాంతి పొందుటచేత నాకు దుఃఖము కలుగుచున్నది. వేరొండు అగ్నిని దెచ్చి ప్రజ్వలింప జేసితినేని నా గురుడు త్రికాలవేది. అందువలన నేను జేసిన తప్పును తెలుసుకొనును. ఒకటి రెండు తప్పులు అవును" అని వారించి ఇప్పుడు నాకు అగ్నిహోత్రుడే దిక్కని తలంచి అగ్నిహోత్రుని అనేక విధములుగా అగ్ని సూత్రములచే ప్రార్థించెను.

అంతట అగ్నిదేవుడు ప్రసన్నుడై—"ఓ విప్రా! నీ భక్తి వినయములకు సంతోషమును పొందితిని. నీకు కావలసిన వరంబులను కోరుము" అని జెప్పెను.

ఆ వాక్యములను శాంతి విని సంతోషమును పొంది. "ఓ దేవోత్తమా! నా అపరాధమును క్షమించి నా గురుని అగ్ని వేదికయందు శాంతిపొందిన అగ్నిని యధాప్రకారము ప్రజ్వరిల్లునటుల జేసి. నా గురుడు నన్ను శాపదగ్ధునిగా జేయకుండునటుల కాపాడుము. అదియుంగాక నా గురువు సంతాన్నములేక విచారమును పొందుచున్నాడు. కావున వారికి సకలగుణ సంపన్నుడైన కుమారుడు కలుగునటుల అనుగ్రహింపుము. మరియు నా గురువునకు సకల భూతములయందును దయ గలుగునటుల అనుగ్రహింపుము" అని కోరెను.

ఆ మాటలను అగ్నిదేవుడు విని—"శాంతీ! నీ భావ శుద్ధికి సంతోషించితిని. నీవు కోరిన కోరికలన్నియు నెరవేరును. నీ గురునకు గలిగెడు పుత్రుడు భౌత్య నామముచే మనువై వెలసి ప్రజలను పాలించును. నీ గురువు పుత్రుని యందును, భార్యయందును ప్రేమ గలిగి యుండును" అని జెప్పి అదృశ్యుడాయెను.

అంతట శాంతి గురుని ఆశ్రమమునకు వెళ్ళి వేదిక యందు అగ్ని ప్రజ్వరిల్లుచుండుట జూచి సంతోషించెను.

పిమ్మట కొన్ని దినములకు యజ్ఞమును పూర్తి గావించి భూతి భార్యాసమేతుడై నిజాశ్రమమునకు వచ్చెను. శిష్యుడు గురువునకు యెదురువోయి వందనములు జేసెను. భూతి శిష్యుం జూచి—"వత్సా! యిది యేమి చిత్రమో గాని నాకు నీయందును, సకల భూతములయందును దయ గలిగియున్నది. దీనికి కారణము తెలియుటలేదు" అని అడిగెను.

శాంతి ఆ మాటలను విని గురువునకు జరిగిన వృత్తాంతమంతయును వినిపించగా విని సంతోషమును బొంది శిష్యుడు శాంతికి వేదవేదాంగములు సహితముగ సకల విద్యలను సంపూర్ణముగా బోధించెను. అంతట కొంత కాలమునకు భౌత్యుండను కుమారుడు గలిగెను.

## భౌత్యమన్వంతరమున యింద్రాదులు

క్రోష్టికీ! భౌత్య మన్వంతరమున జాక్షుషులు, కనిష్టులు, పవిత్రులు, భ్రాజితులు, ధారావృతులు నను అయిదు గణములు దేవతలయ్యెదరు. అందులో శుచి యనువాడు యింద్రుడగును. అగ్నీధ్రుడు, అగ్నిబాహుడు, శుచి, ముక్తుడు, మాధవుడు, అజితుడు అనువారు సప్తఋషులు

అయ్యెదరు. గురవు, గభీరుడు, బ్రధ్నుడు, తపస్వి, నగ్నుడు, ప్రీతిమంతుడు, ప్రవీరుడు, విష్ణువు, సంక్రందనుడు, తేజస్వి, సుబలులు అనువారు మనుపుత్రులై ప్రఖ్యాతిని పొందుదురు" అని మార్కండేయుడు జెప్పగా క్రోష్టికి విని మహా సంతోషమును పొందెను.

## వైవస్వతాది మన్వంతర విషయ సంగ్రహము ఫలస్తుతి ఫలము

"క్రోష్టికీ! పదునాల్గు మన్వంతరముల విషయములను దెల్పితిని.

౧. స్వాయంభువ మన్వంతర చరిత్రను వినిన ధర్మబుద్ధి గలుగును.

౨. స్వారోచిష మన్వంతర కథాశ్రవణమువలన ఇష్టార్థ సిద్ధియు గలుగును.

౩. రైవత మన్వంతర చరిత్రవలన వివాహాది శుభ కార్యములు గలుగును.

౪. చాక్షుస మన్వంతర కథ వినుటవలన ఆరోగ్యము కల్గును.

౫. వైవస్వత మన్వంతర చరిత్ర వినుటవలన బలము ఆయుర్వృద్ధియు కలుగును.

౬. సూర్యసావర్ణి కథ వినుటవలన పుత్రపౌత్ర లాభము గలుగును.

౭. దక్షసావర్ణి మనుచరిత్ర వినుటవలన కీర్తి గల్గును.

౮. బ్రహ్మధర్మసావర్ణి చరిత్ర వినుటవలన శుభములు కలుగును.

౯. రుద్రసావర్ణి చరిత్ర వినుట చదువుట వలన సకల కార్యములు జయమును పొందుదురు.

౧౦. రౌచ్యమన్వంతర కథ వినుట, చదువుటవలన శత్రుసంహారమై సకల కార్యములు నెరవేరును.

౧౧. భౌత్య మన్వంతర కథ వినుట, చదువుటవలన యిష్టదేవతా ప్రసాదసిద్ధి కలుగును.

౧౨. ఉత్తమ మన్వంతర కథ వినుట, చదువుట వలన ధనధాన్య సంపదలు గలుగును.

౧౩, ౧౪. తామస మన్వంతరముల చరిత్ర వినుట చదువుట వలన పశు, పుత్ర, కళత్ర, ధర్మ, సమృద్ధియు గలుగును.

మరియును సకల కోరికలును నెరవేరును. సుగుణ సంతాన్నమును, ధనధాన్య పశు సమృద్ధియు గలిగి స్వర్గాది సకల భోగములు అనుభవించి సుఖించెదరు" అని మార్కండేయుఁడు జెప్పగానే క్రోష్టికి విని సంతోషమును పొందెను.

## వంశవర్ణనమున అంతర్గత సృష్ట్యాదులు

**మార్కండేయుడు జెప్పుచున్నాడు**—"క్రోష్టికీ! క్షత్రియ వంశమునందు బుట్టిన ఉత్తమ రాజుల చరిత్రలను వినుట వలన ఇహపర సౌఖ్యములు గలుగును. మనువు ఇక్ష్వాకు దిలీప అరణ్య భగీరధుల చరిత్రములు అత్యంత పావనములు. వారు అనేకములగు యజ్ఞయాగాదులను జేసి వేద వేదాంగములను జదివి పవిత్రులయిరి. వీరి కధలను వినుట చేత పాపనాశనమగును.

పూర్వము బ్రహ్మ ప్రజలను సృష్టించదలచి దక్షిణ అంగుష్టమువలన దక్ష ప్రజాపతిని. వామాంగుష్టమువలన అతని భార్యను బుట్టించెను. దక్షప్రజాపతివలన దితి యను కన్యక జన్మించెను. ఆమెను కస్యప ప్రజాపతికి యిచ్చి

వివాహము జేసెను. వారికి సూర్యుడు పుట్టెను" అని జెప్పగానే క్రోష్టికి యిటులని ప్రశ్నించుచున్నాడు—

"మార్కండేయ మునివర్యా! కస్యప దితులకు సూర్యుడు పుట్టెనని జెప్పితివి. ఆ సూర్యునకు రూప మేవిధముగా నున్నది? యే కారణముచేత ఆదిత్యదేవుడు కస్యపదితులకు పుట్టెను? కస్యపాదులు యే విధముగా సూర్యునారాధించిరి? సూర్యుని ప్రభావమున్ను, వృత్తాంత మున్ను సర్వమును జెప్పవలసినది" అని కోరెను.

## సూర్యుని ప్రభావము

మార్కండేయుడు జెప్పుచున్నాడు—"క్రోష్టికీ! పరమ విద్య, శాశ్వత తేజస్సు, కైవల్యము, జ్ఞానము, ప్రాకామ్యము, సంవిత్తు, బోధకము, గతి, స్మృతి మొదలగు రూపములచేత బరమ ప్రకాశమానమగు బ్రహ్మము విరాజిల్లు చుండును. మొట్టమొదట ప్రపంచకమంతయు జలాకీర్ణమయిన అంధకారముచే సర్వము శూన్యమైయుండును. ఆ ప్రకారము కొంత కాలము జరిగిన పిమ్మట జల ప్రవాహమున నురుగు యేర్పడి ఆ నురుగువలన గొప్ప గ్రుడ్డుగా యేర్పడెను. ఆ గ్రుడ్డును మధ్యస్థుడగు బ్రహ్మ

మధ్యభాగమునకు సమముగా రెండు చెక్కలుగాచేసెను. ఆ సమయమునందు బ్రహ్మ ముఖమునుండి 'ఓం' అను ధ్వని పుట్టెను. ఆ ఓంకారమువలన భూః, భువః, సువ ర్లోకములు పుట్టెను. వాటిని అవ్యాహృతిత్రయంబమని జెప్పుదురు.

పిమ్మట ఓంకారము వలన సూర్యునకు సూక్ష్మ రూపము యేర్పడెను. దానివలన మహః అను వ్యాహృతి పుట్టెను. దానివలన జనః అను వ్యాహృతి పుట్టెను. దాని వలన తపః, సత్యము అను వ్యాహృతులు పుట్టెను. ఈ యేడు వ్యాహృతులు కలసి సూర్యుని రూపము యేర్పడెను.

మొదట జెప్పిన ఓంకారము తేజోరాశియగు బ్రహ్మ మనబడును. భిన్నముగా జేయబడిన గ్రుడ్డువలన బుట్టిన అవ్యక్త రూపుండగు బ్రహ్మ పూర్వ ముఖమునుండి ఋగ్వేదము, దక్షిణముఖమునుండి యజుర్వేదము, పశ్చిమ ముఖమునుండి సామవేదము, ఛందస్సులు పుట్టెను. ఉత్తర ముఖమునుండి అభిచారిక, ప్రయాగ, ఉపసంహా రములు గల కృష్ణకాంతిచే ప్రకాశించు అధర్వణవేదము పుట్టెను.

యీ విధముగా నాలుగు భేదములు గలిగి వివిధ శాఖా భేదములుగలిగి ఓంకారము ప్రభావముచే ప్రకాశించుచుండును.

౧. ఋగ్వేదము, ౨. యజుర్వేదము, ౩. సామవేదమువలన సూర్యుడు క్రమముగా ప్రాతః మధ్యాహ్న, సాయంకాల ధర్మములు యేర్పడి ఆ ధర్మములు వలన ప్రకాశించుచుండును. మరియు ఆ సూర్యతేజము ఋగ్వేద రూపమున బ్రహ్మయై జగత్తును సృష్టించును. యజుర్వేదము విష్ణురూపమున ప్రజాపాలనము జేయును. సామవేదము రుద్రరూపమున సంహారము జేయుచుండును. అందువలననే ఆ సూర్యతేజమును చతుర్వేదమయంబనిన్ని త్రిగుణాత్మక మయమనిన్ని, త్రిమూర్తి స్వరూప మయమనిన్ని యెంచబడుచు ప్రకాశించుచుండెననిన్ని తెలుసుకొనుము. పద్మమునందు పుట్టిన బ్రహ్మ ఆ సూర్యుని తేజస్సునుండి వెలువడు వేడిమివలన నీరు యింకిపోయి తాను జేయు సృష్టిని అంతయు తగులబెట్టుటను జూచి విచారించి ఆ సూర్యు నారాధించి సూర్యతేజమును ఉపసంహరించెను.

పిమ్మట చతురాననుండు సకల చరాచరములను సృజించెను. బ్రహ్మవలన మరీచి గస్యపులు పుట్టిరి. యీ కస్యపుని భార్యలును. దక్షకన్యకలు అగు వారిలో నతిదికి నింద్రాది దేవతలును, దితికి దైత్యులును, వినతకు గరుడ అనూరులును, స్వసకు యక్ష రాక్షసులును, కద్రువకు సర్పములును, ముని యనుదానికి గంధర్వులును, నరిష్టకు నచ్చరులును, మాతంగికి నైరావతాదులును, తామ్ర ఇల మొదలగువారికి బక్షులును, వృక్షములును మొదలగునవి బుట్టెను.

అందులో అతిది పుత్రులగు దేవతలకు త్రిలోకాధికారమును నిర్ణయించిరి. అందువలన యజ్ఞములయందు హవిర్భాగములు పుచ్చుకొనుటకు అర్హులయిరి. కావుననే దైతేయులు అతిది పుత్రులయందు అసూయగలవారై, దేవతల ఐశ్వర్యమును జూచి సహింపజాలక అనేక విధములుగ బాధించుచు యుద్ధమును జేసిరి.

కొంత కాలమునకు రాక్షసులు దేవతలను వెడల గొట్టి స్వర్గపట్టణమును ఆక్రమించిరి. అందువలన అతిది విచారించి అఖండతేజోరాశియగు పరమపురుషుని గూర్చి తపంబుజేసెను.

ఆ తపంబునకు సంతోషించి పరమపురుషుడు ప్రసన్నుడై అతిది ఎదుట నిలచి వరమును కోరమని పల్కెను.

ఆమె ఆ పరమపురుషుని అనేక విధములుగ ప్రార్థించి తన కొడుకులను, తన సవతి కొడుకులు రాక్షసులు బాధించుటను జెప్పెను.

ఆ మాటలను విని పరమేశ్వరుడు—" ఓ తల్లీ ! విచారమును పొందకుము. నేను నా అంశముచేత నీ గర్భమునందు బుట్టి నీ పుత్రులను కాపాడి నీ కోరికను నెరవేర్చెదను " అని జెప్పి యదృశ్యుడాయెను.

అంతట కొంతకాలమునకు అతిది గర్భమును ధరించి సూర్యుం గనెను. ఆ బాలుని అనేక విధములుగా స్తోత్రములను జేయగా ఆకాశవాణి-" యితడు మార్తాండుడని ప్రఖ్యాతి గలిగి సూర్యాధికారమున ప్రకాశించుచు దేవతలను రక్షించి అసురులను నాశనము జేయును " అని జెప్పెను. ఆ మాటలను తల్లిదండ్రులును, దేవతలును విని సంతోషమును పొందిరి.

పిమ్మట సూర్యుడు దేవతలను వెంటబెట్టుకుని దనుజుల మీదకు యుద్ధమునకు వెళ్ళి రాక్షసులను భస్మీభూతులుగ జేసి బృందారకులకు స్వర్గపట్టణమును ఇచ్చెను. ఆ కారణమున సూర్యుడు కస్యపమునికి తనయుడుగా పుట్టెను.

సూర్యుడు విశ్వకర్మ కుమార్తెయగు సంజ్ఞయందు వైవస్వత మనువును, యముని, యమున యను కన్యకను బడసెను. ఛాయ యను అంగనయందు శనైశ్వరుని, తపతి యను కన్యకను బడసెను" అని జెప్పి పిమ్మట యిటులని జెప్పుటకు ఆరంభము జేసెను—

## రాజవర్ధనుని చరిత్ర

"క్రోష్టికీ! సూర్యుని మహాత్మ్యమును వినుము! పూర్వము దమనుడను రాజునకు రాజవర్ధనుడను తనయుడు గలడు. రాజవర్ధనుడు రాజ్యమును పొంది దుష్టమృగ, చోర, శత్రుబాధలు, దారిద్ర్యము, రోగములు లేకుండునటుల ధర్మ మార్గమున పాలించుచు విదూరధుడను రాజు కుమార్తె మానిని యను నామెను వివాహమాడి ఆమెవలన అనేకమంది సుతులను బడసెను.

యీ విధముగా యేడువేల సంవత్సరములు రాజ్యము పాలించి ఒకనాడు తన భార్య తల అంటుచు తన కన్నుల వెంట నీరుకారి రాజుమీద బడగా జూచి— "ఏ కారణమున విచారించుచుంటివి ?" అని అడిగెను.

అంతట ఆమె— "ఓ రాజచంద్రమా ! నీ శిరోజములు ఫలితము లగుచున్నవి. అందువలన విచారము గలిగినది" అని జెప్పెను.

ఆ మాటలను రాజు విని— "ఓ సుందరీ ! యేల విచారమును పొందెదవు ? మనము యేడువేల సంవత్సరములు సుఖములను పొందితిమి. పరిపాలనా సామర్ధ్యము, సుగుణ సంపదగల పుత్రులం బడసితిమి. జరామరణములను తప్పింప శక్యముగాదు. రాజ్యమును పుత్రులకు వప్పగించి మనము తపంబునకు బోవుదము" అని జెప్పెను.

ఆ మాటలను మంత్రి పురోహిత పౌరాదులు విని కొంతసేపు విచారించి— "యీ రాజు మనలను కన్న పుత్రులకంటెను యెక్కుడు ప్రేమతో పరిపాలనము జేయుచుండెను. ఈ రాజులేని బ్రతుకు మనకు వ్యర్ధమగును" అని విచారించి సామర్ధ్యముగల బ్రాహ్మణులను తపోవనమునకు పంపించి తమ రాజునకు పదివేల సంవత్సరములు ఆయువు గలుగునటుల జేయుటకు నిశ్చయించుకుని రాజునకు దెలియకుండ తపోవనమునకు పంపించిరి.

అంతట ఆ బ్రాహ్మణులు సూర్యునిగూర్చి ఘోర మగు తపంబును జేయగా సూర్యుడు ప్రత్యక్షమై వారు కోరిన ప్రకారము రాజునకు పదివేల సంవత్సరములు ఆయుర్దాయమును యిచ్చి అదృశ్యుడాయెను.

అప్పుడా బ్రాహ్మణులు వచ్చి మంత్రి పురోహితా దులతో జెప్పి ఈ సంగతి రాజునకు విన్నవించి మహా సంతోషముతో తమ యిండ్లకు జనిరి.

ఆ మాటలను రాజువిని విచారమనస్కుడై యుండెను. అంతట రాజు భార్య రాజునుజూచి—"రాజా! ఈ పుర జనులందరును సంతోషమును పొందుచుండగా నీవు విచారమును పొందుటకు హేతువు యేమిగలదు?" అని అడిగెను.

ఆ మాటలను రాజేంద్రుడు విని—"తరుణీ! నాకు యిష్టమయిన మీరందరును వుండగా నాకు పదివేల సంవత్సరములు ఆయువు గలుగుట మంచిదిగాదు. మీరు లేనియెడల నాకు పదివేల సంవత్సరములు ఆయువు గలుగుట దుఃఖమేగదా? మీరు అందరును, మంత్రి పురోహితాదులు అందరును మృతిని పొందిన పిమ్మట నేనుమాత్రము బ్రతికియున్న ప్రయోజన మేమియున్నది?" అని పలికెను.

అంతట రాజు భార్య—“ అటులయిన మీరు ఆలో చించుట యుక్తమే ” అనెను.

పిమ్మట రాజు భార్యా సమేతముగా హిమవంత మునకువెళ్ళి సూర్యునిగూర్చి తపంబుజేయగా సూర్యుడు ప్రత్యక్షమై రాజు కోరిన ప్రకారము భార్యాపుత్రాదుల కున్ను, పురజనులకున్ను పదివేల సంవత్సరములు ఆయువు కలుగునటుల వరంబులనిచ్చి అదృశ్యుడాయెను.

వరములను పొంది రాజు భార్యా సమేతముగా నిజపట్టణమునకు వచ్చి యీ వృత్తాంతమంతయును పౌర, అమాత్యాదులు అందరకు జెప్పగా వారు విని సంతో షమును పొంది సుఖముగా నుండిరి. కావున నో క్రోష్టికీ! సూర్యు నారాధించినవారికి ఆయురారోగ్య ఐశ్వర్యాదులు గలుగు ననుటకు సందేహము లేదు ” అని మార్కం డేయులు జెప్పెను.

## సూ ర్య వం శ ము

క్రోష్టికీ! సూర్యుని సంతతినిగూర్చి జెప్పుచున్నాను వినుః ఇటువంటి ప్రభావముగల సూర్యునకు వైవస్వతుడు ప్రఖ్యాతిని బొందెను. అతనికి యిక్ష్వాకుడు, నాభగుడు

రిష్టుడు, శర్యాతి, కరూషకుడు, పరిష్యంతుడు, నాభాగుండు. వృషధృడు, ధృష్టుడు వారందరును వేరువేరుగ రాజ్య పరిపాలనము జేసి ప్రఖ్యాతిని పొందిరి. మనువు మిత్రా వరుణ యిష్టిని జేయగా ఇళ సుద్యుమ్నుడు పుట్టెను. అతనికి అడవికి వేటకు వెళ్ళగా వనకన్యయందు పురూర వస్సు పుట్టెను. ఇళసుద్యుమ్నుడు తన కుమారులు యుత్కల వినత గయులకు రాజ్యమును పంచియిచ్చి ప్రతిష్ఠానపురము బురూరవస్సునకు యిచ్చెను.

## వృషధృడునకు శూద్రత్వము గలుగుట

మను పుత్రులలో వృషధృడు అడవికి వేటకువెళ్ళి అనేక మృగముల వేటాడి అలసి, బ్రాహ్మణుని ఆవును జూచి అరణ్య మృగము అని తలంచి బాణముచే కొట్టగా విప్ర కుమారుడు జూచి శూద్రుడవు గమ్మని శాపము యిచ్చెను. అందువలన వృషధ్రుడు శూద్రత్వమును పొందెను.

## నాభాగ చరిత్ర

కరూషకుని వృత్తాంతమును జెప్పుచున్నాను : కరూషకునకు గౌరూషులు, క్షత్రియులు మొదలగు సుతులు కలిగిరి. దృష్టునకు నాభాగుడు పుట్టెను.

నాభాగుడు సకలవిద్యలయందు ప్రవీణుడై, వైశ్య కన్యను వివాహమయి, జాతి భ్రష్టుడయి, పశుపాలన, కృషి, వాణిజ్యములు, వైశ్యావృత్తి అవలంబించి జీవించు చుండెను. అతనికి భవనుడను పుత్రుడు కలిగెను. ఆతడు గోవులు కాయుట నీచమని తలంచి హిమవంతమునకు పోయి అస్త్రశస్త్రాదులను నేర్చుకుని నిజ నగరమునకువచ్చి జ్ఞాతుల నోడించి రాజ్యమునుపొంది తండ్రిని రాజ్యమును పాలింపమనెను.

తండ్రి అయిన నాభాగుడు—"పుత్రా! నేను పితృవాక్యమున వైశ్యావృత్తిని పొందితిని. గాన నీవే రాజ్యమును పరిపాలనము జేయుము "అని తన కుమారుడు భవనుని నియమించెను.

అంతట నాభాగసుతుడు జనకుని యిష్టమున రాజ్య భారము వహించి చతుస్సముద్ర పరివేష్టితమయిన నీ భూమండలము యేకఛత్రాధిపతియై పాలించెను" అని మార్కండేయులు జెప్పెను.

## వత్సంధ్రుని చరిత్ర

"క్రోష్టికీ! వత్సంధ్రుడను రాజు చరిత్రను జెప్పుచున్నాను. వత్సంధ్రుడు రాజ్యమును పాలించు కాలమున కుజంభుడను

రాక్షసుడు లోకములను బాధించుచుండగా ఆ రాక్షసుని సంహరించి సౌనందయను కన్యను వివాహమై అనేక యజ్ఞములను జేసి ధర్మపాలనమును జేయుచు సకల సుఖములను పొంది రాజ్యమును కుమారులకు యిచ్చి భార్యాసమేతుడై తపోవనంబునకు పోయెను.

## ఖనిత్రుని చరిత్ర

ప్రాంసువను రాజేంద్రుడు రాజ్యమును పాలించి తన జ్యేష్ఠ పుత్రుడగు ఖనిత్రునకు రాజ్యపాలనము యిచ్చి తాను భార్యాసమేతుడై తపోవనంబునకు పోయెను.

ఖనిత్రుడు రాజ్యమును ధర్మపరిపాలనమును జేయుచు, భ్రాతృవత్సలుడై తమ్ములు నలుగురకు తూర్పు దక్షిణము, పడమర, ఉత్తరమునందుగల దేశములకు అధిపతులుగజేసి అత్రిగోత్రజుడైన సుహోత్రుని, గౌతమ వంశజుడైన నకుశాగ్రబుద్ధిని, కస్యప వంశజుడైన ప్రమోదుని, వసిష్ట పుత్రుడైన హసితుని క్రమముగ తమ్ములు నలుగురుకు మంత్రులుగ నియమించి తాను పరిపాలనము జేయుచుండెను.

యిటుల చాలకాలము జరుగగా ప్రమతికి ఉప మంత్రి అయిన విశ్వవేది అను మంత్రి దుర్మంత్రముజేసి అన్న అయిన ఖనిత్రుని మీద తమ్ములకు ద్వేషమును పుట్టించి ఖనిత్రాదులను జంపుటకు విశ్వవేది మొదలగు బ్రాహ్మణులు అభిశారిక మనుహోమములను జేయించిరి. ఆ హోమమువలన హోమగుండమునుండి గొప్ప మహా శక్తిపుట్టి—"నన్ను పుట్టించిన కారణమేమి ?" అని మంత్ర వేదిని అడిగెను.

అంతట మంత్రవేది—"అమ్మా! ఖనిత్రుని దారాపుత్రాదులతోకూడా నిర్మూలనముజేసి ఆ రాజ్యమును సకల సంపదలను మాకు యిప్పింపుము" అని కోరిరి.

ఆ మహాశక్తి ఖనిత్రునివద్దకు వెళ్ళి చూడగా ధర్మ స్వరూపుడున్ను, మహాపుణ్యశాలియు, పరధన, పరకాంతా విరక్తుడున్ను, పుణ్య దురంధరుడున్ను అయిన ఖనిత్రుని జూచి భయముజెంది వెంటనే తనను పుట్టించిన ఖనిజ సోదర వర్గమును సర్వమును నాశనముజేసి అదృశ్య మాయెను.

ఖనిత్రుడు యీ సంగతి కుశాగ్రబుద్ధియను మంత్రి వలన తెలుసుకుని విచారమును పొంది రాజ్యభారము

నంతను నిజపుత్రుడు క్షితపునకు యిచ్చి తాను భార్యా సమేతముగా తపంబునకు జనెను " అని మార్కండేయుడు జెప్పగా క్రోష్టికి విని ఆనందమును పొందెను.

## క్షుతప భూపాలుడు

మార్కండేయుడు జెప్పుచున్నాడు—" క్రోష్టికీ! క్షితప భూపాలుడు తండ్రికంటె ఉత్తముడని ప్రఖ్యాతి గలిగి భూమిని పాలించుచుండెను. అతని గుణంబులు వేనోళ్ళ గీర్తింపుచుండిరి. దేవాలయములను గట్టించి, దేవతాదులకు నిత్యము ధూప దీప నైవేద్యంబులకున్ను, రాగ భోగ నృత్యాది నితోర్యత్సవాదులకున్ను అనేక భూములను, గ్రామములను యిచ్చి బ్రాహ్మణులకు వేదాధ్యయనాది సకల శాస్త్రములు అభివృద్ధి అగుటకున్ను, యజ్ఞయాగాది క్రతువులు జరుగుటకున్ను; నిత్య కర్మలు నిరాటంకముగా జరుగుటకు అనేక గ్రామములను, భూములను యిచ్చి వాటిమీద సుంకములు లేకుండునటుల నిర్ణయించెను.

తనకు విదర్భదేశ రాజు పుత్రికయగు నందిని యను భార్యయందు వివింశుడను పుత్రుడు పుట్టెను. అతడు రూప, సౌందర్య, సుగుణసంపత్తి గలవాడై, సకల

విద్యా పారంగతుడై శౌర్య సాహసాది గుణములు గలవాడై ప్రఖ్యాతి గలిగియుండెను. ఆ కుమారునకు రాజ్యభారమును యిచ్చి తాను భార్యాసమేతుడై తపోవనమునకు పోయెను " అని జెప్పెను.

## వివింశసుతుడు ఖనిత్రు చరిత్ర

**మా**ర్కండేయుడు జెప్పుచున్నాడు—" క్రోష్టికీ! కొంత కాలమునకు వివింశునకు ఖనిత్రుడను పుత్రుండు పుట్టెను. అతడు సకలగుణ సంపన్నుడు కాగా అతనికి రాజ్యభారమును వప్పగించి తాను తపంబునకు పోయెను.

ఖనిత్రుడు అనేక యాగములు, పుణ్యకార్యములు జేయించుచుండెను. గాని సంతాన్నము గలుగలేదు. పుత్రార్థియై పిత్రుయాగము జేయుటకు ఆలోచించుచుండగా ఆ యజ్ఞమునకు కావలసిన మాంసముకొరకు రాజు అడవికి వెళ్ళి మృగములకొరకు తిరుగుచుండగా మృగములు భయమునుజెంది రాజు వద్దకు వచ్చి యిటులని ప్రార్థించెను—

"ఓ రాజా! నీవు నన్ను యజ్ఞపశువుగా గైకొనుము. నేను యజ్ఞమునందు మరణము నొందెదను" అని ఒక మృగము జెప్పెను. వేరొక మృగము అటులనే పలికెను.

యిటుల పలుకుచుండెడి మృగముల వాక్యములను ఆ రాజు విని ఆశ్చర్యమును పొంది యిటులని పలికెను— "ఓ మృగోత్తములారా! భూలోకమునందు జన్మించిన ప్రాణికోటి యంతయు ప్రాణభయము గలిగి తన ప్రాణములను రక్షించుకొనుటకు ప్రయత్నము జేయుచుండును. కొన్ని మృగములు నన్ను జూచి ప్రాణభయమున పారిపోవుచుండగా మీరు భయముజెందక 'నన్ను జంపుము' అని పలుకుచున్నారు, కారణమేమి?" అని యడిగెను.

మృగములు జెప్పుచున్నవి—"ఓ రాజశ్రేష్ఠమా! భూలోకమునందు బుట్టిన ప్రాణికోటికి సంతానము గల్గెనేని జన్మ సాఫల్యమును పొందును. పితృవర్గమునకు గతులు గలుగును. పుత్రహీనునకు ఇహమునందును పరమునందును సుఖములేదు. మరియు అటువంటివారల జన్మము మేక మెడమీదనున్న చన్నులవలె నిరర్థకములు. మేకకు బరువునకుగదా; నాకు సంతోషములేదు, యిటువంటి

నా శరీరము శునకాదులు తినును. అంతకంటె పుత్రార్థివైన నీ పిత్రు యజ్ఞమునకు ఉపయోగపడుట ఉత్తమమని తలంచితిని " అని ఒక మృగము పలికెను.

ఆ సమయమునందు మరియొక మృగమువచ్చి యిటుల జెప్పుచున్నది—" రాజేంద్రా! నా శరీరమును నీ యజ్ఞమునకు తీసుకునిపొమ్ము. ఎందువల్లననగా నాకు భార్యయు, పుత్రులు, పుత్రికలు, మనుమలు మొదలగు బంధు జనము చాలామందిగలరు. వీరందరును ఆహా రమునకు అడవియందు సంచరించునప్పుడు ఏ దుర్మార్గుడు వీరిని చంపునో అని వీరు యింటికి వచ్చువరకు విచా రించుచుందును. వీరందరును సుఖంబుగా నున్నప్పుడే నేను మృతిని బొందితినేని యిహపరములందు సుఖములు గలుగును. నీ యజ్ఞము సఫలమిచ్చును. అందువలన నన్ను జంపమంటిని " అని జెప్పెను.

రాజు మృగములు జెప్పిన వాక్యముల అర్థమును దెలుసుకుని—" ఓ మృగములారా! మీరు సుఖంబుగా నుండుడు. నేను తపంబునకు హిమవంత పర్వతమునకు వెళ్ళి అచ్చట పరమేశ్వరుని గూర్చి తపంబుజేయుదును " అని జెప్పెను.

పిమ్మట రాజు బదరికావనమునకు జని గోమతి యను నదీతీరమునందు ఇంద్రునిగూర్చి తపంబుజేసి యింద్రుని అనుగ్రహమువలన పుత్రలాభమును పొంది నిజరాజధానికి వచ్చెను.

అంతట కొన్నిదినంబులకు ఆ రాజేంద్రునకు బలాశ్వుండను పుత్రుడు పుట్టెను. ఆ కుమారుడు కాల క్రమమున సకలశాస్త్ర పారంగతుడై యవ్వనమును పొందగా రాజ్య పరిపాలనమునకు కుమారుడు తగిన వాడని సంతోషమును పొంది పుత్రుడు బలాశ్వునకు రాజ్యభారమును వప్పగించి తపంబునకు జనెను.

## బలాశ్వని చరిత్ర

బలాశ్వుండు సకల రాజులను జయించి భూమండలము నకు చక్రవర్తియై ధర్మపరిపాలనము జేయుచుండగా యితర రాజులు సహించలేక ఒక తావున గుమిగూడి చతురంగ బలములతో సహితముగా వచ్చి బలాశ్వని పట్టణమును ముట్టడించిరి. అంతట బలాశ్వుడు తన అశ్రద్ధ వలన మోసము గలిగెనని విచారించి మంత్రి సామంత సేనానాయకుల రప్పించి దర్బారుజేసి యేమి జేయుటకు

ధోచక రెండు చేతులతోను నోరును మూసుకొనెను. ఆ రెండుచేతుల సందుల నుండి వెలువడిన వేడిగాలివలన చతురంగబలములు పుట్టినవి.

అంతట రాజున్ను, మంత్రులు మొదలగువారున్ను సంతోషించి ఆ సేనలనుతీసుకుని శత్రువులతో యుద్ధమున జేయగా శత్రురాజులు భయపడి ప్రతి సంవత్సరమున కప్పములను యిచ్చునటుల యేర్పాటులను జేసుకొని తమ తమ తావులకు వెడలిపోయిరి. ఆ కారణమున బలాశ్వునక కరంధముడని కీర్తి కలిగెను.

కొంత కాలమునకు వీరయను భార్యయందు పుత్రుడు కలిగెను. అతనికి అవీక్షిత్తని పేరుపెట్టెను. ఆ కుమారునకు కణ్వమహాముని వలన సకల శాస్త్రములు సమగ్రముగా నభ్యసించెను.

## అవీక్షిత్తు చరిత్ర

క్రోష్టికీ! అవీక్షిత్తు గురు అనుమతమును పొంది హేమ వర్మ యను కన్యారత్నము యొక్క స్వయంవరమునకు పోయి యెల్లరాజులను జయించి ఆ కన్యారత్నమును

గొనియెను. అనేకస్వయంవరములకు వెళ్ళి రాజులనందరను జయించి గౌరి, సుభద్ర మొదలగు అనేకమంది కన్యలను వివాహమాడెను.

## అవీక్షితుడు వైశాలిని స్వయంవరమునకు వెళ్లుట

విదిశాపురాధిపుడగు విశాలుడను రాజు తన కుమార్తె వైశాలిని యను కన్నియకు స్వయంవరమును జాటించగా ఆ వృత్తాంతమును అవీక్షిత్తువిని చతురంగ బలములను తీసుకుని వెళ్ళి ఆ కన్యను బలాత్కారముగా తీసుకుని వచ్చుటకు ఆలోచించెను.

అచ్చటనున్న రాజులందరు యీ రాజుచేత అనేక పర్యాయములు జయింపబడినవారగుటచేత అందరును యేకమై అవీక్షిత్తును మాయోపాయమున పట్టుకుని విశాలుని వద్దకు తీసుకొనిపోయిరి. విశాలుడు అవీక్షిత్తు పట్టుబడుటకు సంతసించి తన బంధికానాయందు బంధించి తన కుమార్తెను తక్కిన రాజనందనులలో ఒక్కని వరింపవలసినదని జెప్పెను. రాజకుమార్తె అవీక్షిత్తును తప్ప యితరులను

వరింపనని జెప్పెను. అందువలన తండ్రియైన విశాలునికి కోపమువచ్చి ఒక్క రాజపుత్రునకు యిచ్చి వివాహము జేయుటకు ప్రయత్నము జేసెను.

ఆ ప్రయత్నమును వైశాలిని విని తండ్రి అయిన విశాలుని జూచి-"తండ్రీ! నీవు యిటువంటి ప్రయత్నము జేయుట మంచిదిగాదు. నేను అవీక్షితుని తప్ప యితరుల వరింపను" అని జెప్పెను.

ఆ మాటలను విశాలుడు విని ఏమిజేయుటకు వీలు లేక జ్యోతిష్కుల రప్పించి-"పండితులారా! నా కన్నియ స్వయంవరమునకు అనేక విఘ్నములు గలుగుచున్నవి. ఈ సమయమునందు వివాహము జేయుట తగునా? తగదా?" అని ప్రశ్నించెను.

అంతట కొందరు జ్యోతిష్కులు—"కొంత కాలమువరకు ఆలస్యము జేయుట మంచిది" అని రాజునకు జెప్పిరి.

ఆ మాటలు రాజు విని అంగీకరించి కుమార్తెకు స్వయంవరమును కొంతకాలమువరకు నిలుపుజేసి పిమ్మట జేసెదనని జెప్పెను. స్వయంవరమునకువచ్చిన రాజులు ఎవరి తావులకు వారు పోయిరి. అవీక్షిత్తును మాత్రము కారాగారమునందు ఉంచెను.

# కరంధముడు విశాలుని వివాదకు యుద్ధమునకు వచ్చుట

కరంధముడు తన పుత్రుడు అవీక్షిత్తు కారాగారమునందు వున్న సంగతి తెలిసి విచారమును బొంది యీ సంగతి మంత్రి సామంత సేనానాయకులతో జెప్పి విచారించగా వారందరును విచారించి—"రాజోత్తమా ! అవీక్షిత్తు యుద్ధవిశారదుడు ఆ వీరుని యుద్ధమునందు దేవేంద్రాదులు జయింపలేరు అధర్మ యుద్ధమున, యేమరిపాటున అతనిని బంధించి యుందురు" అని జెప్పిరి.

ఆ మాటలను కరంధముడువిని చతురంగ బలములను తీసుకుని రణభేరీని వేయించి బయలుదేరి వెళ్ళి విదిశాపురంబును నలువైపులను ముట్టడించి విశాలుని బంధించి, తన కుమార్తు అవీక్షిత్తును కారాగారమునుండి విడిపించెను. అటుల విడిపించి తన కుమారుని రప్పించి కౌగలించుకొని సమీపమునందు కూర్చుండబెట్టుకొనెను.

అంతట విశాలుడు—"రాజేంద్రులారా ! నాయందు కోపము వహింపతగదు. నా కుమార్తె వైశాలినిని అవీక్షిత్తుకు

నకు యిచ్చి వివాహము జేసెదను. నా తప్పును క్షమించి యిందుల కంగీకరించ వలసినది " అని కోరెను.

ఆ మాటలను కరంధముడు విని సంతోషించి తన కుమారుడు అవీక్షిత్తు అభిప్రాయమును తెలుసుకొనుటకు గాను తనయునివైపు జూచెను.

అవీక్షిత్తు విచారము గలవాడై—" రాజేంద్రా! నేను యీ కన్యను జూచుచుండగా నేను యితరులకు పట్టుబడితిని. అందువలన ఈ వైశాలినిని నేను వివాహము ఆడను " అని జెప్పెను.

ఆ మాటలను వైశాలిని విని—" రాజకుమారా! నీవు అటుల పలుకుట న్యాయముగాదు. నీవు అజేయుడవు, పరాక్రమశాలివి. నిన్ను యుద్ధమునందు దేవతలు సహితము జయించలేరు. యీ రాజులందరును నీయందు అసూయ గలవారై యేకమై అన్యాయముగ యుద్ధము కల్పించి నిన్ను పట్టుకొనిరి గాని, నిజముగా నిన్ను యుద్ధమునందు జయించువారు యీ లోకములో లే"రని పలికి—" ఓ రాజపుత్రా! నిన్నుగాక యితరులను నేను వరించను " అని పలికెను.

ఆ వచనములు కరంధముడు విని కుమారునకు అనేక విధములుగ జెప్పెను. అందులకు కుమారుడు——"తండ్రీ! నీవు యీ విధముగా పలుకుట న్యాయముకాదు. శత్రువులచేత పట్టుబడిన క్షత్రియాధముడు స్త్రీ సమానుడు. కనుక నేను వివాహము జేసుకొనువాడనుగాను. అదియును గాక యే స్త్రీ ముఖమును జూడను. కావున నాకు తపో వనంబునకు పోవుటకు అనుజ్ఞ యివ్వవలసినది" అనిజెప్పి అనుజ్ఞను పొంది వనంబునకు వెడలిపోయెను.

అంతట విశాలుడు—"అమ్మా! వైశాలినీ! నిన్ను అవీక్షిత్తు వివాహము ఆడడు. కావున మరియొక రాజ పుత్రుని వరింపుము" అని పలికెను.

అందుల కామె——"తండ్రీ! నేను అవీక్షిత్తును తప్ప యితరులను వివాహము ఆడను. నేను తపంబునకు అడవికి పోయి యెన్ని జన్మలనెత్తినను అవీక్షిత్తుయే భర్త యగునటుల యీశ్వరుని గూర్చి తపంబు జేయుదును. గాన నేను తపంబు జేసుకొనుటకు వనంబునకు వెళ్లుటకు అనుమతించ వలసినది" అనిజెప్పి అనుజ్ఞపొంది తపంబు నకు వెడలిపోయెను.

## వైశాలిని తపః ప్రభావము

వైశాలిని తల్లిదండ్రుల అనుజ్ఞను పొంది వనంబునకువెళ్ళి నిరాహారియై ఘోరతపంబు జేయుచుండెను.

ఆ తపంబునకు దేవేంద్రుడు సంతసించి వైశాలిని వద్దకువచ్చి—"మానినీ! నీకు అవీక్షిత్తువలన సప్త ద్వీపములను పరిపాలింపగల కుమారుడు పుట్టును. నీ కుమారుడు దేవతలు జయింపలేని అశంకు, తరుజిత్తులను రాక్షసులను జయించి కీర్తిని పొందును" అని జెప్పి అదృశ్యుడాయెను.

ఆ మాటలను విని వైశాలిని నియమిత వ్రతమును జేయుచు ఆ వనమునందే నివసించియుండెను.

## అవీక్షిత్తు జనని వ్రతమును బూనుట

అవీక్షిత్తు జనకుడు నిజ నగరమునకు వచ్చి జరిగిన వృత్తాంతమును తన భార్య అయిన అవీక్షిత్తు తల్లికి జెప్పగా ఆమె విచారమును పొంది కోరిన కోరికలను

యిచ్చునట్టి కిమచ్ఛకమను వ్రతమును ఆచరించి జేయుటకు నిశ్చయించుకుని తన కుమారుడు అవీక్షిత్తును వెదకి రప్పించి—“తనయా! తల్లిదండ్రుల మనోభీష్టములను కుమారులు దీర్చుట ధర్మము. అందువలన నా కోరిన కోరికను నెరవేర్చుటకు కిమచ్ఛక మను వ్రతమును జేయుము” అని బోధించి తన కుమారునిచే ఆ వ్రతమును జేయించుచుండెను.

ఒకనాడు తన కుమారుని జూచి—“తనయా! అవీక్షిత్తు! నీవు నీ తండ్రి కోరికను గూడ నెరవేర్చుట ధర్మము” అని పలికి కుమారుని తండ్రివద్దకు పంపించెను.

అంతట కరందముడు కుమారుని కౌగలించుకుని మంచిమాటలను జెప్పి—“కుమారా, అవీక్షిత్తు! నాకు పౌత్రుని జూడవలెనని కోరిక గలదు. పౌత్ర దర్శనమున పితరులకు స్వర్గలోకప్రాప్తి గలుగునని పెద్దలు జెప్పుదురు” అని పలికెను.

ఆ మాటలను కుమారుడు అవీక్షిత్తువిని—“ఓ తండ్రీ నీ మనోభీష్టము నెరవేర్చుట సాధ్యముకాదు. నేను స్త్రీల యెదుట అ ప జ య ము ను పొందితిని. అందువలన

స్త్రీసమానుడ నైతిని. కావున నేను నీ యిష్టము నెరవేర్ప జాలను. యితర అభిమతములను కోరుము. యెంత దుష్కరమైనను నెరవేర్చెదను " అని జెప్పెను.

ఆ మాటలను తండ్రి విని—" కుమారా! సకలగుణ సంపన్నుడవైన నీవంటి కుమారులుగల తల్లిదండ్రులకు నెరవేరని కార్యములు యేవియు నుండవు. అందువలన నీవు మాకు పౌత్ర దర్శనము గలుగజేయుము " అని జెప్పెను.

అవీక్షిత్తు తండ్రి కోరికను నెరవేర్చుటకన్న వేరు ధర్మములు లేవని ప్రతిజ్ఞాభంగము జేయుటకు అంగీక రించి రాజ్యపాలనమునందు తండ్రికి సహాయముగా రాజ కార్యములను నెరవేర్చుచుండెను.

యీ విధముగా కొంతకాలము జరిగిన పిమ్మట ఒకనాడు వేటకు అడవికి జనెను. ఆ సమీపమునందు— " అయ్యయ్యో! నన్ను రక్షింపుడు, రక్షింపుడు, దీను రాలను " అని యేడ్చుచున్న స్త్రీ ఆలాపము వినబడెను. రాజపుత్రుడు ఆ రోదనము విని ఆ ఆర్తారావము వచ్చు చున్న వైపునకు తన గుఱ్ఱమును తోలెను.

ఆ సమయమునందు దృఢకేసుడు అను రాక్షసుడు ఒక్క అంగనామణిని యెత్తుకొని పోవుచుండుటను జూచెను.

రాక్షసుడు యెత్తుకొని పోవుచున్న అంగనామణి యిట్లని పలుకుచు యేడువసాగెను—"యీ భూలోకము నందు యెవ్వని బలపరాక్రమములు విని రాజులు భయమును పొందుచుందురో, యెవ్వని ప్రతాపాది సాహస ధైర్యాది గుణములను దేవతలు సహితము కొనియాడు చుందురో అటువంటి బలపరాక్రమ సంపన్నుడైన అవీక్షిత్తు భార్యను వీరప్రతాపశాలి యగు కరంధముని కోడలను, అటువంటి నన్ను యీ దుర్మార్గుడయిన రక్కసుడు యెత్తుకొని పోవు చున్నాడు" అని రోదనము జేయుచుండెను.

ఆ మాటలను అవీక్షిత్తు విని—"యేమి చిత్రముగ నున్నది? యీమె నాకు భార్య యెట్టులయ్యెను? నా భార్య యీ రక్కసునకు యెట్టుల పట్టుబడెను" అని ఆలోచించి ఖడ్గమును దీసి రాక్షసుని మీదికి గుఱ్ఱమును దుమికించెను.

ఆ రాక్షసుడు వైశాలినిని క్రింద పారవైచి రాజుతో యుద్ధమునకు ప్రారంభము జేసెను. అంతట అవీక్షిత్తు తన ఖడ్గమున రాక్షసుని సంహరించగా దేవతలు సంతోషించి పుష్పవర్షమును కురిపించిరి.

దేవతలు సంతోషముతో అవీక్షిత్తునకు ప్రత్యక్షమై "ఓ రాజపుత్రా! యీ రాక్షసుడు నిత్యము మమ్ములను బాధింపుచున్నాడు. యీ దుర్మార్గుని జంపుటచేత నీవు సర్వోత్తముడవని తలంచితిమి. నీకు కావలసిన వరములను కోరుము యిచ్చెదము" అని దేవతలు పలికిరి.

## వైశాలిని వృత్తాంతము

అవీక్షిత్తు దేవతలు పలికిన వాక్యములను వినిన పిమ్మట దేవతలను—"ఈమె యెవరని" ప్రశ్నించిరి.

అందులకు దేవతలు ఇటులని జెప్పిరి-"అవీక్షిత్తూ! ఈ వైశాలినీ పుత్రిక వైశాలుని కుమార్తె. ఈమె నీ కొరకు అనేక బాధలను పొందుచున్నది, యీమె యందు నీకు సకలగుణ సంపన్నుడగు పుత్రుడు పుట్టును. యీమె తపంబుజేసి నీవలన సర్వలోక పూజ్యుండును, సప్త ద్వీపాధిపతియు నగు పుత్రుడు గలుగునటుల వరములను పొందియున్నది" అని జెప్పి అదృశ్యులైరి.

పిమ్మట అవీక్షిత్తు వైశాలినిని గాంచి—"నీవు యీ తావునకు యెటుల వచ్చితివి?" అని అడిగెను.

